౩౦. పుణ్యసంగ్గమంలోను
౩౧. దారాదత్తంసేశి సుపిణ
౩౨. ంస్తిమి అష్టలోకధమ్మ
౩౩. పాలకులుసాక్షిగాను ఇస్తి
౩౪. మియాధమ్మము ఎరింగి
౩౫. న్నితిరస్కరించక పాలిం
౩౬. చ్చినపుణ్యుల పాదపద్మ
౩౭. ములు తమశిరసున నుం
౩౮. తును॥స్వదత్తా ద్విగుణ
౩౯. ం పుణ్యం।పరదత్తాను
౪౦. పాలనం।పరదత్తాపనహారే
౪౧. ణ! స్వదత్తం నిష్ఫలం భ
౪౨. వేత్॥ మంగళమహా
౪౩. శ్రీ శ్రీం జేయును॥

శాసనంలో రాజు బిరుదులూ, దానం చేసిన గ్రామమూ మొదలైనవి వర్ణితమైన భాగం బాగానే వుందికాని అసలు రాజు పేరుగలభాగంమాత్రం పోయింది. అందువల్ల శాసనం ఉండీలేనట్లే. ప్రయోజన విరహితం.

నెల్లూరుమండలంలో పరిపాలన సాగించిన పల్లవ రాజులు కొందరు కనబడుతున్నారు. వీరి శాసనాలు దర్శి (౪౩, ౬౯ నెంబర్లుగల శాసనాలు), కందుకూరు (౬౧, ౬౨, ౬౩ నెంబర్లుగల శాసనాలు), కనిగిరి(౨౪ వ నెంబరు శాసనం), ఉదయగిరి (౬ వ నెంబరుశాసనం) తాలూకా గ్రామాలలో ఉన్నవి. ఈశాసనాలువ్రాయించిన పల్లవరాజు లందరూ ముక్కంటికాడువెట్టివం శావతారులమని చెప్పుకొన్నవారే. వీరందరు ఒకరిద్దరు తక్క క్రీస్తుశకం పదుమూడవ శతాబ్దిలోవారే. కనిగిరి, ఉదయగిరి శాసనాలలోని పల్లవరాజ బిరుదులే దీనిలో కూడా ఉండడంచేత సంగమేశ్వరంలో శాసనం వేయించిన పల్లవరాజుకూడా కనిగిరి, ఉదయగిరి పల్లవరాజ వంశములలోనివాడై ఉండవచ్చును.

ఇక సంగమేశ్వరంలోని రెండవశాసనం చాలా ఇటీవలిదని తోచింది. అయినా దాని పాఠంకూడా ఇక్కడ ఇస్తున్నాను. శిథిలపడివున్న శివాలయమును ఉద్ధారం చేసినప్పుడు వేసిన శాసన మిది. దీనిలో రాజు పేరులేదు. శాసనంకూడా అసంపూర్తే. శకవర్ష సంఖ్య ౧౩౦౭ అని ఒకవిధంగా తేల్చవచ్చును కాని దానిని మాటలతో తెలిపేవిధంకూడా మరచిపోయిన ఇటీవలి కాలంలోనే ఈశాసనమును వ్రాశారేమోఅని నాతలంపు.

శాసనపాఠము

సంద చంద్రుడు సూర్యుడు

౧. శ్రీ శకవర్ష శిశిరం నాగగగనపక్ష
౨. సంఖ్య ప్రభవాబ్ద।(బ్ద) ఆశ్వయుజ శు
౩. క్లపక్షు నవమ (ప్రథమి?) తిథి శివాలయం
౪. కుర్యాత్ శ్రీశైలశిఖర ఆ[గ్నే]
౫. యభాగే పంచానన శివో
౬. జనవిస్తార ఆయామధ్య
౭. తు సమాపణ క్షీరవాహినీ
౮. మాంకేటిసంగమపుణ్య తీ[ర్థే]
౯. సంగమేశ్వర దేవశిలమందిరం
౧౦. శిఖరపర్యంత కుర్యాత్ దేవేం
౧౧. ద్రుండు మొదలైన దిక్పతు
౧౨. లున్ను ఆదిత్యాది నవగ్ర
౧౩. హాలున్ను పృథివ్యప్తే
౧౪. జోవాయురాకాశములు
౧౫. న్ను అహోరాత్రములున్ను
౧౬. సంవత్సరమాసరుతు
౧౭. వులున్ను దశదిక్కులు
౧౮. [న్ను] ... ...

రెండవపక్క

౧౯. అష్టదిగ్గజాలు [ను*]
౨౦. కృతదుష్కృతంబులుం [న్ను*]
౨౧. స్థావరజంగమంబులున్ను
౨౨. యధిం ... ...

శాసన ప్రతిబింబాలు తీసుకొని వేసవి ఎండ చాలా తీక్ష్ణంగా ఉంటే అక్కడ దేవాలయమంటపంలో కొంతసేపు విశ్రమించాము. అక్కడికి కొందరు గొల్లలువస్తే వాళ్లతో కాటమరాజుకథనుగురించి ప్రసంగిస్తూ కూర్చున్నాము.

ఈప్రాంతమంతా కాటమరాజు ఏలినదే. సిద్ధిరాజుకున్నూ, కాటంరాజుకున్నూ యుద్ధంజరిగినది ఈసమీపాన్నే. కందుకూరినుంచి కనిగిరివెళ్లేతోవలోనే అలవలపాడూ పంపలింగాలకొండా ఉన్నవి. కాటమరాజు తండ్రి పెద్దిరాజు అలవలపాటి కధిపతి. పంపలింగాలకొండ పరిసరప్రాంతము ఖడ్గతిక్కన సమరక్రీడసలిపిన మహాక్షేత్రము.

అలవలపాటి సమీపాన్ని నేరేళ్ళవాగు ఒడ్డున ఉన్న పంపలింగాలకొండదగ్గర ప్రతియేటా వైశాఖపౌర్ణమికి గంగతిరునాళ్లు సాగుతుందట. ఆరోజున కందుకూరు, కనిగిరిసీమలనుంచి 'ఎక్కడెక్కడివాళ్లూ' ఎండెడ్లబళ్లుకట్టుకొని, రంగురంగుల చీరలూ ముచ్చటైనవి గూళ్లుగాకప్పి, ఎడ్లకు వింతవింత అలంకారాలు చేసి ముస్తాబై వస్తారట. కోటప్పకొండ (గుంటూరు), జగ్గన్నతోట (తూర్పుగోదావరి)లలో ప్రభలతీర్థంసాగినట్లు ఇక్కడ బండితీర్థం సాగుతుందట. వచ్చిన యాత్రికులంతా ఆనాడుఒడ్డున గంగమ్మకూ కాటమరాజువారికీ పశుక్షేమంకోరి పొంగళ్లు పొంగిస్తారట. నేరేళ్లవాగు దగ్గర కొండమీద పంపలింగాలున్న ఆలయం ఉన్నది. కొండకింద సమీపాన్ని రావిచెట్టున్నస్థలం దగ్గర యాదవ వీరులు యుద్ధానంతరం వీళ్లోకడిగిన కత్తులు పాతినారని చెప్పుతారు. వాగుకవతలి ఒడ్డున సమీపాన్నే గంగదేవాలయం ఉన్నది.

పశువులనిమిత్తమై వచ్చిన యుద్ధంలో యాదవులైన కాటమరాజువారే గెలిచారుకనుక ఇప్పటికీ ఆప్రాంతపు పశుపాలకులకు వారిమీద ఉండేభక్తి అట్టిది. ఇప్పటికీ ఆ ప్రాంతాలవారికీర్తి మాసిపోలేదు. మన్యాలకూ, కొండలకూ మేతకోసం పశువులను తోలుకుపోయేటప్పుడల్లా పశుధనంకలవారందరూ అవి తిరిగి సురక్షితంగా ఇల్లు చేరుకొన్నట్లయితే పొంగళ్లు పొంగిస్తామని కాటమరాజువారికి మ్రొక్కుకొంటారట. ఎప్పటి యుద్ధం! ఎప్పటి కాటమరాజు! ఇప్పటికీ పోలేదు విజయుడైన ఆరాజు పలుకుబడి! ఆప్రాంతాల కాటమరాజువారికి గుళ్లుకూడా లేచినవి! మారెళ్ల సీమలో ఇప్పటికీ కాటమరాజు శిలావిగ్రహాలను చూడవచ్చును. మారెళ్లగ్రామం కనిగిరి తాలూకాలోనిది. ఈమారెళ్ల ప్రాంతమే మారెళ్లసీమ.

గంగగుడి ఉన్నచోట్ల సాధారణంగా కాటమరాజువిగ్రహం కనబడుతూనే ఉంటుంది. గంగ కాటమరాజువారికి కులదేవత. పశువులకు సంబంధించిన విషయంలో విజయముపొందిన ఆప్రాంతాలపశుధనంకలవారి పాలిటి పరమపూజ్యుడైనాడు కాటమరాజు.

కాటంరాజు కథకు ప్రచారం విశేషం అక్కడ. అలవలపాటి గంగతిరునాళ్లలో రాత్రులకు రాత్రులు భట్టురాయబారము, యర్రగుడిపాటి పోట్లాట, కాటంరాజుకథ – ఈమొదలైన పాటలలోనే గడచిపోతవట.

కాటంరాజువారు అసలు తమకథ ప్రచారంచేయడానికి అధికారంఇచ్చినది కొమ్మువాళ్లకట. వీళ్లదిమాదిగలలో ఒకకులం. కాటంరాజువారి కథలు మాసిపోకుండా కాపాడినది వీరేనట. ఇందుమూలాన్ని యాదవులు వీళ్లను ఎక్కువగా గౌరవిస్తారట. ఎప్పుడైనా కొమ్మువాళ్లు యాదవుల(గొల్లల) ఇంటికి వస్తే వారికి ముందు భోజనం పెట్టకుండా గొల్లలు భోజనం చేయరాదట. ఇప్పటికీ ఈఆచారం సాగుతున్నదట. తమ పూర్వచరిత్రను కాపాడిన ఆజాతికి గొల్లలు ఇంతవరకు మాసిపోనీక, ఇప్పటికీ చూపిస్తున్న అభిమానగౌరవం ఇది.

కొమ్ములు పాడేవాళ్లు గొల్లలలో కూడా ఉన్నారట. వారికి పికిలివాళ్లని పేరు. వీరు ముఖ్యంగా కందుకూరుతాలూకా ముప్పాళ్లలో ఉన్నారు. వారికి వంశపరంపరగా వస్తూఉన్నవృత్తి ఇది. కందుకూరు తాలూకా గ్రామాలలో ఎక్కడెక్కడ అమ్మవారి జాతరలైనా ఈపాటలు పాడేనిమిత్తం వీళ్లు వస్తుంటారట. ఇందుకు

వీళ్లకు (వృత్తిమామూళ్లు)నివర్తనలు ఉన్నవట. పంచలింగాలకొండగంగతిరునాళ్లలో కొమ్మువాళ్లే కాక పికిలివాళ్లు కూడా ఈపదాలు పాడుతారట. కాని అక్కడ ఆచారం ఏమిటంటే ప్రాచీనసంప్రదాయ గౌరవాన్ని బట్టి కొమ్మువాళ్లు ముందుగా గుడా రెత్తితేనే కాని పికిలివాళ్లెత్తకూడదట. ఇవి కాటమరాజు కథకుసంబంధించిన ప్రాచీన సంప్రదాయాలు ఆప్రాంతాల వాడుకలో ఉన్నవి.

కొంచెం ఎండ చల్లబడినపిదప పాలేరుదాటి మంగినపాటిమీదుగా కందుకూరు కనిగిరిరోడ్డుమీద ఉన్న వెంకుపాలెం చేరుకొన్నాం సాయంత్రానికి. అక్కడికి రాగానే మాకు మళ్లీ స్వదేశంలోనికి వచ్చినట్లయింది. అక్కడినుంచి 'బస్సు' మీదుగా కందుకూరు వెళ్ళినాము.

అంతవరకు నాతోపాటు కష్టాలకోర్చుకొని నాకు సహాయభూతులైన లక్ష్మీనరసింహంగారిని అక్కడ దిగబెట్టి వారికి వందనాలు సమర్పించి సెలవుపుచ్చుకొని ఆమరునాటి ఉదయం 'బస్సు' మీద కనిగిరికి వెళ్ళినాను.

కనిగిరిలో రెండురోజులాగి అక్కడినుంచి పామూరుమీదుగా నలజనంపాడు వెళ్లినాను. పామూరులో గొప్ప చెరువున్నది. పాతకోట ఒకటున్నది. అదిగొప్ప వర్తకస్థలము. నలజనంపాడు వెలిగొండల కీవలితట్టు ఉన్నది. అవతలిపక్క మాడుపురుగుల నూరంలో భైరవునికోన మొదలైనవి ఉన్నవి. ఈగ్రామం ప్రస్తుతం వెంకటగిరిరాజావారి జమీలోనిది. ఇక్కడ ఉన్నవారంతా వెలమలు. బ్రాహ్మణులెవ్వరూ లేరు. అక్కడ ఎలిమెంటరీబోర్డుస్కూలు అయ్యవారొక్కరే బ్రాహ్మణులు. అయ్యవారింట్లో ఆమధ్యాహ్నం భోజనంచేసి శాసనంకోసం బైలుదేరినాను. "ఈశాసనం ఏంచేస్తారు? మీరు జమీందారుగారి తరఫున వచ్చారా? గౌవర్నమెంటుతరఫున వచ్చారా? ఒక్కశాసనంకోసం చెన్నపట్టణం నుంచి రావలసిన అవసర మేమున్నది? ఈశాసనశిల క్రింద లంకెబిందె లున్నవి. వాటిని తీసుకు పోవడానికి కాదా మీరు వచ్చింది? ఎక్కడెక్కడ లంకెబిందె లున్నవో ఆవైనంకూడా ఆశిలమీద వ్రాసి ఉన్నదటకాదా? ఈ వైనం మాకు కొంతకాలంక్రిందట ఇక్కడికి వచ్చిన యోగిగా రొకరు చెప్పినారు. ఇటువంటి సందర్భాలలో మిమ్మల్ని ఆశాసనం తీసుకోనిస్తామా?" ఇట్లా ఆవూరివారు ఒక్కపెట్టున ప్రశ్నలవర్షం కురిపించారు. చిట్టచివరకు వారి ప్రశ్నల కనుగుణ్యంగా జవాబిచ్చి నా సదుద్దేశమును గురించి వారికి నమ్మకం కలుగజేసేటప్పటికి కృతార్థ్యావస్థ అయింది. పిదప వారుకూడా నాపనికి తోడ్పడి నాకు చాలాసాయం చేశారు. అయ్యవారి సాయంవల్లా వారి సాయంవల్లా త్వరితంగానే నాపని ముగించుకొన్నాను. అక్కడ ఉన్నదల్లా ఒక్కశాసనమే. అది పదినెంటవలను పూర్వభాగం. పాతతెలుగుశాసనం. బట్టరువర్తు వేణుగోపాలశెట్టిగార్ల నాటి కంటె చాలాచెడిపోయినది. అది జైనశాసనం. శాసనారంభంలో జినదేవసంకీర్తనము కలదు. ఇక విశేషమేమిటంటే శాసనం జైనశాసనమయినప్పటికీ శాసనం తలభాగాన్ని నంగీలింగమూ మొదలైనవి చెక్కి ఉన్నవి. అది జైనశాసనశిల అనడమూ నాటిమీద నందీ మొదలైనవి కనబడడమూ వింత. ఇది ఆలోచింపదగిన విషయమనుకొన్నాను ఇది ఎట్లా సంభవించినదా అని. నలజేనంపాడును గ్రామనామాన్నిబట్టే అది ఒకప్పుడు జైనుల నివాసస్థలముగా ఉండవలెననుకొన్నాను. అందువల్లనే దానికి జైనులపాడని పేరుకలిగి ఉంటుంది! కాకతి ప్రతాపరుద్రుని కొలువులో నన్నిన బ్రాహ్మణ జైన మతవివాదంలో విప్రవినోదుల సహాయం మూలంగా బ్రాహ్మణులే గెలిచారట. ఓడిపోయిన జైనులను హతంచేశాడట రాజు. హతశేషులు పారిపోగా వారిని ఊరి (పాడు) పాళ్లలో నివసింపవలసినదే కాని ఊళ్లలో నివసింపరాదని బ్రాహ్మణులు శపించారట. ఇట్లా ఒకకథ చెప్పుతారు. కథ ఇట్టిది ఒకటుండడమూ, ఇక్కడ జైనశాసనం ఒకటి కనబడడమూ చూస్తే ఇది పూర్వం జైనుల నివాసస్థలమనీ, అందువల్లనే దీనికి జైనులపాడనే పేరు కలిగి ఉంటుందనీ, ఆ జైనులపాడే కాలక్రమాన్ని మనుష్యులనోళ్లలోబడి జేనంపాడుగా

మారి ఉంటుందనీ ఆలోచనకలిగింది. కడపమండలంలో పూర్వం చాలా జైనబస్తీలు ఉండేవని కొన్నికొన్ని ఆధారాలవల్ల తెలుస్తున్నది. నెల్లూరుమండలానికి ఈప్రాంతాన్ని కడపజిల్లాయే సరిహద్దు. ఇదిన్నీ కాకుండా నెల్లూరులోకూడా పెద్ద జైన విగ్రహాలు ఉన్నవి. ఇవన్నీ ఒకప్పుడు జైనులు ఈప్రాంతాల ఉండేవారని విశ్వసించ డానికి గట్టి ఆధారాలుగా కనబడుతున్నవి. నల జైనుల పాడులోని నల అనునది విశేషణ పదమవుతుందేమో అనుకొన్నాను. మంచి అనో యేమో దాని అర్థం. ఇంకా విచారించాలి.

ఈప్రయాణంలోనే చుండి, మాలెకొండ మొదలైనవి చూచాను. మోపాడు ప్రాజెక్టు చెరువు కూడా చూడడం తటస్థించినది. ఈచెరువువల్ల వేలకొలది ఎకరాలు వరిపంట పండుతున్నది. ఆప్రాంతమంతా పంటకాలువలతోను పిల్లకాలువలతోను, డెల్టాభూమి వలె ఉన్నది. ఇవేకాకుండా నెల్లూరుజిల్లాలోని పెదారికట్ల, చినారికట్ల, పొదిలి, ఒగిచేడు, కలుజువ్వలపాడు, గొట్లకట్టు, బుడమకాయలపాడు, దర్శి ఈ మొదలైన ఊళ్లుకూడా చూడడం కలిగింది.

బుడమకాయలపాటిలోను కలుజువ్వలపాటిలోను పాతతెలుగు శాసనాలు ఉన్నవి. బుడమకాయలపాడు ఇప్పుడించుమించుగా బేచిరాకు గ్రామమనే చెప్పవచ్చు. ఇది ఒంగోలు కంభంరోడ్డుమీద ఉన్న గొట్లకట్టుకు శివారుగ్రామం. ఈరెండుగ్రామాలూకూడా వెలిగొండచాలుకి అయిదారుమైళ్ల దూరంలోఉన్నవి. ఈప్రాంతమున కనుమలు దాటితే వెలిగొండలలోని కర్నూలు జిల్లాలోనికి పోతాము. నెల్లూరుజిల్లా పడమటి సరిహద్దుగా ఉన్న వెలిగొండల నంటుకొని అవతల కడప, కర్నూలు, గుంటూరుజిల్లాలున్నవి. బుడమకాయలపాటిలో ఊరికి మైలు మైలున్నర దూరాన్ని ఒకవేపచెట్టుకింద గంగమ్మదేవళం ఉంది. అక్కడ పాతతెలుగు శాసనాలు రెండు మూడున్నవి. అందులో రెండుమాత్రం నెల్లూరు మండల శాసనసంపుటాలలోనికి వచ్చినవి. ఒకటి రాలేదు. అక్కడ శిలాస్తంభం ఒకటున్నది. దానికి నాలుగువైపులా శాసనం ఉన్నది. అది ఆరేడుమూళ్ల పొడవుంటుంది. అది అంతా పూర్తిగా ఇసుకలో పూడిపోయింది. ఇది అంతా తువ్వనేల అవడం మూలాన్ని గాలి దుమారాలు లేచినప్పుడల్లా ఇసుకపొరలు మబ్బుతెరల లాగు లేస్తుంటవి. ఇట్లాలేచిన ఈయిసుకపొరలవల్ల ఆ స్తంభం పూర్తిగా కప్పడిపోయింది. ఎగువ తలభాగం మాత్రం కొంచెం కనిపిస్తున్నది. ఈశిలాస్తంభంమీది శాసనం నెల్లూరుమండలశాసన సంపుటాలలో వచ్చినప్పటికీ వాటిలో ఇచ్చిన పాఠంలో కొన్ని పొరపాటు లున్నవని తోచడంచేత ఎట్లయినా దానికి ప్రతిబింబాలు ఎత్తవలెనని బుద్ధిపుట్టింది. మరొకశాసనశిల నేలమీదపడిఉండడంచేత సులభంగా దానికి ప్రతిబింబం తీశాను. ఈరెండూ కాక మూడవ శాసనశిల మరొకటున్నది. దానిని గంగమ్మ దేవళానికి ప్రాకారపు రాయిగా పాతినారు. దేవళమంటె పెద్దదేవళంకాదు. పెద్దతులసికోటంతఎత్తు ఉంటుంది. చుట్టూ రాళ్లు పాతిఉంటవి ప్రాకారానికివలె. ఈప్రాకారపునిలువురాళ్లమీదపైన కప్పుమాదిరి ఏర్పడేటట్టు వాటిమీద బల్లపరుపుగా రాళ్లు పరచి ఉంటవి. లోపల గంగవిగ్రహం ఉంటుంది. దీనినే గంగదేవళం అంటారు; కాని అలనలపాటిదగ్గరి గంగదేవళం మాత్రం అమ్మవారి గుడివలెనేఉంది. ఈప్రాకారపు రాయిగా ఏర్పడిఉన్న దానిమీదనే శాసనముంది. సగంభాగం శాసనం భూమిలోనికి పూడిపోయిఉంది. అంతేకాకుండా ఆరాతిని ఎడాపెడా అక్కడి వేపచెట్టువేరు పాము వలె మెలికలుతిర్చి చుట్టివేసుకొన్నది. ఆవేరును తెగనరికించి ఆరాతిని పైకి తీయింతామన్నా అది వట్టివేపచెట్టుకాదు: అమ్మవారి వేపచెట్టు. అటువంటి వేపచెట్లంటే ప్రజల కెట్టి నమ్మకాలుంటవో అందరికీ తెలిసినవిషయమే. అక్కడ ఈరాయిఒకటే, ఆ స్తంభమొకటే- ఈరెండూ రెండు వ్యాసఘట్టాలలాగు ఏర్పడ్డవి.

నేను గొట్లకట్టులో వేమూరి సీతారామయ్యగారి యింట్లో బసచేశాను. సీతారామయ్యగారు చాలా మంచివారు. ఆవూళ్లో ఉన్న బోర్డుస్కూలుకు హెడ్డుమాస్టరు. వారికాప్రాంతాల మంచి పలుకుబడిఉన్నది. ఆయన

ఆవూళ్లో అయ్యవారే కాకుండా వైద్యులు కూడాను. పంచాంగంచూచి నక్షత్ర తిథివారాలూ, విఘ్నాలూ పరిశీలించి ఊళ్లో వాళ్లకు మంచిచెడ్డలు చెప్పగలవారు. ఆలోచనకు, పాలోచనకు ఎన్నికైనచెయ్యి. ఈకారణాలవల్ల ఆవూళ్లో ఆయనఅంటే అందరికీ విశేషగౌరవం. ఆయన నాకు చేసిన ఉపకారం చెప్పవలెనంటే ఆయనే గనుక నాకు తోడ్పడి ఉండకపోయినట్లయితే నేనాశాసనాలకు ప్రతిబింబాలు ఎత్తగలిగిఉండేవాణ్ణే కానని చెప్పితే చాలు. ఆయన నాకంతటి మహోపకారి అయినాడు. మొత్తంమీద శాసనాలకు ప్రతిబింబాలు తీశాను.

బుడిమకాయలపాటికే బుడిమనరాయల పాడని కూడా పేరు. ఇప్పుడది బేచిరాకు గ్రామంగా ఉన్నా పూర్వం అది గొప్ప ఊరుగా వుండివుండాలి అనడానికి ఆధారాలు లేకపోలేదు. అక్కడి భూమి చాలా సారవంతమైనది. ఈగంగమ్మ దేవాలయానికి సమీపాన్ని పూర్వం పెద్దచెరువు ఉండేది. ఇప్పటికీ దీని ఆనవాళ్లు చూడవచ్చు. ఇప్పుడది అంతా తుప్పలతోను, డొంకలతోను అడవిమయమై పోయింది. ఈ చెరువు వైశాల్యము 400 ల ఎకరాలుండవచ్చు. ఈ చెరువునీటికి ఆధారభూతములైనవి మూడువాగులున్నవి. ఈవాగులలోని నీరు ఈచెరువులోకి వస్తుంది. ఇప్పుడీవాగులు చెడిపోయినవి. ఈ చెరువువల్ల నాగంపల్లి, వెలిగొండరాయునిపల్లి, వీరారెడ్డిపల్లి, వెంగలపల్లి, బుడిమకాయలపాడు, గర్నిపెంట, గొల్లకట్ట—ఇన్నిపల్లెలకు లాభం ఉంటుంది. చెరువులో పుష్కలంగా నీరుంటే వెయ్యి ఎకరాలకు పైగా సాగవుతుంది. ఇక్కడ పూర్వం ఒక దేవాలయం కూడా ఉండేదని తెలుస్తుంది. గౌనర్మెంటువారు కాని, జమీందారుగారుకాని ఖిలపడి పోయి ఉన్న ఆచెరువును ఊర్జితం చేయించేటట్టయితే పైని చెప్పిన గ్రామాల ప్రజలకు చాలా ఉపకారమవుతుంది. ఆగ్రామం వెంకటగిరి జమీలోనిది. జమీందారులుకూడా ఇందువిషయమై శ్రద్ధవహించనూలేదు. ఇటువంటివి ఖిలపడి ఉన్న చెరువులిటు చాలా ఉన్నవి. ప్రజలకు అనేక మహోపకారాలుజరిగినట్లు చెప్పబడే బ్రిటీషుప్రభుత్వంలోకంటె కూడా పూర్వపుప్రభుత్వాలలోనే ఈప్రాంతాలు పాడీపంటా సమృద్ధిగా గలిగి ప్రజలు సుఖపడేవారని చెప్పడానికి లెక్కకుమించిన ఈచెరువులే సాక్షి. ఆటువంటి రాతిభూములలో వివిధాన్నో గొప్పగొప్ప చెరువులు నిర్మించి నిర్జలమైన ఎడారికాని ఎడారిభూములనూ, గొడ్డువారిన అడవినేలలనూ సస్యశ్యామలములైన సుక్షేత్రములుగా మార్చి ప్రజాక్షేమానికి, జాతీయసంపదకూ తోడ్పడ్డ పూర్వపు ప్రభుత్వాలకూ ఇప్పటి ప్రభుత్వానికి ఉండే వ్యత్యాసం దేశం చూస్తేనేకాని బోధపడదు.

వెలిగొండరాయడి దేవళం అక్కడికి సమీపమున వెలిగొండలలోనే ఉన్నది. అది ముచికుందులవారి ప్రతిష్ఠ అని చెప్పుతారు. ఆదేవళం సమీపముననే మూసి (ముచికుంద)నది పుట్టుతున్నది. ఆదేవళాన్ని చూడడం పడింది కాదు. వెంకటగిరినుండి వచ్చే వెలిగొండలదారులు గర్నిపెంట, తువ్వపాడ్ల సమీపాన్నే ఆఖరవుతుంది. కలుజువ్వలపాడు ఈవెలిగొండ కనుమల ఉన్నది.

బుడిమకాయలపాటి పని పూర్తిచేసుకొని కొంచెం చుట్టుతోవను నాగంపల్లి, గర్నిపెంట, తువ్వపాడు, నాగిరెడ్డిపల్లి, గాజులపెన్నేలమీదుగా కలుజువ్వలపాడు వెళ్లినాను. ఈప్రాంతాల కొన్నిచోట్లలో విశ్వబ్రాహ్మణులే కరణాలు. కలుజువ్వలపాటిలో రాట్నములు చాలా ఉన్నవి. అవి ప్రత్తిపట్టేరోజులు గనుక చిల్లరవర్తకులు పత్తి పండినవాళ్లదగ్గరకు విడివిడిగావచ్చి పత్తిని కొనిపోయి మొత్తంచేసి పెద్దవర్తకుల కమ్ముతారు. సంసారులు తీరవాళ్లవసరం మూలాన్ని దినసర్చులకు డబ్బుకోసం అల్లాడుతూఉంటే ఈ చిల్లరవర్తకులువచ్చి ముందు చౌకధరకు పంటను గుత్తకుతీసుకొని అడ్వాన్సుగా సొమ్మిస్తారు. అందువల్ల పంట ఎంతపండినా పండించినవారికి నిత్యదరిద్రమున్నూ దళారులకు నిత్యపంటగాను ఉంటున్నది. ఈకారణాలచేత పల్లెటూరి రైతులు చాలా వరకు వర్తకులకు లోబడి ఎదుగూ బొదుగూ లేకుండా ఉంటున్నారు. ఈప్రాంతాల చాలామంది రైతుల భూములన్నీ వర్తకుల 'అడమానా'(తాకట్టు)లలోనే శాశ్వతంగా ఉండిపోతున్నవి. పంటకు వర్షాలమీద ఆధారపడవలసింది దేశం. భుక్తికి వర్తకులమీద ఆధారపడ

వలసినవారు రైతులు. మిగులూ తగులూ ప్రభుత్వానిది. దేశస్థితి ఇట్టిది.

కలుజువ్వలపాటిలో కైలాసనాథస్వామి ఆలయంలో పాత తెలుగుశాసనం ఉంటే దానికి ప్రతిబింబం తీసుకొన్నాను. అక్కడినుంచి మార్కాపురం రోడ్డు రైలుస్టేషనుకుంచి పొందిలికి కొత్తగా పోస్తున్న రోడ్డు మీదుగా వెళ్లదామనుకొన్నాను కాని రోడ్డు పూర్తికాలేదు. తోవ అంతగా మంచిది కాదని కరణంగారు చెప్పితే తిన్నగా మార్కాపురం రోడ్డు రైలుస్టేషనుకు వెళ్లినాను. అక్కడికి శ్రీశైలం నల్లమలకొండలనాలు సంజమబ్బుల లాగ కనిపిస్తూ ఉంటవి. అక్కడినుంచి రైలెక్కి గజ్జలకొండ, దొనకొండలమీదుగా పరిచేసుకుని పిడప నర్సారావుపేట, గుంటూరులమీదుగా బెజవాడ వచ్చి అక్కడినుంచి తిరిగి పట్నానికి వచ్చాను. ఈరీతిగా ముగిసింది నెల్లూరుమండల యాత్ర.

వెలికొండల ప్రాంతాన్ని ఊళ్లలో పైరు పంటలు ప్రత్యేకించి పశువులు మేత దిగుడుబావులలోని ఉదకమే. నీరు చాలాచోట్ల చాలాబావులలో కళ్మలం గా ఉంటుంది. విధిలేక తాగవలసిందే ఆనీరు దాహానికి. దిగుడుబావు లున్నచోటల్లా నారికురుపులు జాస్తీ. అవి లేని ఊళ్లూ దిగుడుబావులులేని ఊళ్లూ లేవు. ఆరోగ్యం చాలా తక్కువ. వైద్యసహాయం గ్రామాలకు అసలే లేదు. మంచి రస్తాలులేవు గ్రామాలకూ గ్రామాలకూను. విద్యావిషయంలో ఊళ్లన్నీ చాలా వెనకబడిఉన్నవి. నాజూకు నాగరికతలు అంతగాలేవు. పేదవ్యవసాయానికి మాదాప్రచారం అటు చాలా తక్కువే. కాని దేశం ఇట్టి స్థితిలో ఉన్నప్పటికీ గాంధిమహాత్ముని పేరు తెలియని ఊరులేదు. ఆ మహాత్ముని పేరు మూలమూలలకు ప్రాకింది; భక్తిగౌరవాలు కలిగించుకొన్నది. కాని ఆయన కలిగించిన రాజకీయప్రబోధము అన్నైపుల అంతగా ఉన్నట్టు పొడకట్టదు.

ప్రజలు చాలా మంచివాళ్లు. దేహపటిమా బుద్ధిబలమూ ఉన్నవాళ్లే. కాని అటు అవసరమైనది ఒక్కజాతీయప్రబోధమే. దేశదారిద్ర్యమూ, తరచు సంభవించే అనావృష్టిరోషమూ వారిని క్రుంగదీస్తున్నవి. పూర్వప్రదేశీయప్రభువులు పరిపాలన చేసే కాలంలో ఇట్టిప్రాంతాలే శత్రుజనదుస్సాధ్యములై పౌరుషపరాక్రమాలతోనున్ను, పాడిపంటలతోనున్ను విద్యాసుంది మిలమిల మెరుస్తూ ఉండేవి. ఆనాడు లాగా ఏ, మనకు తెలియు ను.

## అనుబంధము

మాగసత్త్వాచార్యులవారు రచించిన నతుర్వ్యాసతాత్పర్యసంగ్రహమనే నామాంతరముగల గిరీశస్తుతిసూక్తిమాల అన్న వేదాంతగ్రంథానికి ప్రోలయ వేమారెడ్డింగారి తమ్ముడును, ఆయన సర్వసైన్యాధిపతీ అయిన మల్లాయరెడ్డింగారి మునిమనుమడును కోమటిరెడ్డింగారి కొడుకు (సోమేశభూపతి సోదరుడు) శివలింగభూపతి వ్యాఖ్య వ్రాశాడు. ఆవ్యాఖ్యాగ్రంథంలోని ప్రారంభశ్లోకాలు కృతికర్తృవంశావతారక్రమం వర్ణించేవి ఈక్రింద ఇస్తున్నాను. ఈవ్యాఖ్యానం ప్రతి తంజావూరుజిల్లా తిరువిడైమరుదూరు దేవాలయగ్రంథాగారంలో ఉండగా ౧౯౨౫ లో మొట్టమొదట మాచి శ్రీహెచ్. కృష్ణశాస్త్రిగారును, టి. పి కృష్ణస్వామిశాస్త్రిగారును పరిశోధించారు. ఈ పైని చెప్పిన ఇరువురి సహాయంతో వెనుక దక్షిణహిందూదేశంలోని సంస్కృతతాళపత్రగ్రంథాన్వేషణమునకు పూనుకొన్న హుల్ష్‌దొరగారు ఈవిషయమును గురించి తమ నివేదికలో వ్రాశారు. వారి నివేదికలోనుంచే పాఠకుల ఉపయోగార్థము ఈశ్లోకాలు ఎత్తి వ్రాయబడ్డవి.

జాతి స్వసత్త్వా కమలాభిరామా
బుధప్రియా సత్కవిసంఘసేవ్యా।
గంగా ద్వితీయేవ సశైల లక్ష్మ్యాః
పాదాంబుజా దీశితు రుద్బభూవ॥

తత్రోదభూ త్కోమటిప్రోలనృపః
స్వకాన్వవాయైక మణిప్రదీపః।
లోకత్రయ వ్యాప్తయశః ప్రతాపః
కృతారిభూపాల మనోనుతాపః॥

మాచప్రభు ర్వేమవిభుశ్చ దొడ్డ
భూపోఽన్న భూపోఽపిచ మల్లభూపః।
తస్యాత్మజా ఔరసభావకామాః
భూమౌపతీనా మివపాణ్డుపుత్రాః॥

శ్రీవేమభూమీ రమణస్య తస్య
పుణ్యం జనై ర్వర్ణయితుం న శక్యమ్।
ఖిలీకృతో ధర్మపథ స్తురుష్కై-
ర్ఘంటాపథో యేన కృతః పృథివ్యాం॥

హేమాద్రికల్పకథితాఖిలదానదక్షో
నిస్సీమభూవితరణ ప్రథమానకీర్తిః।
సోపాన సంతతి మసౌ ప్రవిధాయ [భూప
స్తాం *] శ్రీగిరీశపదవీం సుగమాం చకార॥

వేమాధిపస్యా[నవ]జోపి మల్ల
భూపాల భూపోఽసౌ జగనొబ్బగణ్డః।
శ్రీ...ర్ణాదిరుపన్న మల్లా
సముల్లసత్ ఖల్లగణా న్విజి[గ్యే*]॥

తస్యాభవ చ్ఛ్రీపినకోమటీంద్ర
స్సుతో జగద్ఖ్యాత[హితో*]నరేంద్రః।
సర్వప్రజానే త్రచకోరచంద్ర
స్స్వరాష్ట్రసంరక్షణనీతితంత్రః॥

పంచ శ్రీగిరి భూపతి ర్గుణనిధి ర్వేమక్ష్మా నాయకో
మాచక్ష్మాపతి రన్నదేవనృపతిః పెద్దక్షితీశో ఽపిచ।
ఏతస్యాత్మగుణారత్నరాజితతనోః పుత్రాః పవిత్రాన్వయాః
శ్రీగోదావమరద్రుమా ఇవబుధైః త్రాణార్థి మభ్యర్థితాః॥

ధానుష్కధౌరేయతమాం స్తురుష్కాన్
ప్రాపయ్య నిష్కాసన మాత్మరాష్ట్రాత్।
నిష్కంటకాం సర్వభువం వ్యధత్త
స మాచభూపో భుజవైభవేన॥

అథవతా మథ కోమటిశ్రీగిరి
క్షితిపతీ అపి మానవిభో స్సుతౌ।
బలిబలోన్మథనాథ ముపాగతౌ
హరిసురాధిపతీ ఇవ భూతలమ్॥

వర్ణ్యాః కథం కోమటి భూమిపోసౌ
యస్యాక్షికోణే యుధి కోపశోణే।
దిశంతి ఘాసం ప్రదిశంతి దేశం
విశంత్యరణ్యాం రిపుభూమిపాలాః॥

కుర్వంతౌ మహితై ర్మహోభి ర
మలై రాశాతమోనాశనం
సోమేశ శ్శివలింగభూపతి రపి
ద్వావుత్పుష్పవంతావివ।
సర్వక్షోణిభృదాశ్రయా గ్గుణ
నిధే శ్శ్రీకోమటీంద్రాంబుధే
రాయూషావుదయం శివస్య
మహితా వంశావతారౌ భువి॥

భరతమతపతంగ స్సత్పరిత్రాణచంగః
కృతరిపుమదభంగ స్సద్గుణవ్యూహతుంగః।
కలితసుకృతసంగ స్త్యక్తపాపోత్తరంగ
స్సజయతి శివలింగ[ః*] క్ష్మాపవేశ్యాభుజంగః॥

సౌందర్య మౌదార్య మముష్య శౌర్యం
కిం వర్ణ్యతే యస్య హి దర్శనేన।
స్త్రీణాంచ మానో విదుషాంచ దౌస్థ్య
ద్విషాంచ శస్త్రం గళతి క్షణేన॥

ద్వారేదక్షిణపూర్వే శ్రీశైలాఖ్యస్య భూభృత స్తస్య।
పుణ్యాంస్కందపురీంతాంసోమేశస్సర్వకామదోధ్యాస్తే॥

మణిమయగృహహృద్యా శత్రుఘూపైరభేద్యా [స్తే]॥
గజగమనసుభవాద్యా సర్వపుణ్యానవద్యా।
కలితసకలకామా భాతి రామాభిరామా
విహసితపురసీమా పూరియం స్కందనామా॥

యత్రాత్రినేత్రప్రభవ స్తపోభి
స్సోమం సమారాధ్య సమాహితాత్మా।
సోమత్వ మాప్య స్వగభస్తిభాభి
శ్ఛిద్నే త్సమస్య(?) తమాంసి జంతోః॥

కింవర్ణ్య[తే*] పుణ్యమహత్త్వమస్యా
యస్యాస్సమీపే విజనాః ప్రధానాః।

ఏనోరతాః పుణ్యరతా భవంతి
సోమేశ సాన్నిధ్యవశా ద శేషాః॥

హైమం సమారోహతి తత్ర పుర్యాం
సింహాసనం శ్రీ శివలింగభూపే।
హైమాని హేమాద్రిశిలాసనాని
తదీర్ష్యయే వారినృపా శ్రయంతే॥

మాహేశ్వరేణ శివలింగమహీశ్వరేణ
మాహేశ్వరత్వ మఖిలాః కలయంతి లోకాః।
ఆమోదితాఖిలదిశావలయేన యోగాత్
భద్రశ్రి[యా]వనిరుహో ఇవ చందనత్వమ్॥

బ్రహ్మణ్యోగ్రా స్సహస్రం సమధిగతముదిత[ః*]
స్వర్ణరాశీ న నేకా
న్నగ్ర్యా న ప్యగ్రహారా నతనుత వితతా
దేవతానాం ప్రతిష్ఠా[ః*]।
బ్రహ్మణ్యద్వావో స్సుహూన వ్యక్కృత సుకృతినా
మగ్రణీః పుణ్యచేతా

ప్రత్యర్థస్మా మాస్త్రిపుర్యాం స్వధితవయపయా
న్మూర్జటిప్రీతికామః॥

శ్రీగంగాన్వగవంశవార్ధిరజనీ
నాథస్య విద్యానిధే
సత్పుత్రః శ్రీత్రిపురాంతకస్య సుధియః
పౌత్రో గురోః శ్రీగిరేః।
పుత్రః శ్రీత్రిపురారిదేశికమణేః
భీమేశ్వరస్యానుజో
యస్య శ్రీగిరిదేశికో గురురభూత్
శ్రీకొండమో ఽంగీకృతః॥

సుగుం త మారాధ్య స తత్కృపాస్త
సర్వప్రతాప శ్శివలింగభూపః।
న్యాసప్త హృద్యాం సాగర త్తసూరి
కృతాం గిరీశ స్తుతిసూక్తిమాలామ్॥

విభవ సంవత్సర కార్తిక మాస భారతినుండి పునర్ముద్రితము.

# *అశోకుని శిలాశాసనములు: రాయలసీమ

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

ఇంతవఱకు అశోకుని శిలా శాసనములు కళింగదేశమున జౌగడప్రాంతముననే కాని వేఱొచ్చోటను గానరాలేదు. ఇప్పుడు మఱికొన్ని అనంతపురంజిల్లా సరిహద్దుల ఆంధ్రదేశములోని రాయలసీమలో బయలుపడినవి. వీటిని మొట్టమొదట కనిపెట్టి లోకమునకు ప్రకటించిన ఖ్యాతి గౌవర్నమెంటువారిదే; కాని వారు ఏలనో కాని యవి యున్నస్థలమును వెలిపుచ్చక బహురహస్యముగ దాచియుంచి కర్నూలుమండలమున గనబడినవని మాత్రము ప్రకటించిరి. దక్షిణాంధ్రదేశమైన రాయలసీమలో నివి బయలుపడుట నిజముగా ప్రాచీనాంధ్రదేశ సౌభాగ్య ప్రాముఖ్యములకు తార్కాణమని చాల సంతోషించి యవి సత్వరముగ ప్రకటింపబడుట యాంధ్రావనికి సమ్మోదము గూర్పగలదని ఏతద్విషయమై పత్రికలలో గౌవర్నమెంటువారు ప్రకటించిననాటి నుండియు అవి బయలుపడిన స్థలమును కనుగొనుటకై అనేక ప్రయత్నములుచేసి సఫలీకృత మనోరథులమైతిమి. ఇట్లు ప్రయత్నించినవారము నేనును, మన్మిత్రులు శ్రీయుత డాక్టరు వెంకటరమణయ్యగారును. కడచిన ఫిబ్రవరి ౨౮ వ తేదినాడు మే మిరువురము నీరాయలసీమకు ప్రయాణమైతిమి.

అనంతపురం జిల్లా గుత్తి తాలూకాకు ఉత్తరపు సరిహద్దుగ కర్నూలుజిల్లా పత్తికొండ తాలూకా యున్నది. గుత్తికి చేరువగనే ఏడెనిమిది మైళ్లదూరమున, గుత్తినుంచి గుంతకల్లుకుపోవు రోడ్డుమీద తూర్పుప్రక్క ఎఱ్ఱగుడి అను గ్రామము కలదు. గుత్తికి అంతసమీపమున నున్నను ఇది పత్తికొండ తాలూకా గ్రామము. గుత్తినుండి యచ్చటికి గుఱ్ఱపుబండ్లు కట్టుకొని పోవచ్చును: లేదా నడచి పోయినను సులభమే. గుంతకల్లురోడ్డుకి పడమటితట్టున ఖండతుండెములుగ నున్న బోడిగుట్టలవరుసలు కొన్ని కలవు. ఇవి 'భోషాణ'పు పెట్టెలవలె చాల పెద్దవయిన నాపరాతి బండలు చిన్నవాటితోపాటు చేర్చి కూర్చిపెట్టినట్లుండును. గుంతకల్లురోడ్డుకి తూర్పువైపున నున్న ఎఱ్ఱగుడిగ్రామమునకు, పడమటివైపున నున్న గుట్టలకు రమారమి మైలో రెండు మైళ్లో యుండును. ఈ గుట్టలలోని బండలమీదనే అశోకుని శాసనములు చెక్కబడియున్నవి. శాసనములు చెక్కినబండలు కొన్ని నిట్టనిలువుగను,

* గుత్తిప్రాంతమున అశోకశిలాశాసనములు కాన్పించినవనియు, వీటినిమిత్తమై శ్రీయుత డా॥ వెంకటరమణయ్యగారు వెళ్లుచున్నారనియు, అనుజ్ఞ యిచ్చిపంపిన నేనును వెళ్లుదుననియు దేశోద్ధారక శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారితో విన్నవించుకొనగా వారందుల కంగీకరించి ప్రయాణభృతి యొసంగి నన్ను పంపిరి. అందుకు వారికనేక కృతజ్ఞతాపూర్వకవందనము లొనరించుచున్నాను.

కొన్ని ఏటవాలుగను ఉన్నవి: మఱికొన్ని బల్ల పరుపుగ పడియున్నవి. శాసనములు ఈ బండలను చక్కగ మలిచి చదునుచేసి చెక్కిన ట్లగుపడదు. ఏశాసనపు రాయియుగూడ చక్కగ చదునుగ లేదు. ఇందుకుత్తోడు ఈ రాళ్లలో కొంత యిసుక పాలుకూడ ఎక్కువ. ఈకారణములవలన శాసన ప్రతిబింబములు చక్కగ వచ్చుట కష్టసాధ్యము. గుట్టలు ఎత్తయినవి కాకపోవుటచేతను, గుట్టలమీద చెట్టుచేమ లేవియు లేకపోవుటచేతను,గుట్టకు శాసనములు తూర్పుప్రక్కనే యుండుటచేతను ప్రతిబింబములు తీయవలసిన పనియంతయు ఎండలోనే జరుగవలసియుండును. ప్రతిబింబములు తీయుటలో రాళ్లు కడుగుట మొదలగుపనులుచేయుటకు నీళ్లు చాల అవసరము. అవి గుట్టదగ్గర లేవు. అక్కడికి రమారమి అరమైలు దూరమున గుంటలలో నుండియో, అచ్చటను లేనిచో గ్రామమునుండియో వాటిని తెప్పింపవలసియుండును.

మేము ఎఱ్ఱగుడికి పోయిన పిదపగాని మాకీకష్టసుఖములు తెలియరాలేదు. ఎఱ్ఱగుడి చిన్న గ్రామము. అచ్చట బ్రాహ్మణులది ఒక్క యిల్లు మాత్రమే కలదు. వంటభోజనము చేసికొని ప్రతిబింబములు తీయుపనికి పూనుకొందమన్న చాలకాలాతీత మగుటయే కాక తీవ్రమయిన యెండలో పనిచేయవలసి యుండును. అందును మేమువెళ్లినది కొంచెమించుమించు వేసవికాలమే. వంట భోజనము చేసికొని పనిచేసిన లాభము లేదని, కూలీల నేర్పాటుచేసికొని మధ్యాహ్న ముపవాసముతోనే శాసనప్రతిబింబములు తీసికొన నారంభించితిమి. కుంటలలో నుండి నీళ్లు తెచ్చుటకై కూలీలకు కుండకు అర్ధరూపాయ చొప్పున ఇచ్చుకోవలసి వచ్చినది.

కొన్నికొన్ని శిలలమీది యక్షరములు లోతుగ నున్నవి. మరికొన్నిటి మీదివి అరిగి పోయియో యెందువల్లనో తేల్చికనబడుచు న్నవి. లోతుగ చెక్కిన శిలలమీది ప్రతిబింబములు బాగుగనే వచ్చును. మిగిలిన వాటి మీద, ఇంకను తగిన సన్నాహమున్నగాని మంచి ప్రతిబింబములు రావు. క్రింద నిలుచుండుటకును, నిలిచి ప్రతిబింబములు తీయుటకును తగిన వీల్లు లేకపోవుటచేతను, శాసనశిలలు కొన్ని మిక్కిలి యెత్తుగనుండి వ్రేలాడుచున్నట్లుండుటచేతను మంచె మొదలైన కట్టుబాటులు చేసిననేకాని ప్రతిబింబములు తీయుటకే సాధ్యముకాదు. మంచె మొదలైనవి కట్టించుటకు మోకులు కఱ్ఱలు మొదలగు సామానంతయు గుత్తినుండి తీసుకరావలసినదే కాని ఎఱ్ఱగుడిలో సందర్భపడదు. అదియునుగాక, శాసన శిలలు చదునుగాలేని మెరకపల్లములు కల యిసుకరాళ్లగుటవలన ప్రతిబింబములు తీయుటలో నుపయోగించు "డాబర్లు", "బ్రష్లు" చాల ఉన్నగాని ప్రతిబింబములు తీయుట కష్టము: అనగా నీపనియంతయు బహువ్యయప్రయాస సాధ్యము.

ఇవి యన్నియు మాకు మొదట తెలియ లేదు. అయినను అట్టి విషమ పరిస్థితులలో

కూడ శాసన ప్రతిబింబములకై ప్రయత్నించినాము. ఎండలో చేయవలసిన పని: అది వేసవి యెండ. అవి యన్నియు తెగ కాలిపోవు రాళ్లు: క్రింద కాళ్లు, పైన నెత్తి మాడుచున్నవి. చెట్టు లేదు: చేమలేదు. ఆమట్టమధ్యాహ్నము మాకు తిండిలేదు సరికదా త్రాగుటకు దగ్గఱ పుడిసెను మంచినీళ్లయినను లేవు. ఇక మాయవస్థ చెప్పవలసిన దేమున్నది? రాతినికడిగి ప్రతిబింబము తీయు నిమిత్తమై దానిమీద కాకితము పఱచునప్పటికి క్రిందరాయి, పైని కాగితము కూడ ఎండిపోవుచుండెడివి. ఇందుకు తోడు గాలి: పరిస్థితులంత విషమముగ నున్నప్పటికి క్రిందుగనుండి తీయుటకు సాధ్యముగ నున్న రెండు మూడు శాసనములకు ప్రతిబింబములు తీసినాము; కాని అందు బాగుగ వచ్చినది ఒక్కటే పెద్దది. ఇదియైన నంతకంటె బాగుగనే వచ్చియుండును కాని ఆ పరిస్థితులలో అప్పుడు మాకు అంతకంటె సాధ్యమైనది కాదు.

శాసనలిపి బ్రాహ్మీలిపి: భాష ప్రాకృతము. మేము తీసిన ప్రతిబింబమునుబట్టి శాసనమును విడదీసి చదివి ప్రకటింపవలెనని కొంత ప్రయత్నించితిమి కాని శాసనపంక్తులు సరాసరిగ నుండక ఒకదానిలోనుండి మఱియొక దానిలోనికి పోవునట్లు చెక్కబడుటచేతను, కొన్ని యక్షరములు చెడుటచేతను శాసనమును విడదీయుటకే అసలు శాసనశిలను చూడవలసినపునరపేక్ష కలిగినది; కాని యది యెట్లు నెరవేరగలదు? ద్రవ్య సాధ్యము. అందువలస చేయునది లేక యాశాసనము నింతవరకు ప్రకటింపజాలమైతిమి. అశోకశాసన విమర్శజిజ్ఞాసువులకు ఉపకరింపగలదేమో కొంతవఱకైన నని మేము తీసిన శాసనప్రతిబింబము నిట నిచ్చుచున్నాము. (చూ—చిత్రము ౧.)

పత్తికొండ తాలూకా సర్వతారణ్యమయము. ఈ తాలూకాలో గుట్టలలోను, అడవులలోను ఇట్టి శాసనములు కొన్ని కలవని "దర్యాప్తు"వలన దెలిసినది. ఈ ప్రాంతమున గుట్టల నానుకొనియు, ఇంచుకంత దూరముననుకూడ "తాండా"లు కలవు. సుకారితండాలగూడెములకే "తాండా" లనిపేరు. ఇవి ఒక్కొక్క పల్లెటూరిని చేరియుండును. ఎఱ్ఱగుడి తాండా; గుత్తి తాండా-ఇట్లే గ్రామనామములతో చేర్చి వీటిని పిలుచుచుందురు. సుకారితండాలకు పశువుల వ్యాపారము వ్యవసాయము ప్రధానవృత్తులు. కొన్ని కొన్ని తాండాలవాళ్లు ఇట్టి శాసనములున్న స్థలములు చూపించెదమని చెప్పినారు—ధనాకాంక్షతోనే. అవి అశోకుని శాసనము లంత పురాతనవులైనను కాకపోయినను చాల ప్రాచీనశాసనములై యుండుననుట కవకాశము కలదు. గుత్తిరాజ్యము బాదామి చాళుక్యుల నాటినుండియు ప్రసిద్ధివహించిన దేశము. అన్వేషణమే సరిగా చేసినచో ఇంకను అంతకు పూర్వపు శాసనములుకూడ ఏవైన దొరకిన దొరకవచ్చును. ఈప్రాంత మింకను శాసనముల నిమిత్తమై చక్కగ "సర్వే" కావలసియున్నది.

పిదప మేము గుత్తికి చేరువ నున్న కొన్ని గ్రామముల బర్యటనము చేసితిమి. అందు ముఖ్యముగ బేర్కొనదగినది పెద్దవడుగూరు. ఊరంత పెద్దది కాకపోయినను చాల పురాతనమైనది. తరచు ఇక్కడ పాటిమట్టిలో పురాతనపునాణెములు బయలుపడుచుండునట. మేమాయూరు వెళ్లుటకు కొంత కాలమునకు బూర్వము అక్కడ నొకకుండలో పోసి కుండెడు సీసపు నాణెములు ఎవరిదొడ్డిలోనో దొరకినవట: కాని యూరివారు వాటిని వైద్యుల కమ్మివేసిరట-భస్మముల నిమిత్తమో యేమో. మిగిలినవి యేవైయిదాఱో యుండగా అచ్చటివారు వాటిని మా కిచ్చిరి. నాణెములు చాల అరిగిపోయినవి. వాటిమీద పేరులేవియు లేవు. ఈనాణెములకొకప్రక్క పూర్తిగ అరిగిపోయినది. రెండవప్రక్క ముఖము కుడివైపుకి గల గుఱ్ఱమును, ఆగుఱ్ఱపు ముఖమున కించుక దిగువ బంతివలె గుండ్రనై యుబ్బెత్తుగ నున్న చుక్కయొకటియు గలవు. సీసపునాణెము లెక్కువగ ఇంతవఱకు ఆంధ్రరాజులవే కానవచ్చుటచేత ఇవి వారివే యని మా యూహ. మాకు దొరకిన యీ సీసపు నాణెములు ఆంధ్రరాజులవే యని నిశ్చయింపదగియున్నను ఏ రాజువో మాత్రము ఖండితముగ జెప్పలేము. అయినను ఈప్రాంతమంతయు "ఆంధ్ర" రాజ్యములోనిదే యనిశాసనములవలననే కాక ఈనాణెములవలన గూడనిశ్చయమగుచున్నది. ఈయూరిలోని శిలాశాసనములను బరిశీలించుటలో అమూల్యమైన శాసన మొకటి మాకు గోచరించినది. అది బాదామి చాళుక్యనృపతియైన మొదటి పులకేశినాటిది. ఇంతవఱకు మొదటి పులకేశినాటి శాసనములేవియు దొరకలేదు. ఇదియే మొదటిది కాని శాసనశిల చాల చెడిపోయినది. అప్పటికి మాకు తగిన సౌకర్యములు లేనికారణమునను, కలుగని కారణమునను ఆ శాసన ప్రతిబింబమును గైకొన వీలు లేకపోయినది.

అటుతరువాత మిత్రులైన వెంకట రమణయ్యగారు శలవులేక చెన్నపురి వెళ్లిపోయినారు. తగినంత తృప్తికరమైనపని జరుపకయే మఱలివచ్చుట కిష్టములేక నేను కడప మండలమున ప్రాచీనశాసనముల నిమిత్తము సంచారము చేసినాను.

* * * *

కడపమండల సంచారమున కిది రెండవ తడవ. మొదటి తడవ శ్రీ వెంకట రమణయ్యగారితో కూడ వారి ఖర్చులమీదనే సంచారము చేసితిని. ఈ రెండు తడవలుకూడ పల్లెటూళ్లలో తిరిగి కొన్ని ప్రాచీన శాసనములు సంపాదింప గలిగితిని. ఈ రెండుపర్యాయములు కూడ నందలూరులోని వకీలుగారగు శ్రీయుత గజ్జెల సుందర రావుగారును, ప్రొద్దుటూరులోని వకీలుగారగు శ్రీయుత గజ్జెల కృష్ణమూర్తి గారును, యఱ్ఱగుంట్లలోని వ్యాపారస్థులగు శ్రీయుత కేతు వెంకటరెడ్డిగారును మాకు అమితోపకారులైరి. కడపమండలమున ఇంకను బర్యటనము సలుపవలసియేయున్నది: ముగియలేదు. అందువలన మా పర్యటనవిశేషములను

దెలుపుట కిది యదను కాదు. కాని, పర్యట నము చేసినందువలన చారిత్రకముగ గొప్ప లాభము కలదని మాత్రము స్వానుభవమున దెలుపుచున్నాను.

ఈపర్యటనములో కొన్నికొన్ని చోట్ల నుండెడిశిల్పచిత్రములనుఫోటోతీసియున్నాము. నందలూరికి చేరువగా అక్కడనుంచి కడపకు బోవు రైలుమార్గమునకు కుడిప్రక్క, రైలు స్టేషనుకు మూడుమైళ్లదూరమున కొన్ని శిలా విగ్రహములు కలవు. ఇవి యన్నియు కలసి పదునాలుగు ఉన్నవి. రెండు విగ్రహశిలల మీాద, విగ్రహములప్రక్క తమిళశాసనములు కలవు. ఇవి చాల చెడిపోయినవి. కాని తద్భా షావిదులు శిలలయొద్ద గూర్చుండి చదివి శాస నములను విడదీయవచ్చునేమో యని మాయూ హ. మఱియొక విగ్రహముమీాద "అణాలి శెట్టి వీరప్ప" అని కాబోలు చెక్కబడియున్నది. ఇవి యన్నియు వీరశిలలని మాతలంపు. ప్రతి విగ్రహమును ధనుర్బాణములు, కత్తులు కటా రులు, కుంతములు, కైజారులు, గండ్రగొడ్డళ్లు మొదలైన యోధోచితాయుధములతో నొ ప్పుచు చూడ ముచ్చటగనున్నది. తమిళశాస నముల మూలమునను, వీరులజుట్టుకట్టు, వేష ము మొదలైన శాహ్యాలంకారముల మూల మునను ఇవి చోళపాండ్యులనాటి వీరవిగ్రహ ములు కాదగును. ఈప్రాంతమంతయు ప్రాచీ నకాలమున చోళులయొక్కయు, పిదప పాం డ్యులయొక్కయు పరిపాలనక్రింద నుండె నను టకు నందలూరు సౌమ్యనాథస్వామి యాల యములోని తమిళభాషాశాసనములే తార్కా ణము. ఏతదాలయ నిర్మాణశిల్పమున చోళ శిల్పకళాచ్ఛాయలు పొడకట్టుచుండును. ఒక్క చోళ పాండ్యశాసనములేకాక కాకతీయ, విజ యనగరాధీశుల శాసనములుకూడ నీయాల యమున గానవచ్చుచుండుటచేత నీస్థలము చాల పవిత్రమైనదనియు, నీప్రాంతము చరిత్ర ప్రసిద్ధిని గన్నదనియు నిశ్చయింపవచ్చును.

ఈవీరశిలాచిత్రములలో ప్రభువును, ఆ తని యనుచరులను వేషాలంకారములనుబట్టి పేర్బాతిచి చూపవచ్చును. వీరు లందఱు ఆయుధ పాణులై యుద్ధోన్ముఖులుగ నున్నట్లు చిత్రింప బడినది. దర్శనీయములైనవి యావీరశిలలు. వీటికి చేరికగనే ఒకశిలమీాద తమిళశాసనము కల దు. ఈ తమిళశాసనమును జదివినచో ప్రాయిక ముగ నీవీరశిలావృత్తాంతము కొంత తెలియ వచ్చునేమో. గౌనర్మెంటు శాసన శాఖవారు కాని, పురాతత్త్వ శాఖవారు కాని వీటిని గమనించినట్లు కనబడదు. ఇట్టి విగ్రహములకు చాలచోట్ల పట్టినస్థితియే వీటి కిని పట్టినది. ముక్కులు విరిగిపోయినవి. పని లేని పామరుల దుడుకుతనమువలన కొన్ని కొన్ని విగ్రహములు వికృతాకృతిని గాంచి నవి; అయినను విగ్రహములలో చాలవఱ కింతవఱకు సంపూర్ణరూపముతోనే యున్నవి. వీటి కించుక ఎదురుగ రైలుమార్గమున కవత లి ప్రక్క ఒకమసీదు కలదు. నందలూరిలో నుండు మహమ్మదీయులు ఈవీరులను గొలుచు చుందురని చెప్పుదురు. ఆ విగ్రహములకు

ఈ మసీదుకు ఏదైన సంబంధము కలదో లేమో. అచ్చటివారు ఈ ప్రతిమలు విజయనగ రాధీశులకు సామంతులుగ క్రీ. శ. పదునాలు, పదునేను, పదునెనిమిది శతాబ్దులలో ఆప్రాంతమును బరిపాలించిన చోడవంశజులైన మట్లి ప్రభువుల వని చెప్పుదురు కాని తమిళశాసనములు వీరుల వేషాలంకారములు—వీటినిబట్టి చూచిన ఈ నానుడి సత్యమగునా యని మా సంశయము.

ఈ విగ్రహముల కన్నిటికి ఫోటోలు తీసికొనుట పడినది కాదు. కొన్నిటి మాత్రము తీసినాము. ఆవీరుల రూప రేఖాలంకారములను పాఠకులు గ్రహించుటకు తోడ్పడగల వని దిక్ప్రదర్శకముగ ఆ వీరుల బొమ్మలను ఇందు ప్రకటించుచున్నాము.

కామలాపురమునకు సమీపమున నేయున్న ఎఱ్ఱగుడిపాటిలోకూడ చక్కని శిలావిగ్రహ మొకటి యున్నది. అక్కడ ప్రాచీనశాసనములు కొన్ని కలవని తెలిసి యచ్చటికి వెళ్లినప్పుడు ఈవిగ్రహముయొక్క ఫోటో కూడ తీసికొంటిమి. ఇచ్చటిశాసనములను దీసికొనుటలోను, ఫోటోలను దీసికొనుటలోను అచ్చటి అర్చకులైన శ్రీ రంగాచారిగారును, గ్రామ మునసబుగారైన శ్రీబసిరెడ్డిగారును మాకు చాల తోడ్పడిరి. ఆకర్ణాంతము జ్యావల్లిని లాగి ధనువు మోపెట్టిన యా వీరవిగ్రహము నయనానందకరముగ నుండుటచే దాని బొమ్మకూడ ఇందు ప్రకటించుచుంటిమి. (చూ. చిత్రము ౨.)

కడపమండలమున నీరెండుతడవలు చేసిన సంచారమున కొన్ని విలువగల ప్రాచీనశాసనములను సంపాదింపగలిగితిని. కొంచెమించు మించుగ నివియన్నియు క్రీ. శ. ఏడెనిమిది తొమ్మిది శతాబ్దములనాటివి. శాసనములది ప్రాచీనవేంగీచాళుక్య లిపి. భాష యంతయు తెలుగే. సంపాదించిన శాసనములు చాల వఱకు కడపచోళులవి. ఇవి దేశచరిత్రమునకు, భాషాచరిత్రమునకు చాల అమూల్యమైనవి. కడపచోళుల చారిత్ర మింతవఱకు చక్కగ దెలియరాలేదు. పోర్ముఖరామ పుణ్యకుమారుని మాలెపాడు తామ్రశాసనమున నీకోవవారి వంశవృక్షమునందలి రాజుల పేర్లు కొన్ని తెలియవచ్చుచున్నవి. ఈ వంశపురాజులలో కొండఱిశాసనములు ఈ పర్యటనమున సంపాదితములైనవి. ఇవి కడపమండలచోళుల చారిత్రమునకు కొంత తోడ్పడగలవు. ఈ చోళులకే రేనాటిచోళులని పేరు. వీరు సామంతులో, స్వతంత్రులో, వీరికిని తమిళచోళులకును, వీరికి తెలుగుచోళులకునేమైన సంబంధము లుండెనో లేదో, యున్ననవి యెట్టివో యివి యన్నియు నింకను పరిశోధనవలన సాధింపవలసిన సమస్యలే. చారిత్రక పరిశోధన మింకను కొనలు సాగినగాని యవి పరిష్కారము కాజాలవు.

రాయలసీమ యాంధ్రదేశమునకు కంఠాభరణమువంటిది. చరిత్రపరిశోధన తత్పరులకు గూడ అది కొంగుబంగారమే. తగినకట్టుబాట్ల మీద వ్యయప్రయాసములకోర్చి యాసీమ

నంతయు తిరిగి ప్రయాణముచేసి చారిత్రకముగ పరిశోధనము సల్పితిమేని జీర్ణవిద్యానగర చారిత్రమేకాక ప్రాచీనాంధ్ర దేశచారిత్రము కూడ చాలవఱకు బయలుపడునను ఆశకలదు; కాని "ధనమూల మిదంజగ" త్తనునట్లు ఏకార్యమైనను ధనముతో నున్నది.

కాని యొక్క విషయము తెలుపవలసి యున్నది. రాయలసీమలో ఏ గ్రామమునకు బోయినను శిలాశాసనములకు-అవి విజయనగరాధీశులనాటివైన నేమి, అంతకు పూర్వపువైన నేమి-లోటు లేదు; కాని సుస్థిలో నున్నవి మాత్రము చాల తక్కువ. శాసనశిలలు కొన్ని ప్రాకారములలోని కెక్కియు, కొన్ని అరుగులలో దూరియు, నేఱొక కొన్ని సోపానములలో చేరియు, మఱికొన్ని కత్తులు మొదలైనవి నూరు సాన రాళ్లుగను, సజ్జలు, కొఱ్ఱలు మొదలైనవి దంపుకొను రోళ్లుగను మారియు నాశన మగుచున్నవి. ఇది యత్యంత విషాదకరమైన వృత్తాంతము. రాయలసీమనివాసులు వీటి భద్రపఱుపక ఇంకను ఇట్లే నిరాదరించినచో ఇంతవఱకు నిలిచియున్న శాసనశిలావశేషములు కూడ అంతర్ధానములై దేశచరిత్రకు చాల భంగము వాటిల్లగలదు. ఈ విషయమును గమనించి చరిత్రాభిమానులైన రాయలసీమవాస్తవ్యులు శ్రద్ధవహింతురు గాక!

---

శుక్ల సం. భాద్రపదమాస భారతినుండి పునర్ముద్రితం.

# గోకర్ణదేవచోడుని శిలాశాసనము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

ఒక మిత్రుని దయవలన లభించిన యీ శిలా శాసనము నిజాం రాష్ట్రమునందలి ఏలేశ్వరము లోనిది. శాసనఫలకముమీద ఎగువను కుడి యెడమభాగముల సూర్యచంద్రులును, ఈ రెంటికి నడుమ లింగమును చెక్కబడినవి. హిందువులకళ సాంకేతికమైన దగుటవలన ఈ సూర్యచంద్ర సంకేతములు చేయబడిన దానము ఆచంద్రార్కస్థాయిగ సాగవలయునని తెలుపు ననియు, లింగము దాత శైవుడని కాని, లేదా దానము, శివాలయమునకో శైవమఠమునకో సంబంధించునని కాని తెలుపునదియు నూహింప దగును.

శాసనలిపి క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దినాటి తెలుగులిపి. ఇందు ఉ, ఊ, ఋ, ౠ, ఎ, ఐ, ఒ, ఓ, ఔ లును, ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ట, ఠ, ఢ, ఫ, ష లును తక్క మిగిలిన యక్షరము లన్నియు గలవు. ఆ, డ, ఢ, ద, గ, భ, శ, ళ అను అక్షరములు గమనింప దగినవి. 'అ' అను నక్షరము యొక్క కుడివైపు చిన్నకొమ్ము దగ్గర ఇప్పటివలె పొల్లు తిరిగి మళ్లలేదు. కొంచెము [illegible]ముగ 'డ', 'ఢ', 'ద'లు అన్నియు నొక్కరీతినే యున్నవి. ఇక వాటిలో వ్యత్యాస మేమన: 'ద'వర్ణముయొక్క కుడివైపు దిగువకొమ్ము పొట్టలోనికి ప్రశ్నార్థకమువలె పొల్లుగా మళ్లలేదు; 'డ' వర్ణమునకు మళ్లినది. అదికాక, 'ద'వర్ణమున మరియొక విశేష మేమన: దాని కుడివైపుకొమ్ము ఇప్పటివలె తలకట్టువరకు వ్యాపింపలేదు. 'ఢ' ఇప్పటి 'ధ' వర్ణమువలెనే యున్నది కాని ఒత్తుమాత్రము లేదు. 'ఢ', 'ఘ'లకు భేద మంతగ గానరాదు. 'భ'వర్ణము ఇప్పటిదానికి కొంచెము భిన్నముగ నున్నది. ఈవర్ణముయొక్క రెండువైపుల కొమ్ములును ఇప్పటివలె అడుగున బాగుగ గలియును లేదు; ఇప్పటివలె ఈ వర్ణమునకు ఒత్తును లేదు. ప్రాచీనశాసనములనకు బోయినకొలది ఈవర్ణము యొక్క కొమ్ములు తలకట్టుదగ్గర కలిసికొని అడుగున నొకదానికొకటి చాల ఎడముగా నున్నట్లు కనుగొనగలము. క్రమముగా వచ్చిన యక్షర పరిణామములలో క్రిందికి పైకొమ్ములు ఒకదాని నొకటి యొకటి చేరకపోయి, అడుగున సంబంధము లేక ఎడముగా నున్న కొమ్ములు కలిసికొనిపోవుటయే కాక ఒత్తుకూడ వచ్చెను. శాసనములోని 'శ' వర్ణముకూడ ఇప్పటి 'శ'వర్ణమునకు చాల భిన్నముగ నున్నది. తలకట్టు లేని 'గ'వర్ణమువలె నుండి, రెండువైపుల నున్న కొమ్ములను అంటునట్లు వాటికి లోపల అడ్డముగ నొక్కగీటు గీసినయెడల అది నన్నయభట్టారకునికి పూర్వముండిన 'శ' వర్ణ రూపము. అది క్రమముగ మారి పదునొకండవశతాబ్దినాటికి మన శాసనమున గల 'శ' వర్ణమువలె తయారైనది. పట్టి 'శ'

వర్ణరూపము శాసనమున ౭-వ పంక్తిలోను, ౧౬-వ పంక్తిలోను గాంచనగును. ఈయక్షరముయొక్క 'శ్రీ'రూపము మొదటిపంక్తిలోనే స్పష్టముగ గనిపించుచున్నది. ఈరూపము స్ఫుటముగ చెవిని బోలియుండుటచేతనే, దాని కారూపము సిద్ధించిననాటినుండి ఆంధ్రకవులు కావ్యములలో కర్ణములను 'శ్రీ'కారములతో బోల్చియున్నారు. కాలక్రమమున 'శ'వర్ణము మార్పుజెందు, 'శ్రీ'కారమునగూడ మార్పుసంప్రాప్తించినను, ఆంధ్రకవుల వర్ణనములలోమాత్రము మొన్నమొన్నటివరకుగూడ పదునొకండవ శతాబ్దినాటి 'శ్రీ'కారము చెక్కు చెదరక అట్లే నిలిచి యున్నది! ఇందలి'ళ'వర్ణము ఇప్పటి'ళ' వర్ణమునకు భిన్నముగనున్నది. పరిస్ఫుటమైన 'ళ'వర్ణము౧౨-వపంక్తిలో గానగును. ఈవర్ణము యొక్క దిగువ కొమ్ము పొల్లుతిరిగి కుడివైపున కిప్పటివలె మళ్లి రాలేదు: ఇప్పటి 'ళ'వర్ణమునకువలెగాక శాసనములోని 'ళ' వర్ణమునకు తలకట్టు ఎడమప్రక్క కొమ్ముపై గలదు. వెలుపలిగీతలేక యకారబడు 'ర'వర్ణపు బొల్లు ఈశాసనములో అంతట అక్షరములయొక్క తలకట్టులతోనో, కొమ్ములతోనో చేరియున్నది కాని యిప్పటివలె విడిగా లేదు. ఇయ్యది ప్రాచీనసంప్రదాయము. శాసనమున వ్రాతతప్పులు చాల గలవు.

శాసనభాష తెలుగు. మామూలుగా శాసనముల చివరనుండు, 'స్వదత్తాం పరదత్తాంవా' అను సంస్కృత శ్లోకముకూడ లేదు. భాషలో 'దత్తి' అనురూపము తప్ప మరి యితరవిశేషము లేవియుగానరావు. 'దత్తి' అను రూపమిప్పటికి ప్రాతబడినను పదునేడవ శతాబ్దిలోగూడ నిది వాడుకలో నుండెననుటకు 'రాయదత్తి' మొదలగు పదములే తార్కాణము.

శాసనవిషయము

ఇది కందూరి గోకర్ణదేవచోడ మహారాజు శాసనము. ఈ గోకర్ణదేవచోడుడు మహామండలేశ్వరుడు; సూర్యవంశోద్భవ. కులతిలకుడు; కాశ్యపసగోత్రుడు; కరికాలాన్వయుడు; కోడూరుపురవరేశ్వరుడు. ఈతడు (ఏలేశ్వరమునందలి) ఏలేశ్వరదేవరయొక్క అంగభోగ, రంగభోగములకును, ధూపదీపనైవేద్యములకును పెద్దకోడూరు గ్రామమును దానము చేసెనన్న సంగతిని ఈశాసనము తెలుపుచున్నది.

ఇంతవరకు ఈగోకర్ణదేవచోడని ప్రత్యేకశాసనము లేవియు బయలుపడను లేదు. ప్రకటింపబడను లేదు.* ఇదియే ఈ మహారాజు యొక్క మొట్టమొదటి ప్రత్యేకశాసనము. ఇందే దీని ప్రతిష్ఠ గలదు.

* హైదరాబాదు ఆంధ్రపరిశోధక సంఘమువారు 'సుజాత' పత్రిక ౩-వ సంచికలో ప్రకటించిన 'మామిళ్లపల్లి' శాసనమొకటి ఉన్నప్పటికి, అది ప్రత్యేక మొక్క గోకర్ణుని మాత్రమే కాక అతని సోదరుడు భీముని దానమునుగూడ తెలుపుచున్నది.

సాధారణముగ చోడులందరును తాము కరికాలచోడుని వంశము వారమనియు, సూర్య వంశజులమనియు జెప్పుకొనుట వాడుకయే; కాని వీరిలో వేరువేరు గోత్రములవారును, వేరువేరు పురవరముల కధీశ్వరులైనవారు నున్నారు. ఈశాసనములోని దాతయైన గోకర్ణదేవచోడ మహీపతి కొడూరుపురవరేశ్వరుడు. కమ్మనాటిని బాలించిన తెలుగు చోళులందరును ఒఱయూరి పురవరాధీశ్వరులు. కొడూరు, ఒఱయూరు-పురవరాధీశ్వరు లనుటలో వారి కొడూరు ఒఱయూళ్లు జన్మస్థలములని కాని, లేక వారిపూర్వులు చాలకాలము ఆయూళ్లలో నివసించిరనికాని, లేక వారి ప్రాచరికమచ్చట ప్రారంభమైనదని కాని చెప్పవలసియుండు నను కొందును.

శాసనమువలన గోకర్ణదేవచోడ మహారాజు రాజధాని కందూరని గ్రహింపనగును. ఇది నైజాం రాజ్యమునందలి మహబూబ్‌నగర్ జిల్లాలోని పానుగంటికి సమీపమున జడచర్లకు దక్షిణముగ ౨౨ మైళ్ల దూరమున గలదు.

చాళుక్య విక్రమశకము

ఈశాసనమున పేర్కొనబడిన దానకాలము చాళుక్యవర్షములు 33 అగు ప్లవ సంవత్సర ఆషాఢ శు. ౧౧ బుధవారము. ఈశాసన మానాడు పుట్టినది.

కల్యాణపురము రాజధానిగ కుంతలదేశమును బరిపాలించిన పశ్చిమచాళుక్య వంశజుడును, త్రిభువనమల్ల బిరుదాంచితుడునుఅగు (ఆఱవ) విక్రమాదిత్యుడు తాను సింహాసనమునకు వచ్చిననాటినుండి తనపేర చాళుక్య విక్రమవర్షము అనుగణితి ప్రారంభించెను. ఈ 'చాళుక్య విక్రమవర్షమే' మన శాసనమున 'చాళుక్య వర్ష'మని పేర్కొనబడినది. త్రిభువనమల్ల విక్రమాదిత్యుని శాసనములోని తేదీలన్నియు ఈ 'చాళుక్యవిక్రమవర్షము' అను గణితిలోనె తెలుపబడినవి. ఈశకము ఇప్పుడు మనమువాడుచున్న శాలివాహనశకము వంటిది. చాళుక్యవిక్రమశకము విక్రమాదిత్యుడు (కల్యాణిపుర చాళుక్యుడు)సింహాసన మెక్కిన ప్రథమసంవత్సరమునుండి ప్రారంభ మయినది. త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు క్రీ. శ. ౧౦౭౬-౭౭ లో సింహాసన మెక్కుటచేత అదియే 'చాళుక్యవిక్రమశకము'న మొదటి వర్షము.

విక్రమాదిత్యుని యనంతరము కళ్యాణిపురమును బాలించిన మరికొందరు పశ్చిమ చాళుక్యప్రభువులు కూడ దానశాసనములో తేదీలు తెలుపవలసివచ్చినప్పుడు ఈ శకమునే వాడియున్నారు. అట్లుకాక వారిలో విక్రమాదిత్యుని వలెనే తమపేరుతోకూడ క్రొత్తశకము నారంభించినవారును కొందరు కలరు. భూలోకమల్లు డట్టివాడే. ఇతడు 'భూలోకమల్లవర్ష'మను గణితి ప్రారంభించెను. ఈతడు సింహాసన మెక్కిన మొదటిసంవత్సరమే 'భూలోకమల్లశకము'న మొదటివర్షము. ఇట్టి యితర శకము లున్నప్పటికి, చాళుక్యవిక్రమశకమే

శాసనకాలము పశ్చిమచాళుక్య భూపతులు పరిపాలనమున తరుచు వాడుకలో నుండెను.

చాళుక్యవిక్రమశకము ఏశాసనములో వచ్చినను ఆశాసనము వేయించిన రాజుగాని, ఆశాసనమువలన దెలియవచ్చు దానమును జేసిన దాతకాని పశ్చిమచాళుక్య భూపతులకు సామంతుడనియైనను, లేదా శాసనమున్న యాప్రదేశము పశ్చిమ చాళుక్య నృపాలురరాజ్యములోని దనియైనను మనము నిశ్చయింపవలసి యుండును.

ఈపై నుడివినదాని ననుసరించి యీ శాసనమునందలి దాతయైన మహామండలేశ్వర కందూరిగోకర్ణ చోడమహారాజు పశ్చిమ చాళుక్యాధికారమునకు లోబడిన సామంతుడై యుండదగు నననచ్చును. శాసనములలో నీ'చాళుక్యవిక్రమ శకము' పశ్చిమ చాళుక్య పృథివీశుల పరిపాలనాధికారములను సూచించును.

కాలనిర్ణయము

ఇక శాసనకాలమునకు సరియైన ఇంగ్లీషు తేది కనుగొందము. ప్లవ సంవత్సర ఆషాఢ శు. ౧౧ లు మంగళవారమైనది కాని బుధవారమగుటలేదు. ఆనాడు ఏకాదశి తిథి సూర్యోదయానంతరము గ. ౨౧, వి. ౩౦ లతో పూర్తియగుచున్నది. ఇట్లు వారము తేడా వచ్చినది. అదియునుగాక, అదచాళుక్య విక్రమశకము ౪౬ కాని శాసనమున దెలిపినట్లు ౩౩ కాదు.

అయితే ప్లవకు పూర్వపుసంవత్సరమైన శార్వరిలో ఆషాఢ శు. ౧౧ సరిగా బుధవారమే యగుచున్నది; కాని యిచ్చట వారము సరిపోయినను సంవత్సరము సరిపోవుటలేదు. శాసనమున దెలుపబడిన సంవత్సరము ప్లవ కాని శార్వరికాదు. ఒకవేళ సంవత్సరము పొరపాటనుకొనినను అది చాళుక్య విక్రమ వర్షము ౪౬ అగునుకాని ౩౩ కాదు. అందువలన ఈశాసనమున నిచ్చిన తేదీలో ఎచ్చటనో పొరపాటు కలదు.

ప్లవంగ అనుటకు ప్లవ అని పొరపాటుగా వ్రాయబడినదేమో యని యూహించుచో, ప్లవంగకు తిథివారము లన్నియు సరిగా సరి[illegible]సంవత్సర ఆషాఢ శు. ౧౧ బుధవారము సరిగా క్రీ. శ. ౧౧౨౮-వ జూలై నెల ౧౧ వ తేది అగుచున్నది. ఆనాడు ఏకాదశితిథి సూర్యోదయానంతరము గ. ౧౧, వి. ౩౦ లతో పూర్తియగుచున్నది. శార్వరిలోను, ప్లవంగలోనుకూడ తిథి వారములు సరిపోవుచున్నను, వ్రాత పొరపాటని సమర్థింపదగిన ప్లవంగనే సరియైన శాసనకాల సంవత్సరముగా గ్రహించుట యుక్తము. చాళుక్య విక్రమవర్షము శార్వరి, ప్లవ, ప్లవంగల లో దేనికిని సరిపోదు.

అందుచేత చిన్న వ్రాతపొరపాటుతో సంవత్సరము, తిథి, వారము అన్నియు సరిపోవుచున్నవి గనుక అది ప్లవంగసంవత్సరమే కాని ప్లవసంవత్సరము కాదని నిర్ణయింపదగునేమో; అట్లయిన నది చాళుక్య విక్రమవర్షము ౪౭ అగును. దాత ఈ కాలపువాడే యని ఇతరశాసనములవలన గూడ దెలియుచున్నది. ఈశాసనమునందలి తేదీకి సరిపడిన ఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౧౨౮ వ జూలై ౨౧ వ తేది యగును.

# శాసన మూలము

( ) ఇట్టి గుర్తులలో ఒప్పులు తెలుప బడినవి.

[*] ఇట్టి గుర్తులలో మూలమున లేని యక్షరములు ఉంచబడినవి.

౧. స్వస్తి శ్రీమతుచ్చా (చా)
౨. ళుక్యవర్షము
౩. లు 33 గుప్లన స[ం*]
౪. న్సర ఆసా(షా)ఢ(ఢ) సు(శు)
౫. ౧౧ బుధవారము
౬. నాండు స్వస్తి సమధ(ధి)
౭. గత(త) పంచమహాశ
౮. బ్ద మహామండలే
౯. శ్వర వి(వీ)రమ(మా)హేశ్వర
౧౦. కోమూర్వ్వరవ
. రేశ్వర సూర్య్యవం
౧౨. శోద్భవకుళతిలక
౧౩. కాస్యపగోత్ర కరికా
౧౪. లాన్వయనామా
౧౫. దనమస్తప్రస(శ)స్తి
౧౬. శ(స)హితము శ్రీమ
౧౭. న్మహామండలేశ్వర
౧౮. కందూరి గోకన్న
౧౯. దేవచోడ మహారా
౨౦. జులు (శ్రీ) ఏలేశ్వర దే
౨౧ వర అంగభోగరంగ
౨౨. భోగముంకూ(కు) ధ(ధూ)
౨౩. పదీప నివేద్యముల
౨౪. కూం(కుం) బెదకోమూరు ఆ[(ఇ)చ్చి
౨౫. నంద్రార్కస్తా(స్థా)ఇ(యి) గా ఈ
౨౬. తిమి ఈదత్తి ఆచంద్రా
౨౭. ర్కముగా నడపంగల
౨౮. వారు

---

ప్రభవ సంవత్సర పుష్యమాసభారతినుండి పునర్ముద్రితము

# 'అహాదనకర' శాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

చాల కాలముక్రితమే కీ. శే. శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావుపంతులుగారు ఈశాసనములోని తెలుగుభాగమునకు అర్థము తీయుటకై చాలకృషిచేసియున్నారు. శాసనలేఖకుడు శాసనమును చాల నశ్రద్ధగ వ్రాసియుండుటవలన, మగల ఈశాసనపురేకులను సంపాదించి, వాటినుండియే మూలమును జదివినచో ఫ్లీటుదొరగారిచ్చిన పాఠముకంటె మంచిపాఠమేర్పడుట కవకాశముండునేమో యని వారు లండను బ్రిటిషు మ్యూజియము వారికి రేకుల నిమిత్తము వ్రాసిరి; కాని వారు అసలురేకులను బంపుటకు వీలు లేదనిచెప్పి, ఒకప్రతి ప్రతిబింబములను ఒకప్రతి శాసనపు ఫోటోలను బంపిరి. నేనును లక్ష్మణరావుగారును ఈప్రతులను ముందుంచుకొని శాసనమునందలి యక్షరస్వరూపమును గురించియు, పదములను గురించియు చర్చించుచుండిన నాటిసంగతులు నేడీసందర్భమున దలపునకు వచ్చుచున్నవి. అటుతరువాత నేను రాజమహేంద్రవరమునకు వెళ్లుటతో ఇందునుగురించిన నాకృషి నిలిచిపోయినది. లక్ష్మణరావుగారింకను దమకృషిని సాగించుచునే యుండిరి. వారీశాసనమున వచ్చు పదములన్నిటిని తీసి, పట్టికలు తయారుచేసి, తెలిసినచో ఆ పదములకే కాని, లేకతత్ప్రాంతిక ప ములకు గాని యర్థము తెలుపవలెనని కోరుచు వాటిని కొందఱు ద్రవిడ, కర్ణాట పండితులకు బంపిరి; కాని అందువలన దమకు ఏవిధమైన ప్రయోజనమును కలుగలేదని తరువాత వారి నొకపరి కలిసికొనినప్పుడు నాతో చెప్పినట్లు జ్ఞాపకము. ఏదో యొకవిధమున ఈ తెలుగుభాగమున కర్థము తీసి, దానిని గురించి ఒక 'నోటు' 'ఎపిగ్రాఫియా ఇండికా' లోను, ఒక 'నోటు' 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక' లోను ప్రకటింపవలెనని ప్రయత్నించుచుండగనే వారు అకాలమరణము వాతబడుట తటస్థించెను.

తిరిగి నేడు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు దీనిని కదిపియున్నారు. కడచిన భారతిసంచికలో వారీశాసనమునందలి తెలుగుభాగమునకు పద, పదార్థ వివరణములను గావించి, ఆంధ్రభాషకు మహోపకారము చేసినందుకు అభినందింప దగియున్నారు. వారు కొన్ని యక్షరములను మార్చియు, మరికొన్ని యక్షరములను దీసివేసియు, వేరొక కొన్నిచోట్ల లేని యక్షరములను జేర్చియు ఈశాసనపు తెలుగుభాగమున కర్థవివరణము గావించియున్నారు. ఇట్లు దానిని సంస్కరించి కావించిన యీయర్థవివరణము ఎంతవరకు సరియైనదని చాల సందేహింప వలసియున్నను కొన్నికొన్నిపట్టుల వారు కావించిన శబ్దనిష్పత్తులు భాషావేత్తల సాదరాలోచనమునకు పాత్రములు.

ఈ శాసనమునుగురించి వ్రాయుటలో శ్రీశాస్త్రి గారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో నేనిచ్చిన ఈ శాసనమునందలి తెలుగుభాగపు పాఠమును గూర్చి కూడ తలపెట్టియున్నారు. ఆసంచికలో నేనిచ్చినది బర్జెస్‌దొరగారి పాఠము. అప్పటికి నేను రాజమహేంద్రవరమున నుండుటచేతను, నాయొద్ద శాసనప్రతిబింబములు లేకపోవుటచేతను నామతము ప్రకారము ఆ శాసనపాఠము ఎట్లుండదగునో తెలుపుకొనుటకు నాకు అవకాశము లేకపోయినది. అందువలన ఈ శాసనమునందలి తెలుగుభాగమున కిప్పుడు నాపాఠము నిచ్చుచున్నాను.

౧౭. స్వస్తి ప్రిథివి పల్లవపట్టనబున ఊరి

౧౮. వారు కరిగల్లి వడవరికి ఊరిస్వామ్యుళ్ ఇచ్చిన స్తితి రెణ్డువాడల పట్టనావురకు

౧౯. అరియు డగు తెతెయు సిద్ధాయంబు దణ్డు[1] దనపరాధబును సర్వ్వబాధప

౨౦. రియారువు ఊరు దాయసెసి[2] ఇచ్చి దినికి వక్రంబు శెదు వచ్చినవారు గళరెని ఊరిస్తితి

౨౧. దప్పినవారు దినికి వక్రంబు వచ్చిన గచ్చురు రెణ్డువడల ఎలెవు[3] వరులెములల[4]

౨౨. సినదియు చన్ను విరిపయినాడు[5] వరు గల్గిన ఎళెముళ్ చెసిన సెయుడుసను



౨౩. మహానబియుళ్ నరాళ్కె[6] మహాసత్థవుళ్ విరావవ మహానబియుళ్ గజ్జబు[సె]

౨౪. జ్జ[7] నడుపుళ్ శమస్తభువనశ్రియకనడిరజు బద్దపెరెయ ఊరిపనిస ప్రసివర

౨౫. వయ్యెటి[8] మాహానభిళ్ వయ్యెటి మహాభిళ్ పని కొళుచెనెరక పచ్చిన ప్రసి

౨౬. వయ్యెటి మహానభియుళ్ స[9]క[10]ల కొన్డుకళ్ సన్వలొకశ్రయ మహాసత్థవళ్

౨౭. పెద్దళ్ నెరవద్యమహాసత్థవళ్ పసిణ్డిముధ్ధు[11] వెటస్లల చరువయ్య[12] విష్ణువర్ధన మ

౨౮. హాసత్థవళ్ పసుత్తెవుల కొన్డుకళ్ అచ్చకుట్టవనియు కొన్డుకళ్ గజంబు[13]సెస్ల[14]ల

౨౯. నడుపుళ్ ప్రిథిమి మహాసత్థవళ్ వెటస్లళ్ పానికస్టిఅము కొళనడుపు విష్ణువర్ధన

౩౦. మహాసత్థవల కొన్డుకలు నిరవద్యప్రిథివి కనడిరజుళ్ గునవన మహానవియుళ్

౩౧. ముద్దకళ్చికొళ్ రమిస్వరాప్రిథివి మహాసత్థవళ అపయజ[15]నువకాల కొణ్డుకళ్ కొరిన్ధి[14]

౩౨. కరిగల ప్రిథివి మహాసత్థవల కొన్డుకళ్ నన్దిమహానవిల నడుపు శ్రీమహా [కొళ్

౩౩. సత్థవళ సకలొకశ్రయ్య ప్రిథివి మహాసత్థవల టి[16]వకరయ్యపచ్చి

౩౪. కొళ్ శ్రీజప్పి పెస్దటట్ట గన్దాన్డు

నే నిచ్చిన యీపై పాఠమునకును శ్రీశాస్త్రిగారు కడచిన భారతిసంచికలో నిచ్చిన పాఠమునకును గొంత భేదముకలదని చదివినవెంటనే బోధపడగలదు. నే నట్టి పాఠము నిచ్చుటకుగల కారణములను సవిశేషముగ నిచట పేర్కొనుచున్నాను.

1. దణ్ణు: ఇచట 'ణ' కలదుకాని 'న' లేదు; 'రెణ్డు'లోని 'ణ'యు, 'దణ్డు'లోని 'ణ'యు ఒక్కరీతి నున్నవి చూడుడు.

2. గుణింతమున ఎ, ఏ హ్రస్వదీర్ఘములకు ఈ శాసనమున భేదముపాటింపబడలేదు. చేసి, లేదు అను పదములలోని ఎత్వమునకు దీర్ఘముకలదనుట నిశ్చయమే యైనను నాకు తెలియనిక్రొత్తమాటలలో ఎత్వమునకు దీర్ఘముండవలెనో లేదో తెలియరాకుండుటచేత భాషా జిజ్ఞాసువులు ఎత్వ, ఏత్వములను నిర్ణయించుకొన గలరను తలపున శాసనమునం దెల్లెడల హ్రస్వరూపమునే వాడితిని.

3. ప్రతిబింబమున గాన్పించునరీతినిబట్టి చూచిన చో ఈయక్షరము 'వు' కాదగునుకాని 'ము' కాదని నాయభిప్రాయము. 'ము' అను అక్షరము ౧౬, ౨౫ పంక్తులయందు 'ప్రముఖాణా'అన్నచోటను,'స్వాముల్' అన్నచోటను, ఈ 'రేణ్డువాపిల' అన్న పంక్తిలోనే 'లెముల' అన్నచోటను, 'ఎలెముళ్' అన్నచోటను నాలుగుపర్యాయములు వచ్చినది. ఇన్నిటిలోను మకారపు కొమ్ము స్పష్టముగ గాంపనగును; కాని యిచ్చట ఆకొమ్ము కనబడుటలేదు. 'భూతద్దము' నుపయోగించి చూచినను అది 'వు'గనే కనబడెనుగాని 'ము'గ కనబడలేదు. 'ఎలెవు' క్రొత్తపదమగుటచేత దీనిస్వరూపమును అక్షరముల వైఖరినిబట్టియే నిరూపింపవలసి యుండును గనుక ఇంత సూక్ష్మముగ వాటిని పరిశీలింపవలసిన యవసరము కలుగుచున్నది.

4. ఈ యక్షరమును ఉన్నరీతి ననుసరించి చదువవలసి వచ్చినచో 'లొ'కారముగ చదువుదునుకాని 'చె'గ చదువను. ఇది 'లొ'కారమునకే చేరికగనున్నది. ౧౬,౨౨ పంక్తులయందు 'ఇచ్చిన', 'వచ్చిన', 'గచ్చురు', 'చను', 'చేసిన' అను పదములలోని 'చ' వర్ణమును జూచిన ఇది 'లొ'కాదగు ననుకొందును.

5. శాసనము చివరికిపోయినకొలది 'ద' 'డ'లకు భేద మంతగ కానరాదు. ఏది 'డ' యైనదియు, ఏది 'ద' యైనదియు తెలియరాదు.

6. గుణింతమున ఒ, ఓలకు కూడ ఇందు భేదము పాటింపబడలేదు. ఇందువలన శాసనమునం దంతటను హ్రస్వ 'ఒ' కారమునే వ్రాసితిని.

7. ఇది 'ఘ' వలెనున్నది. ఇదేవిధమైన యక్షరము సంస్కృతభాగమున 'అశ్వమేధావభృథ' అన్నదానిలో వచ్చినది; కాని సాధారణముగ ప్రాచీన శాసనములన్నిటిలోను 'ఘ' కు పొట్టలో చుక్కయే కాని అడ్డుగీటు ఉండదు. అడ్డుగీటున్న యిట్టియక్షరములును ప్రాచీనాంధ్ర శాసనములలో చాలచోట్ల వచ్చినవి. అట్టియక్షరము శకటరేఫమని నానమ్మకము. దానికి కారణమును ముందు చర్చించెదను. ఈయక్షర మీరూపమునను, ఇంచుక గొంచెము విలక్షణమైన రూపమునను 'కొఱ్ఱుక', 'కఱ్ఱిణము', 'గఱ్ఱు' అనుపదములలో గూడ వచ్చును. 'అశ్వమేధావభృథ' లోని 'థ' ఇట్లే యుండుటచేత ఈ తెలుగుభాగమున వచ్చిన యిట్టియక్షరముల నొక్కొక చోట ఫ్లీటు మొదలైవారు 'ఘ' గనే చదివియున్నారు.

8 ఈయక్షరము టి (ష్టి) యని నాయభిప్రాయము. 'చోటు','ఏటు' మొదలైన పదములలోని 'టు'రూప మిట్టిదే. ఇది 'టి' యనుకాదు, 'తి' యనుకాదు.

9. నేను 'సకల' గ చదివినదానిలోని మొదటి యక్షరమును శ్రీ శాస్త్రిగారు 'మ' గ చదివిరి. ఈశాసనమునవచ్చిన 'స' ఎట్లున్నదనగా: 'స' యొక్క అడుగు 'సున్న' భాగము పెద్దదిగ నుండవలెను. సున్నకును తలకట్టునకును మధ్యనుండు నిలువుగీటు చిన్నదిగ నుండవలెను. సున్ననుండి కుడివైపునకు వచ్చినకొమ్ము కొంచె మెగువగ, సాగారినట్టుగాక చేరికగ కుదించినట్టు ఉండవలెను. ఇందువచ్చిన 'స' వర్ణమునకు సాధారణముగ ఇదియే లక్షణము. శాసనమున వచ్చిన 'స' వర్ణములన్నియు సాధారణముగ ఇట్లే యున్నవి. ఈలక్షణమున కీయక్ష

# కిర్లోస్కర్ పంపులు

## కిర్లోస్కర్ "రావి" నీళ్ళపంపు

తక్కువలోతు భావులకు మిక్కిలి ఉపయోగకరమైనది!

చాలఅందముగ నుండునది!! సులభమైనది!!!




గంటకు 300 గ్యాలనులు లేక 75 కెరసనాయిల్ డబ్బాలనీళ్ళను పంపుజేయును.

దీనిలో రెండురకములున్నవి. రావి నెం 1 పంపు 20 అడుగులలోతు భావులకు మాత్రమే ఉపయోగింపవచ్చును. దీనివెల రు 12-0-0. రావి నెం 2: 25 అడుగులలోతుగల భావులకు ఉపయోగింపవచ్చును. మరియును యేతికాలువలగుండ నుండు 1/4 యకరా విస్తీర్ణముగల భూములకు నీళ్లు పారుదలపెట్టుటకు బాగుగ ఉపయోగించును. 8 గంటలకాలము పంపుచేసిన 1/4 యకరాభూమి పారును. దీని వెల రు 23-8-0.

దీనిని భావులకు అమర్చుట బహుసులభము. వెనుకటి అనుభవముతో పనిలేదు. భావికిమీదుగ రెండుదంతెలువేసి, వాటికి ఈ పంపును బిగించవలెను. పంపు చేయుటకుమునుపు పంపులో నీళ్లు పోయవలెను. తరువాత పంపుచేయుటకు ప్రారంభించినచో ఎక్కువ శ్రమలేకనే నీళ్ళు ధారాళముగా వచ్చును. బాలురు స్త్రీలు కూడ పంపుచేయవచ్చును. పంపుమీదిభాగము మూయబడినది. హేండలు ఏప్రక్కనైనను బిగించవచ్చును. ప్రతిభాగము సులభముగా తీయుటకు అమర్చుటకు అనుకూలము కలదు.

ఈ పంపును ఉపయోగించుటచే మీభావులు నిరంతరము ఆరోగ్యకరముగా నుంచుకొనవచ్చును. వెలసులభము చాలకాలము పనిచేయును.

లన్నియు జేయుటకు పంపబడిన పండితులు, మున్షీలు, గుమాస్తాలు తనను మోసముచేయకుండ వారు వారము వారము తనకు 'దినచర్య' పంపునట్లేర్పాటు చేసెను... ఈతడు పెక్కు భాషల కైఫీయతులను గ్రంధములను సంపాదించినను వానిలో తెనుగుభాషకు సంబంధించినవి మాత్రము ఇతరములకంటె పెక్కుడుగ నున్నవి. ఇట్లు సంపాదింపబడిన నూతనజ్ఞానము నాతడు వేలువేలు పత్రికలలో వ్యాసములువ్రాసి ప్రపంచమునకు దెలుపుచుండెను. ఈతడీ సంగ్రహమున కెంతధనము వెచ్చించెనో మనము నిశ్చయముగ జెప్పలేము కాని వేలకొలది వెచ్చించెనని యూహించుటకు మాత్ర మొకయాధారము కలదు. మెకంజి చనిపోయినతరువాత నాతని సంగ్రహముయొక్క యోగ్యతను తెలిసికొని "ఈస్టు యిండియా కంపెనీవారు" అతని భార్య కొకలక్షరూపాయ లిచ్చి, యాసంగ్రహమును కొనిరి. దొరతనమువారు లక్ష యిచ్చి కొన్నప్పుడు మెకంజీ తప్పక యిరువదివేలైనను వెచ్చించియుండునని మనమనుకొనవచ్చును. ఏమి యానిర్వ్యాజ జ్ఞానజిజ్ఞాస! పరదేశీయులు మనదేశపు తాటియాకులకును, కొండపల్లి ముతుక కాగితములకును ఇరువదియైదువేలు వెచ్చింపవలయును? జ్ఞానానంద మద్భుతముకదా!"

తాడిపత్రి కైఫీయతు,

'మెకంజి సంగ్రహములోని కైఫీయతులలో ఈ తాడిపత్రి కైఫీయతు ఒకటి మెకంజీచే సంపాదితములైన యీ కైఫీయతులు జీర్ణమగుచుండగా ఆంధ్రభాష కత్యంతోపకారము కావించిన సి. పి. బ్రౌను దొరగారు వాటిలో అనేకములకు నకళ్లు వ్రాయించియున్నారు. వీటినే నేను స్థానికచరిత్ర లందురు. ఇవియన్నియు గౌర్నమెంటువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండారమున చెన్నపురిలో నున్నవి మెకన్జిసంగ్రహములోని తాడిపత్రి కైఫీయతుకు సరియైన నకలుఅగు 'స్థానిక చరిత్ర'లలోని ప్రతిసిబట్టి దీనిని వ్రాసియున్నారు.

ఇట్టి కైఫీయతులను వ్రాయించుటకును, తాటాకు పుస్తకములను సేకరించుటకును మెకంజీదొరవలన రాయలసీమకు పంపబడిన యుద్యోగి ఆనందరావు. ఇతడు తాడిపత్రిలోని పెద్దలచేత ఈ కైఫీయతు వ్రాయించినాడు. కైఫీయతు వ్రాసిన పెద్దలు కైఫీయతు చివర ఇట్లు వ్రాసియున్నారు:

"యీప్రకారం కసుబా తాడిపత్రి కైఫీయతు సదరహెగ్రాము కర్ణాలు వద్దనుంచి ఆనందరావుయిలాకె హజరతు కర్ణాలు కాలిన్ మెకంజీసాహెబు సరవియార్ జనరలవారి తరఫునుంచి యీ తాడిపత్రి గ్రామాన్కు కైఫియ్యత్తులు, శిలాశాసనాలు వగైరా దరయాప్తునిమిత్యము వచ్చి కసుబా తాడిపత్రి కైఫియ్యతు వ్రాయించినారు."

ఆనందరావు ఇట్లు వ్రాసియున్నాడు:

"శాలివాహన శకవరుషంబులు 1734 అగునేటి అంగిరస నామసంవత్సర వైశాఖ శు॥౧లు ఆదివారం యీరోజున తాడిపత్రి మొకాములో (ఈ కైఫియ్యతు) వ్రాయించడమైనది."

దీనిననుసరించి యీ కైఫీయతు క్రీ.శ. 1812-13లో అనగా ఇప్పటికి నూటపదునెనిమిది సంవత్సరములకిత్రము వ్రాయబడినట్లు తెలియనగును. నేను 'రాయలసీమ' యను పేర బరగు మండలములన్నియు క్రీ. శ. 1800 లలో హైదరాబాదు నిజామువారిచే 'కుంపిణీ'

వారికి దత్తము చేయబడినవి. ఈ ప్రాంతమంతయు 'కంపిణీ' వారికి వశమైన పండ్రెండు సంవత్సరములకే యీ కైఫియతు పుట్టుట చేత ప్రాచీన చారిత్రమున కెట్టులున్నను విజయనగర సామ్రాజ్య పతనానంతర చరిత్రమున కిది మంచి ప్రమాణాధారమనుటకు సంశయము లేదు.

కైఫియతుల స్వభావము.

కాని అమూల్యమైన చారిత్రిక వృత్తాంతముగ దీనిని అంగీకరించినను నేను [illegible]డుకొనున్న దేశ చరిత్రలవంటి చరిత్రమును వ్రాయవలెనన్న ఇందుండి మనము సత్యములైన చారిత్రిక విషయములను ఏరుకొనవలసియే యుండును. ఏలయన ఇట్టి కైఫియతులు వ్రాసినవారి దృష్టికిని, ఇప్పటి చరిత్రకారుల దృష్టికిని చాల వ్యత్యాసము కలదు. కైఫియతులు, శాసనములు మొదలైన యాధారముల వలన గ్రామ చరిత్రము వ్రాయుటయే లేఖకుల యాశయమైనప్పటికి ఇప్పటి చరిత్రకారుని కనవసరముగ తోచు విషయములు కూడ ఇందు అనేకములుండును. కైఫియతులు వ్రాసిన లేఖకుల దృష్టి ప్రకారము చేయవలసిన, చేయుచువచ్చిన విషయము లివి: (౧) గ్రామసీమ యొక్క పవిత్రత, ఘనత (౨) గ్రామము ఏర్పాటైన విధము: గ్రామనామము (3) కృత, త్రేతా, ద్వాపర యుగముల నుండి కలియుగారంభము వఱకు తత్ క్షేత్రము యొక్క స్థితి ప్రపత్తులు [౪] ఉన్నయెడల క్షేత్రమహాత్మ్యము (౫) పరీక్షిత్తు జనమేజయుల వారి పరిపాలన (౬) క్షేత్రమునందు కలియుగమునకు పూర్వమెప్పుడో నివసించియుండిన మహర్షులు కాని, లేక పరీక్షిజ్జనమేజయాదులు కాని చేసిన దేవాలయాది ప్రతిష్ఠలు (౭) జనమేజయాదుల పరిపాలనము ముగిసినపిదప ఈ ప్రాంతమును పాలించిన రాజవంశములు, రాజులు: వారు కాని, వారి సామంతులు కాని, సేనాధిపతులు కాని చేసిన దేవాలయ ప్రతిష్ఠాది ధర్మకార్యములు, దానధర్మములు (౮) గ్రామసీమా వివరము [౯] ఆయకట్టు పరిమితి [౧౦] ఆయగాండ్ల వివరము (౧౧) భటవృత్తి మాన్యములు: జాతికట్టు మాన్యములు: రెడ్డి, కరణము మిరాశీలు, గాడికె, కులకర్ణీక స్వాస్థ్యములు వగైరాల వివరము - ఈ మొదలైనవి కడు సవిస్తరముగ వ్రాయబడును. కరిణీకము, రెడ్డి మిరాశీలు ఎప్పుడెప్పుడు ఎవరెవరు అనుభవించుచు వచ్చినదియు మాన్యములు ఎప్పుడెవరెవ రేయేరీతిని అనుభవించుచు పంచుకొనుచు వచ్చినదియు - ఇవి యన్నియు సూక్ష్మములైన విశేషాంశములతో ఇందు పొందుపఱుపబడి యుండును. విశేషముగ ఇందు ఏయే దేవాలయములు ఎవరెవరు కట్టించినది, వాటికి ఏయే ప్రభువులు దానధర్మములు జేసినది. [ఆ గ్రామమునకు సంబంధించినంతవఱకు) ఏయే ప్రభువులు అగ్రహార భూదానాదులు జేసినది తెలుపబడును.

మన పూర్వుల చారిత్రకదృష్టి.

వీటి నన్నిటిని పరిశీలించినచో మన కొక్క సత్యము తెలియవచ్చును: అది చరిత్రవిషయమున మనపూర్వుల దృష్టి యెట్టిది

అనువిషయము. ఆదృష్టి, ధర్మదృష్టి, రాజ్యములు లేవనిందు; రాజ్యములు కూలనిందు; రాజులు రానిందు; రాజులు పోనిందు; వారు గమనించుచువచ్చినది ధర్మము. ఒక రాజవంశము ఎప్పటినుండి ఎప్పటివఱకు పరిపాలనము వహించియుండెను? ఒక్కొక్క రాజు యొక్క పరిపాలనకాలపరిమితి యేమి? ఏరాజు తరువాత ఎవరు సింహాసనమునకు వచ్చిరి? ఒక్కొక్క రాజు చేసిన దండయాత్రలేవి? కావించిన యుద్ధము లేవి? వడసిన విజయములేవి? ఇవి యన్నియు నేటి చరిత్రకారునికి; కాని పూర్వుల కివి అనవసరముగాలినవి. ధర్మసంగ్రహణమున కివి అవసరము లేవు. నేటి చరిత్రకారునిది రాజకీయమైన జాతీయదృష్టి కాన నేడివి కావలిసివచ్చినవి. మన పూర్వులనాడు రాజకీయమైన జాతీయతయే లేదు. నాడె "నావిష్ణుః పృథ్వీపతిః" అన్న ఆర్యోక్తికే గణ్యత. రాజాభిమానమే కాని దేశాభిమానము [రాజకీయార్థమున] లేదు. రాజత్వమే కాని ప్రజాప్రభుత్వము లేదు. ప్రజలు ధర్మమున పుట్టి, ధర్మమున పెరిగి, ధర్మమున అంతరించిన యుగమది కావుననే ఒక రాజు పరిపాలనము బాగుగ నుండెనా లేదా యన్న ఆరాజు చేసిన దానధర్మములు (భూదాన అగ్రహారదానములు) దేవాలయాది ప్రతిష్ఠలు రైతుల యుపయోగార్థము త్రవ్వించిన కాలువలు, చెఱువులు - ఇవే నిర్ణయాధారములైన సాధనములు. రాజ్యాంగవిధాన మెంతబలసిపోయినను ప్రధానముగ దాని కర్తవ్యము వైదికధర్మ పరిరక్షణమే. కావుననే ఈ కైఫీయతు లను గ్రామచరిత్రలందుకూడ ధర్మకార్యవర్ణనమునకే ప్రాధాన్య మొసంగబడినది.

తాడిపత్రి చరిత్రము.

మన 'తాడిపత్రి' కైఫీయతుకూడ ఆ రీతిమునకు చేరినదే. విజయనగరసామ్రాజ్యము ఉదయించినప్పుడే వెలసినదగుటచే ఈ గ్రామము చాల 'ప్రాచీనమైనదే' అని చెప్పవచ్చును. కైఫీయతుప్రకారము గ్రామనామము 'తాడిపత్రి' కాని ప్రస్తుతము వాడుకలో నున్నట్లు 'తాడిపత్రి' కాదు. తాడిపత్రి చరిత్ర మనిన దక్షిణ హిందూదేశచరిత్ర. కాని దక్షిణహిందూదేశ చరిత్రక విషయములు తాడిపత్రికి సంబంధించినంతవఱకే యిందు పొందుపఱుపబడియుండుటను మనము గమనింపగలము. ఈ కైఫీయతువలన తెలియవచ్చు చారిత్రమును ఈదిగువ వివరించుచున్నాను.

విజయనగర పరిపాలనము.

విజయనగర సామ్రాజ్యము నిర్మింపబడిననాటినుండియే యేర్పడినదగుటచే తాడిపత్రిచరిత్ర విజయనగరభూపతుల కాలమునుండియే ఆరంభమగుచున్నది. బుక్కరాయల కాలములో ఈ 'సీమానూలను' వ్యవహారము చేయుటకు వచ్చినవారు జిల్లెళ్ల చలపతిరాజుగారు. వీరే గండికోట కోటకట్టించినట్లు కైఫీయతు తెలుపుచున్నది. విజయనగరాధిపతియైన హరిహరరాయలు [మొదటి బుక్కరాయల కొడుకు రెండవ హరిహరరాయలు కావచ్చు) జిల్లెళ్ళ చలపతిరాజును

పెనుగొండ రాజ్యమునకు మార్పుచేసి, గుత్తి, గండికోట రాజ్యములు వ్యవహారముచేయుటకు నందేల వీరరాఘవరాజును పంపించెను. అటుతరువాత విజయనగరమున ప్రౌఢదేవరాయలు రాజ్యము జేయుచున్న కాలమున తాడిపత్రిప్రాంతమునకు పెమ్మసాని తిమ్మానాయుడు అధిపతిగా వచ్చెను. గుత్తి గండికోట రాజ్యములు అతని యేలుబడిక్రిందనుండెను. యాడికిగ్రామము నతడు రాజధానిజేసుకొని పాలించెను. తిమ్మానాయుని యనంతరము అతనికొడుకు రామలింగానాయుడు ఈప్రాంతమంతయు వ్యవహారము జేయుచుండెను. ఈతని కాలముననే ఈగ్రామమునకు తాడిపత్రి అని పేరు కలిగినట్లు కైఫీయతులోని ఈక్రింది పంక్తులు తెలుపుచున్నవి.

“ రామలింగానాయుడు రాయలవారి శెలవు ప్రకారము వ్యవహారము చేస్తూ యీ తాళ్ళపల్లె అనే గ్రామము నందేల వీరరాఘవరాజు గారు కొంత బస్తీ చేసి రంగస్వామి దేవాలయము కట్టించివుండగా ఆదేవాలయము మొదలు చేసుకుని తూర్పు యింకా గ్రామము విస్తారంగా కట్టించి బస్తీ చేసి తాడిపత్రి అనే పేరు పెట్టి … …”

ఈ తాడిపత్రికి ఆగ్నేయభాగమున ఒకకోట కట్టించి ఆకోటలో ఆతడు నివసించుచుండెను. ఈరామలింగానాయుడే “లింగనాచారి మొదలయిన కాశీవాండ్లకు పనియిచ్చి యీపినాకినికి జగతికట్ట కట్టించి, యిందుకు (యీగ్రామమునకు) పశ్చిమము మూడుకోసులమీద వజ్రగిరి నరసింహస్వామికొండ రాళ్లు కొన్ని, యీశాన్యభాగమందు పదికోసుల మీద తలమంచిపట్నం రాళ్లు కొన్ని ...... మలిపించి తెప్పించి” రామేశ్వరస్వామి ఆలయము కట్టించెను. రామలింగానాయుడు కాలముచేసిన పిదప అతని కొమారుడు తిమ్మానాయుడు విద్యానగరమున కరిగి రాయలవారి నాశ్రయించి, తుదకు వారి యనుగ్రహము బడసి, ‘ఘండికోట సీమామూలము’నకు వ్యవహర్తయై, తాడిపత్రికోటలో తమబంధువు ఉప్పుండనాయుని నుంచి, తాను గండికోటకు పోయి, అదివఱకుగల కోటను మఱింత కట్టుదిట్టపఱచి. అచ్చటనే నివసించుచు, పరిపాలనము సాగించుచువచ్చెను. ఈతిమ్మానాయుడే ఇప్పుడు చింతలరాయస్వామి అనబడు చింతల తిరువెంగళనాథస్వామి దేవాలయము కట్టించెను. తిమ్మానాయుడు లోకాంతరగతుడైనపిదప అతని కొమారుడు యరతిమ్మానాయుడు ‘ఘండికోట రాజ్యాధిపత్యము వహించెను. విజయనగరాధీశుడయిన అచ్యుతదేవరాయల యనంతరము విజయనగర సింహాసనమునకై వచ్చిన పోరాటములు ఈతిమ్మానాయుని కాలముననే సంభవించెను.

ఈసందర్భమున మనకైఫీయతు కొన్ని క్రొత్తసంగతులను దెలుపుచున్నది. అవి యేవన;

కృష్ణదేవరాయల అల్లుడయిన అళియరామరాయలు ‘రాజ్యభారంచేస్తూ వుండెను.’ అంతట రామరాయల జ్ఞాతులు అతని

పై ద్వేష మూని తిరుగబాటుచేసిరి. రామరాయ లప్పుడు ప్రభుత్వము నిర్వహింప లేక గండికోట యరతిమ్మానాయనికడకు వచ్చి ఆతని సహాయ మపేక్షించెను. రాయలు గండికోటలో నుండినట్లు ఆతని జ్ఞాతులకు తెలిసిన పిమ్మట వారు సైన్యసమేతులై వచ్చి ఆతనిని పట్టి తమ కొప్పగింపవలసినదని కోరుచు యరతిమ్మానాయనికడకు రాయబారుల నంపిరి. నాయకు డందుల కంగీకరింపక సాళెగాంప్లు మొదలైనవారిని కూర్చుకొని రామరాయలతో వెళ్లి వచ్చినవిరోధిసైన్యమును నెదుర్కొని యుద్ధము చేసెను. కోమలియొద్ద జరిగిన యుద్ధమున శత్రుసైన్యము విరిగిపోయినందున రాయలును, యరతిమ్మానాయడును ఓడిపోయిన సైన్యమును వెంబడించుచు పోయి, తుదకు సామ్రాజ్యరాజధానియైన విజయనగరమున బ్రవేశించి అచ్చటనున్న సలకము తిమ్మన్న మొదలైనవారిని హతము చేసిరి. జ్ఞాతిశత్రుభయము నివారణ మైన దిమొదలు అళియ రామరాయలు "రాజ్యభారంచేస్తూ", ఈయరతిమ్మానాయనికి చాలద్రవ్యమును బహుమానములను ఇచ్చి పంపించెను. యరతిమ్మానాయుడు తాడిపర్తికి వచ్చి శ్రీ చింతలరాయస్వామి ఆలయమున చిత్తరువులు వ్రాయించి, ఆదేవుని అంగరంగవైభవములకు చాల ద్రవ్యము నొసంగెను.

ఈతిమ్మానాయకు చేసినసహాయము, సలకము తిమ్మన్న సైన్యముతో కోమలియొద్ద జరిగినయుద్ధము – ఈమొదలైనవి ఎంతవఱకు సత్యములో నిర్ణయింపవలసియున్నది. అనలు ఈయరతిమ్మానాయకు రామలింగానాయని కొమారు డగునా యని సందేహింపవలసివచ్చుచున్నది: ఏలయన,

రమణ మీ పెదతండ్రి ♦ రామలింగవిభుండు
    ముసురు వజీర్లను ♦ మొక్కపడిచె
మీతండ్రి పెదతిమ్మ ♦ ఘాతలాఢ్యత్వుండు
    దస్తూరిఖానుని ♦ మస్తరించె
మీయన్న బలి చిన్న ♦ నాయకేంద్రుడు మస్త
    ఖానుని బలము ౧ ♦ కొనుపడిచె
ఇది విచారించి నీ ♦ వశ్వరాయనిబల
    మడచవే జమ్ముల ♦ మడుగుబయల
అహహా! నీసుబ్బ వెన్నెంగ ♦ నవనిలోన
దరమె శేషునికైన ము ♦ ప్పూటతురుష్క
మస్తకి న్యస్త చరణ స ♦ మస్త శస్త్ర
సవిధుదసింహ! పెమసాని ♦ నారసింహ!!

(చాటుపద్య మణిమంజరి)

అను చాటువునుబట్టి రామలింగనాయకుని, పెదతిమ్మనాయడును సోదరులనియు, పెదతిమ్మనాయనికి చిన్ననాయకుడు, నారసింహనాయడు అనువారు కొమారు లనియు తెలియుచున్నది. అంతేకాని రామలింగనాయని కొడుకు (యర) తిమ్మానాయడైనట్లు కనబడదు. పైనుడివిన వారిలో నెవరికి యరతిమ్మానాయ డనుపేరే యున్నట్లు కానరాదు. పెదతిమ్మానాయడే యరతిమ్మానాయ డనుకొందమన్నను అతడు దస్తూరిఖానుని కొట్టినట్లు కలదుగాని సలకము తిమ్మని సంహరించినట్లు కానరాదు. ఒకవేళ వీరెవ్వరును సలకము తిమ్మని

యుద్ధకాలమునాటివారు గా రనుకొందము న్న అట్లు కనబడదు: ఏలయన రామలింగనాయడు 'ముగురు వజీర్లను మొక్కపడిచి' నట్లువర్ణింపబడియున్నాడు. హండే అనంతపురము చరిత్రము ననుసరించి సలకము తిమ్మనికి ఈయుద్ధమున బరీదుషా, నిజాముషా, అదిల్ షా, కుతుబుషాలు సహాయులుగ వచ్చినట్లు తెలియుచున్నది. ఎవరో ముఖ్యులు కి లోనివారే 'ముగురు వజీర్లు' అనబడినవారు కావగును. అంతియగాక సలకము తిమ్మని యీయుద్ధములలో అతనికి ప్రత్యర్థియై - రామరాయలకు సహాయుడుగ - యుద్ధముచేసి కీర్తిగన్న గండికోటదుర్గాధిపతి రామలింగనాయడేయని యీక్రిందిచాటువువలన తెలుచున్నది:

జూటూరి ముందర ♦ త్వమేర్పడ
గండభూమిలో ♦ పల్క ♦ రాజు గెల్చి
కోరి తముచెల్ల ♦ కోట ధూళిగ జేసి
చింతిగుం త్రిఘుపతి ♦ పంతమణచి
పెదకంటి కయ్యాన ♦ ఫీకరంబుగ నీవు
పెండియు పల్కని ♦ విరుగదోలి
సాహసుం డైనట్టి ♦ సహాబిఖ్యాఖానుని
నడలించి (?) యాదవ ♦ సంతతిలోన
తిరిమల్ల నైనట్టి పల్కయ ♦ తిమ్మవిభుని
దుర్గించి గాయల బట్టాన ♦ నుంచి తెర
పృథులగెల్పుల సురథాణి ♦ పెమ్మసాని
చన్నవిభు రామలింగ తే ♦ జఃపతంగ!

(చాటుపద్య మణిమంజరి)

ఈ చాటువుల ననుసరించి చూడగా నిజమునకు సలకము తిమ్మనికి ప్రత్యర్థిగ రామరాయలకు సాయముచేసిన గండికోట దుర్గాధిపతి రామలింగనాయుడే యని తెలుచున్నది. అంతియేకాక అత డీపోరాటము సందర్భమున గావించిన జూటూరు, బేతంచెర్ల, పెదకల్లు మొదలైన యుద్ధములను గురించియు తెలియవచ్చుచున్నది; కాని యీసందర్భమున మనకైఫీయతు పేర్కొను కోమలి యుద్ధప్రస్తావమైనను పైనుదహరింపబడిన చాటువులలో లేకపోవుట విచారణీయము. ప్రాయికముగ నీకాలముననే కావచ్చును రామలింగనాయడు "ముగురువజీర్లను మొక్కపడిచి" యుండెను. పూర్వోదాహృతమైన పెమ్మసాని రామలింగనాయని గురించిన చాటువున తెలుపబడిన విషయములు కూడ ఒకవేళ ఈసలకము తిమ్మని యుద్ధముల కాలమునాటివే యైయుండవచ్చును.

మనకైఫీయతు ప్రకారము యరతిమ్మానాయని యనంతరము గండికోటరాజ్యమునకు వచ్చినవాడు నారసింహానాయడు. నారసింహానాయనికిని, అతని పూర్వుడైన యరతిమ్మానాయనికిగలసంబంధమునుమనకైఫీయతు తెలుపుట లేదు. కాని పైచాటువులప్రకారము పెద్దతిమ్మానాయని కొడుకులలో నారసింహానాయ డొకడు. ఇందును బట్టి చూడగా పెద్దతిమ్మానాయనికే యరతిమ్మానాయ డను నామాంతరము కలదేమో యని సందియము కలుగుచున్నది. అట్లయినచో కైఫీయతులో తెలుపబడిన పరస్పరసంబంధము తప్పనియు, యరతిమ్మానాయ డనునామాంతరము గల పెద్దతిమ్మానాయడు

తన సోదరుడైన రామలింగనాయునితోపాటు ఈయుద్ధములలో పాల్గొనియుండు ననియు, ఆకారణముననే చాటుపద్యమున రామలింగ నాయుని కారోపింపబడిన విజయాదికములు మనకైఫీయతున మనము పెదతిమ్మానాయు డనుచున్న యరతిమ్మానాయునికి గూడ ఆరోపితము లయ్యెననియు సమన్వయింపవలసి యుండును. అయినను ఈచారిత్రిక విషయమునందలి సత్యాసత్యములను సరియైన యితరాధారముల ప్రమాణమున ఇంకను తరచి చర్చించి సమన్వయించి నిర్ణయింపవలసి యున్నది.

గండికోటకు యరతిమ్మానాయుని యనంతరము పెమ్మసాని నారసింహనాయుడు అధిపతి యయ్యెనని యిదివరకే తెలుపబడినది. నారసింహనాయుని కొమారుడు చినతిమ్మానాయుడు, ఇతని కొమారుడు నారసింహనాయుడు.

కైఫియతువలన దెలియవచ్చు గండికోటదుర్గాధిపతులు వీరే. వీరు ఏయే విజయనగరాధిపతులకు సామంతులుగ నుండి పరిపాలనము నెఱపిరో, ఒక్కొక్కరు ఎంతెంత కాలము పాలించిరో ఈవిషయములు మనకు కైఫీయతువలన తెలియవచ్చుట లేదు.

గోలకొండ పరిపాలనము,

విజయనగర సామ్రాజ్యము క్రీ. శ. 1565లో రక్షసతంగిడి (తలికోట) యుద్ధమున భగ్నమైన పిదపకూడ తాడిపత్రి ప్రాంతము గండికోట దుర్గాధిపతులక్రిందనే యుండెను: కాని గండికోట పెమ్మసానివారు అనతికాలముననే గోలకొండ కుతుపుషావారి యధికారముక్రిందికి వచ్చి, వారికి కప్పము కట్టుచువచ్చిరి. అప్పుడు గోలకొండలో పరిపాలనము సలుపుచుండిన సుల్తాను అబ్దుల్లా కుతుబుషా [క్రీ. శ. 1626-1672] ఈతడు గండికోటదుర్గమును చాలకాలము పెమ్మసానివారిక్రింద నుండనీయలేదు. క్రీ. శ. 1650 ప్రాంతముల మహమ్మదీయసైన్యము లీప్రాంతముల కేతెంచి యీదేశమును స్వాధీనపఱచుకొనుటచేత మహమ్మదీయులే యీప్రాంతములకు ప్రభువులైరి. చాల కాలము పోరాడినపిదపను, తీవ్రమైన ముట్టడి సాగించిన పిదపను మీరు జుమలా (Mir Jumla) కు గండికోట తుదకు క్రీ. శ. 1652-వ ఆగష్టు 27వ తేదీని స్వాధీనమయ్యెను. అప్పటికిని మీరు జుమలా దీనిని తంత్రముచేతనే సాధించినట్లు 'టావర్నాక్' చెప్పుచున్నాడు. ఈ మీరు జుమలాయే తరతరములనుండి యీదుర్గము నేలుచుండిన పెమ్మసానివారిని కోట వెడలనడిచి దానిని స్వాధీనపఱచుకొని యేలెను. అబ్దుల్లా కుతుబుశాహా పిదప గోలకొండరాజ్యమున కధిపతియైనవాడు అబుల్ హాసన్ కుతుబుశాహా (క్రీ. శ. 1672-1687) ఈతనికే 'తానీషా' యనిపేరు కలదు. ఇతడే మన కైఫీయతులో పేర్కొనబడియున్నాడు. ఈఅబుల్ హాసన్ కుతుబుషా కాలముననే అక్కన్న మాదన్నగార్లు సైన్యాధిపతి, ప్రధానులుగా నుండినప్పుడు వారితట్లునుంచి

ఈ తాడిపత్రి ప్రాంతమును వ్యవహారము చేయుటకు క్రీ. శ. 1680 ప్రాంతముల పొదిలె లింగప్పగారును, గరిడేమిట్ట గమ్మన్నగారును వచ్చిరి. వారికాలమున జరిగిన రాజకీయములైన సంస్కరణములు మన కైఫీయతున వివరింపబడినవి ఈ కుతుబుషాల పరిపాలనకాలముననే సర్వమాన్యము పద్ధతి రద్దయ్యెను. దానికి బదులుగ శ్రోత్రియముపద్ధతి అమలులోనికి వచ్చెను. వీరికాలమున అమలులోనికి వచ్చిన శిస్తువిధానముునకే 'కామిల్ బేరీజు' అనిపేరు. ఈ పద్ధతిని పొదిలె లింగప్పయే ప్రవేశపెట్టెనని కొందరందురు.

మొగలాయి పరిపాలనము.

ఈ ప్రాంతము చాల కాలము గోలకొండ కుతుబుషాల క్రింద నుండలేదు. ఈ గోలకొండ పై కన్నువేసి యుంచియుంచి ఆలంగిరి పాదుశా' (ఔరంగజేబు పాదుషా) తుదకు దానిని క్రీ. శ. 1687లో జయించి అబుల్ హాసన్ కుతుబుషాను చెఱబెట్టెను. గోలకొండ పడిపోయినప్పటినుండి అంతవఱకు ఆ రాజ్యమునకు లోబడియుండిన దేశమంతయు ఆలంగిర్ పాదుషావశమయ్యెను. ఆతనికాలమునకూడ మహమ్మదీయ ప్రభువులే యీ దేశమును బరిపాలించుచుండినను పరిపాలనావిధానమున బిగువుసడలెను. మహారాష్ట్రులతోడియుద్ధములలోనిమగ్నుడైయుండుటచేత 'ఆలంగిరి పాదుశాహా'కు ఈ ప్రాంతముల పరిపాలనమును కట్టుదిట్టపఱుచుట కవకాశము లేకపోయెను. క్రీ. శ. 1707వ సంవత్సరమున 'ఆలంగిరి పాదుశాహా' చనిపోయిన యనంతరము క్రీ. శ. 1708వ సంవత్సర ప్రాంతమున జుల్ ఫికారుఖాన్ అను ప్రసిద్ధుడైన మహమ్మదీయ సైన్యాధిపతి దక్కనుకు సుబేదారు (ఢిల్లీ రాజప్రతినిధి)గ నియమింపబడెను. ఈ ప్రాంతము నంతను జయించిన మహమ్మదీయ సైన్యాధిపతి యీతడే. ఈతడే మన కైఫీయతులో జులుఫికారుఖాను అని పేర్కొనబడి యున్నాడు. ఈతని 'నవాబుగిరి' లోనే తాడిపత్రి దేవాలయములు చాల పాడుచేయబడినవి రంగస్వామిదేవాలయము పడగొట్టబడి, యచ్చట మసీదు కట్టబడినది. మహమ్మదీయు లీకాలమున చింతలరాయస్వామి దేవాలయమున మధ్యరంగమందు తిత్తులువేసి, రాళ్లు ఎగరకాల్పించి ప్రతిమలను భిన్నముచేసి పాడుచేసిరి. ఈ జులుఫికారుఖాన్ కాలమున 'బస్తిబందుఖాన్' ఈ ప్రాంతమునకు వ్యవహర్త. ఇతడు చాల కోటలు కట్టించెను. ఈ కాలమున కర్ణాటకమునకు దావుదుఖాన్ (Daud Khan) నవాబయ్యెను. కృష్ణానదికిని, దక్షిణమున తిరుచునాపల్లి, తంజావూరు మండలములగుండ ప్రవహించు కొల్లడము (Coleroon) నది[ పాయలైనపిదప కావేరి పెద్దశాఖ పేరు] కిని మధ్యనుండు దేశమునకే సాధారణముగ కర్ణాటకమని పేరు. ఆలంగిరిపాదుశాహా గోలకొండ కుతుబుశాహా రాజ్యమును జయింపకపూర్వము ఈ కర్ణాటకమున చాల భాగము గోలకొండరాజ్యములోనిదె. దక్కను సుబాదారుకు లోబడి యీకర్ణాటకమును పాలించుచుండిన మహమ్మదీయ ప్రభువుకు 'నవాబు' అనిపేరు.

ఇతనినే కర్ణాటకపు నవా బనువారు. ఆర్కాటు (Arcot) అతనికి రాజధాని. ఇందువలన ఆతనికి ఆర్కాటు నవా బనియు పేరు.

క్రీ. శ. 1710వ ప్రాంతమువఱకు దావుదుఖాన్ (Daud Khan) కర్ణాటకమును పాలించెను. 'నవాబుగిరి'లో ఈతాడిపర్తి ప్రాంతము నేలినవారు (౧) మెదకు తిమ్మాజి తిమ్మన్నపంతులు [౨] శాయపంతులు (3) జగ్గన్న పంతులుగార్లు. 'పాదుశాహా హుకుమునననుసరించి 'సైనులతో లడాయిచేశే నిమిత్తం హిందూస్థాన్ లేట్టుకు సైన్యములతో' పోయినప్పుడు దావుదుఖాను పరిపాలనాసౌకర్యమునిమిత్తము కర్ణాటకమును అరకాడు (Arcot) సుబా, కడప (Cuddapah) సుబా అని రెండువిభాగములు చేసి, సాదతుల్లాఖాను (Sadatulla Khan) ని అరకాడు నవాబుగను, మయానా అబ్దుల్ నబీఖాను (Mayana Abdul Nabi Khan) ని కడప నవాబుగను నియమించి వెళ్లెను.

తరువాత దక్కనుకు సుబేదారు అయినవాడు చిన్‌కిలిక్ ఖాను. ఈతనికే 'అసఫ్ జా,' అనియు, 'నైజాముల్ ముల్కు' అనియు బిరుదములు కలవు. అరకాడు, కడప నవాబులు ఈతనికి లోబడి కప్పము చెల్లింపవలసిన సామంతులు. ఇతని రాజ్యమునకు పడమట పూనామహారాష్ట్రము రాజ్యమును ఉత్తరమున బేరారుమహారాష్ట్రరాజ్యమును, తూర్పున బంగాళాఖాతమును పరిహద్దులు. 'అసఫ్‌జా' తనయొక్క స్వాతంత్ర్యమునకే ఎక్కువగ ప్రయత్నించుకోవలసి వచ్చుటచేత అరకాడు, కడప సుబాల్లపై అతనికి బిగువైన అధికారబల మేర్పడియుండలేదు. అందువలన ఈకడప, అరకాడు నవాబులు స్వతంత్రులును కాక, అస్వతంత్రులును కాక మధ్యరకముగ నొకవిధమయిన సామంతత్వమును జూపుచువచ్చిరి. నైజాముల్ ముల్కుయొక్క బలాబలములనుబట్టి దీని స్వభావము దిద్దుబాటుగుచువచ్చెను.

కడపనవాబుల పరిపాలనము.

కడపసుబాకు నియమితుడైన మొదటి నవాబు అబ్దుల్ నబీఖాను. ఇతడు క్రీ శ. 1710 మొదలు 1735 వఱకు పరిపాలించెను. ఇతడు చాల సమర్థుడైన నవాబు. ఇతడు ఉత్తరమున గండికోట మొదలు దక్షిణమున గుఱ్ఱంకొండవఱకు గలదేశమును జయించెను. పశ్చిమమున అనంతపురమువఱకు ఈతనిరాజ్యమువ్యాపించినట్లు కాన్పించును ఏలయన హండే ప్రసన్నప్పనాయుడు, హండే సిద్ధప్పనాయుడు,పవాడప్పనాయుడు మొదలైనవారు కడపనవాబులకు కప్పము కట్టుచుండినట్లు చరిత్రలవలన దెలియుచున్నది. ఈకడప నవాబుల కాలమున తాడిపర్తి ప్రాంతమునకు (౧) కెంబా నారోపంతులు [౨] తమ్మాజి గోవిందప్ప (3) సైదు మహమ్మదుఖాను అనువారలు అములుదారులు.

మయానా అబ్దుల్ నబీఖాన్ పిదప

కడపసుబాకు నవాబయినవాడు అతని పెద్ద కొమారుడు అబ్దుల్ మహమ్మదుఖాను. ఇతనికి 'కొన్నిదినములయినమీాదట' దృష్టి తగ్గిపోవుచు వచ్చినందున ప్రజలితనిని 'గుడ్డినవాబు' అని వ్యవహరించుచునచ్చిరి. ఇతడు క్రీ. శ. 1736 మొదలు 1747 వఱకు పండ్రెండు సంవత్సరములు రాజ్యము చేసెను. మన కైఫీయతు ఈతనిని పేర్కొనుట లేదు: కాని మరహాటి (మహారాష్ట్ర) సిద్ధోజివారు చౌథాయినిమిత్తము గుత్తి, గండికోట రాజ్యములకు వచ్చి యీదేశము సంతను సంక్షోభపెఱచి, చౌథాయిసూకలు (Chowth) కొనిపోయి' రనిమాత్రము చెప్పుచున్నది. ఇది యీఅబ్దుల్ మహమ్మదుఖాౕ కాలముననే అనగా క్రీ. శ. 1740లో జరిగెను. దండుతో వచ్చిన మహారాష్ట్రనాయకుడు 'సిద్ధోజి' యని మన కైఫీయతు తెలుపుచున్నది కాని అది తప్పని తోచును. వచ్చిన మహారాష్ట్ర నాయకుడు రఘోజీ భోసలా కాని సిద్ధోజి కాడని నాయూహ [అయినను ఈవిషయము నా'కడప నవాబుల చరిత్రము'న విపులముగ చర్చింపబడును గాన ఇందు విషయమై అందు చూడనగును.]

తరువాత మన కైఫీయతు పేర్కొను కడప నవాబు మజీదుమియ్యా. ఈతని అసలు పేరు అబ్దుల్ మజీదుఖాౕ (Abdul Mahazid Khan) ఇతడు క్రీ. శ. 1753 మొదలు 1757 వఱకు కడపసుబా పాలించెను. ఈతని కాలమున బలవంతరాయణివారి నాయకత్వమున మఱల 'మరహాటి' (మహారాష్ట్ర) సైన్యము తాడిపర్తి ప్రాంతములకు దాడివెడలివచ్చినట్లును, మజీదుమియ్యాతో యుద్ధముచేసి, యాతని రణనిహతునింగావించి, గుఱ్ఱంకొండరాజ్యమును స్వాధీనపరచుకొనినట్లును మన కైఫీయతు చెప్పుచున్నది. ఈ 'మరహాటి' దండయాత్ర క్రీ. శ. 1757 లో జరిగినట్లును, అప్పుడు అబ్దుల్ అలమ్ ఖాౕ కడప నవాబుగ నుండినట్లును, గుఱ్ఱంకొండ రాజ్యమును మహారాష్ట్రులకిచ్చి సంధి చేసికొని, కడపనవాబు వారిని పంపివేసినట్లును కొన్ని చరిత్రలు తెలుపుచున్నవి. ఈ విషయము లేవి యెంతవఱకు సత్యములో ముందు నిర్ణయింపవలసియున్నది. మజీదుమియ్యా పిదపకూడ తాడిపర్తిప్రాంతము కడప నవాబులక్రిందనే యుండెను.

మన కైఫీయతునుబట్టి తెలియవచ్చు తరువాతి కడపనవాబు గనీమియ్యా. ఇతని అసలుపేరు అబ్దుల్ గనీఖాౕ (Abdul Ganey Khan)ఇతడు అసలు కడపనవాబుకాడు. కడపనవాబుల బంధువు. ఇతడు కడపకు మొదటి నవాబయిన అబ్దుల్ నబీఖాను మనుమడు: అబ్దుల మియ్యా అనుపేరుగల అబ్దుల్ కాదరుఖాను కొమారుడు ఈగనీమియ్యా క్రీ. శ. 1756-1757 వఱకు పరిపాలించెను.

మహారాష్ట్ర పరిపాలనము.

క్రీ. శ. 1746-వ ప్రాంతమున గుత్తి కోటను వశముచేసికొని పరిపాలించుచుండిన మహారాష్ట్ర నాయకుడు మురారిరావు

[కైఫీయతులోని మురారాయుడు]తాడిపర్తి మొదలైన తాలూకాలు కడపనవాబు గనీమియ్యాను జయించి తీసికొనెను. నాటినుండి తాడిపర్తి మహారాష్ట్రప్రభు పరిపాలనముక్రిందికి వచ్చెను. శాలివాహనశకము 1678 (క్రీ. శ. 1756-1757)లో యీతాడిపర్తి మురారిరావు స్వాధీనములోనికి వచ్చినట్లును, ఇరువది సంవత్సరములవఱకు మురారిరావు తట్టునుంచియే యీప్రాంతమును పరిపాలింప అమలుదార్లు వచ్చుచుండినట్లును కైఫీయతువలన మనకు తెలియగలదు. ఈవిధమున తాడిపర్తి ప్రాంతము క్రీ. శ. 1756-1757 మొదలుకొని 1776-1777 వఱకు మహారాష్ట్రప్రభువుల యధీనముననే యుండెను. మురారిరాయని ప్రభుత్వమున అతని దివాను సర్దేశాయి నరసింగరాయణివారు చింతలరాయస్వామి దేవాలయమున కొన్ని మరమ్మతులు చేయించిరి. యీకాలమున యీప్రాంతము నేలిన అమలుదారులు (౧) రామాజీ పంతులు (౨) రంగో గోవిందరాయుడు.

రంగో గోవిందు యీతాలూకా అమలుచేయుచున్నప్పుడు అనంతపురం బసప్పనాయడు 'మంది'తోగూడ తాడిపర్తికి వచ్చి 'దరోబస్తు' దోచుకొని రయితుల నందఱిని పట్టుకొని దండుగలు తీసికొని పొయ్యేటప్పుడు యిక్కడ అమలుచేసే రంగో గోవిందుగారిని పట్టుకొనిపోయి దండుగ వొప్పించుకొని విడిచెను." ఈదోపిడి క్రీ శ. 1770-న ప్రాంతమున జరిగెను. యీవృత్తాంతము హాండే అనంతపురము స్థానికచరిత్రములలో నిట్లు వర్ణితమైయున్నది.

" యీ బసప్పనాయు అనంతపురానకు ౧౨ కోసులమీద వున్న తాడిపర్తి పేట బహుబస్తి అయివున్నది. ఆగ్రామం అమీలు రంగో గోవిందరాయనివారు వశ్యకంచేసి మురారిరాయునివారికి వడ్డికి యిచ్చేటందున అతనికి తాడిపర్తికి వుద్యోగం వచ్చినది. అని బహుమందిచేత విని, ఆగ్రామం దోచుకోవలెనని రెండు యేండ్లు మనస్సున వుంచి సమయం చూచి, మాఘ బ ౧౦లు రథోత్సవమైన మరునాడు 'మంది'తోకూడా వచ్చిన పోయి, ఆ గ్రామానకు నాలుగు దిక్కుల నాకీ పహరా పెట్టి పేట దోచమని కొంత ఫౌజును యిచ్చి సేనాధిపతిని పేటలోకి పంపించెను; మరికొంతమందితో కోట చుట్టుకొని, నిచ్చెనలగుండా దిగి, రంగో గోవిందుగారి యింటి నాలుగు దిక్కుల కావలి పెట్టి ఆయింటిదగ్గర స్థలం తహశీలుదార్లు పదిమంది వుండగా, వారిని పట్టి భద్రంచేసి, యిలుచొచ్చి ఆరంగు గోవిందునున్ను, అతని చిన్నాచినుతలనున్ను, బావమరిది చౌడప్పనాయకుణ్ణిన్ని పట్టుకొని, కావలిలో వుంచి యిల్లు శోధించి, వెండి, బంగారు, కొంతనగదు, మంచి మంచి కొన్ని బట్టాపాతలు, చెంబుతపేల, సేద్యం యెద్దులుసహా తమ వశంచేసుకొనిరి. ఆగ్రామంలో మూడు దినములు నిలిచి, వర్తకులు బ్రాహ్మణులు, నేసేవాండ్లు మొదలయిన వారివారికి తగినప్రకారం రూకలు నియమించి రాబట్టుకొని, గ్రామంలో ప్రస్తుతమందు చిక్కిన సదరు వెండి, బంగారు, పశువులు, గొర్రెసహా తోలించుకుని అనంతపురానికి వచ్చేసమయమందు తాడిపర్తికి చుట్టూవున్న గ్రామాలవాండ్లు గుత్త మురారిరాయనికి కాగిదపత్రాలు వ్రాయించి పంపించిరి.

" అవి ఆమురారిరాయనివారు చూచుకొని చెన్నంపల్లెదగ్గర కోట కట్టిస్తూవున్న పాలేఖానుణ్ణి పిలిపించి, అతనితో యీ యాపద్వర్తమానం తెలియచేసి, 'నీవు కొంతఫౌజును తీసుకొని మార్గానకు అడ్డంతగిలి,

బసవప్పనాయనిపౌజును విరుగగొట్టి, ఆరంగుగోవిందు మొదలైన జనాలను విడిపించుకరమ్మని సెలవు యిచ్చినందున, అతేప్రకారం ఆ పాలేఖానుడు సైన్యసమేతుడై, యెక్కలూరి మార్గాన వచ్చి విచారించగా బసవప్పగారు తాడిపత్రి పేట అంతా కొల్లపెట్టుకొని, వెంకటపల్లె కనకుగుండా నడిమిదొడ్డిమార్గాన పోయి, యీ దినం మధ్యాహ్నం అనంతపురం చేరెను అనే వర్తమానం విని, వెనక్కు తిరిగి తనపౌజుతో కూడా గుత్తి చేరెను. ఆబసవప్పగారు రంగు గోవిందును అనంతపురానకు తీసుకవచ్చి, కావలిపెట్టి, నాయడి పన్నెండు వేల వరహాలు దండగ తీసుకొని, అతనికి వస్త్రిపాత్రాదులు బహుమతియిచ్చి పంపించెను."

ఈ పైవృత్తాంతము తాడిపర్తికి సంబంధించిన దగుటచేత ఇచ్చట పొందుపఱుపబడినది.

దేశీయప్రభువులు: విదేశీయులు.

దక్కనుదేశమున సామ్రాజ్యమును నెలకొల్పుటకై మహారాష్ట్రులొకవంక, నిజామువారింకొకవంక ప్రబలప్రయత్నములు చేయుచు, దేశమును నిరంతరయుద్ధములలో ముంచివేయుచుండిరి. ఈకాలమున హిందూదేశమున వర్తకముచేయవచ్చిన యూరోపియను జాతులలో పరాసువారును (French) కుంపిణీ ఇంగ్లీషువారును (East India Company) ప్రధానులుగ నుండిరి. వారుభయులును తమతమ వర్తకవ్యాపారమును, వర్తకస్థలములను, గిడ్డంగులను గాపాడుకొనుటకు కొంత 'శిబ్బంది'ని పోషించుచువచ్చిరి. ఈ యురోపియను సైనికులు యుద్ధమునకు సంబంధించిన 'కవాతు'లో సుశిక్షితులైన నేర్పరులు వీరు చిన్నతుపాకులను, మందుగుండుసామగ్రిని యుద్ధములం దుపయోగించువారు. పదాతిసైన్యముమీదను, అశ్వసైన్యముమీదను, కురికాండ్ర (Archers- విలుకాండ్రు) మీదను, కొంతవఱకు ఏనుగుబలము మీదను ఆధారపడి యుద్ధములుచేయుచుండిన దేశీయులకు తుపాకులును, మందుగుండుసామగ్రియు, వింతమాట యటుండ విశేషము భీతిగొలుపజొచ్చెను. ఇవన్నియు నటుండ పరాసువారుకాని, కుంపిణీవారుకాని సంఘములుగ నేర్పడి వర్తకముచేయుచుండినను సంఘములోనివారుగ గాక విడిగకూడ సొంతముగ వ్యాపారము నడపుచు పెద్దపెద్ద ప్రభువులకుగూడ ఎంతధనము కావలసిన అంత ధనమును అప్పీయగలిగినంతటి సంపన్నులుగ కూడ నుండిరి. అసూయాద్వేషములచే లాలింపబడుచు నిరంతరకలహములలోను, భయంకరయుద్ధములలోను మునిగి తేలుచుండిన చిన్న పాళెగాండ్రు మొదలు పెద్ద ప్రభువుంగవులవఱకు తమకక్షలు తీర్చుకొనుటకై పరాసువారి సైననేమి, కుంపిణీవారి సైననేమి ఈయూరోపియనుల సాయమును (ఋణముగ) ధనముకొఱకో, తుపాకులు, మందు గుండు సామగ్రికొఱకో, లేక సుశిక్షితులైన ఆయూరోపియను సైనికులకొఱకో అపేక్షించుచుండువారు. సరిగా ఈస్థితిని, సమయమును గుర్తించి వారుకూడ హిందూదేశమున రాజ్యసంపాదనము చేయవలెనని సంకల్పించిరి. దేశీయప్రభువుల దౌర్బల్యమును గుర్తించి పరాసువారును, కుంపిణీవారును కలహించుచుండ ఉభయపక్షములలో ఉభయు

లును అర్థితులై ఏపక్షమో యొకపక్ష మవలంబించి, తుదకు తాముచేసిన సాయమునకు ప్రతిఫలముగ విస్తారము ధనమునో లేక దేశవిభాగమునో సంపాదించుచుండువారు. ఒకప్రభు వొకరిసాయమును గైకొనిన రెండవప్రభువు రెండవవారి సాయమును గైకొనక యున్నచో నింక తన రాజ్యము శూన్యము: బ్రతుకు సున్న యనుకొనుంతటి స్థితి సంభవించెను. తుద కిట్టిదైన్యస్థితి చిన్నచిన్న పాళెగాడ్రకును ప్రభువులకునే గాక పెద్దపెద్ద నవాబులకును, నైజాములకునుగూడ పట్టెను. అందువలన ఈసమయమును, పరిస్థితులను లాభకరముగ దీసికొని పరాసువారును, కుంపిణీ [బ్రిటీషు]వారునుకూడ రాజ్యసంస్థాపనోద్యమదీక్షాకంకణబద్ధులై నిరంతరము కృషిసలుపదొడంగిరి. వీరి రాజ్యసంపాదన ప్రయత్నములను వారును, వారి రాజ్యసంపాదన ప్రయత్నములను వీరును విఫలముచేయ ఎత్తులమీద ఎత్తులను వేయుచు, తంత్రములమీద తంత్రములను బన్నుచు, ఉభయులును పెనగొన్న పూనికతో, వెనుదీయని వీరావేశముతో పెనగులాడజొచ్చిరి. సాయమునుమాత్రమే అపేక్షించి పిలిచిన దేశీయప్రభులకు వీరి అంతరంగిక హృదయము తెలియరాదయ్యెను. ఈవిధమున ఈవిదేశీయులు రాజ్యసంస్థాపన ప్రయత్నమును హృదయమున పదిలపఱచి, దేశీయప్రభువులకు తమ హృదయము వెల్లడి కానీయక, వారిని పాచికలనుగ జేసి, కపట ద్యూత మాడుచు, రాజకీయరంగమును తమ తంత్రప్రతితంత్రములచేత కల్లోలపఱచి, రొంపియు రొచ్చును గావించివైచిరి. ఆర్కాటు 'నవాబుగిరి' హైదరాబాదు 'నైజాముగిరు'ల సందర్భమున పరాసువారును, కుంపిణీవారును తమ తమ నవాబులను నిలబెట్టి ఆడిన యద్భుతనాటకములే ఈకాలపు మనదేశచరిత్ర. ఇది మనదేశచరిత్రమేయైనను ఇందు మనదేశీయప్రభువులు అప్రధానులు: ప్రధానులు పరాసువారును [ఇంగిలీషు] కుంపిణీవారును. అందువలన ఈకాలపు దక్కనుదేశచరిత్రము దక్కనుదేశమున పరాసువారియొక్కయు, కుంపిణీవారియొక్కయు రాజ్యసంపాదనచరిత్రమేకాని వేరుకాదు. దేశీయప్రభువు ఈ విదేశీయులయిన యూరోపియనుల మందు, గుండు సామగ్రికిని, తుపాకులకును సమ్మోహితులై, తోడి దేశీయప్రభువుతోడి విరోధమున ఉన్మత్తులై, యూరోపియనుతంత్రములకు ఏనాడు వశ్యులై లోగిపోయెనో నాటితోనే భారతీయనాటకమున కరుణరసప్రధానమును, విషాదాంతమునగు నూతనాంకము ఆరంభమగుచున్నది. దేశమునందలి నాటిరాజకీయస్థితికి ఆకాలపు తాడిపత్రిచరిత్రమే ప్రమాణము.

మైసూరు దొరల పరిపాలనము.

రాజకీయరంగ మంతయు చాల కలకబాఱి, కలియద్రొక్కబడుచుండిన యీకాలముననే 'నవాబుబహాదరు' (హైదరల్లీ సుల్తాన్) ప్రవేశించి దేశస్థితిని మఱింత దుర్భరము కావించెను. ఈవరకు రంగమున నున్నవారికితోడు ఈతడుకూడ గొప్పరాజ్యమును నిర్మించుటకై సర్వశక్తులను ధారపోసి ప్రయ

త్నించెను. ఇంత చిన్నివిధముల ప్రయత్నించుచుండిన యాకాలమున దోపిడులు, దండయాత్రలు, యుద్ధములు, గ్రామదహనములు– ఇవే నాటి రాజకీయనాయకుల దైనికకృత్యములు. ఈ ప్రచండజంఝా మారుతమున క్రీ. శ. 1775లో నవాబుబహాదరు గుత్తిదుర్గమును జయించి స్వాధీనపఱచుకొనుటచేత, అంతవఱకు గుత్తి మహారాష్ట్రరాజ్యమున చేరియున్న తాడిపత్రి మైసూరు శ్రీరంగపట్టణము నవాబైన హైదరల్లి పరిపాలనముక్రిందికి వచ్చెను.

నవాబుబహాదరు కడపలో రాజ్యము చేయుచుండిన మయానా అబ్దుల్ అలీంఖానునితోను, అతని కొమారులతోను యుద్ధము చేసి, సిద్ధవటమును సాధించి అలీంఖానుని శ్రీరంగపట్టణమునకు ఖైదీగ తీసుకొనిపోయెను. ఈవిధమున ఇప్పటి రాయలసీమలో చాలభాగము మైసూరుదొరల పరిపాలనము క్రిందికి వచ్చెను.

క్రీ. శ. 1782లో హైదరాలీ[నవాబు బహాదరు] చనిపోయినపిదప అతని కుమారుడు టీపుసుల్తాను రాజ్యభారము వహించెను. ఈటీపుసుల్తానును సాధించుటకై మహారాష్ట్రులును, నైజామువారును, కుంపిణీవారును ఒడంబడికలు చేసికొని ఎత్తులు పన్నుచుండిరి. మైసూరుయుద్ధముల కాల మిదే. ఈకాలమున, అనగా క్రీ. శ. 1785లో 'మరహాటి' వారి తాలూకు అశ్వసైన్యము వచ్చి తాడిపత్రి గ్రామమును "దరోబస్తు" దోచుకొనెను. మజిల కొంతకాలమునకు రెండవతడవ 'మరహాటి' సైన్యము వచ్చి వెల్లలూరు ప్రాంతమును దోచుకొని, దేశీయులను హింసలపాలుచేయుచు, గ్రామములను పాడుచేయుచుండ టీపుసుల్తాను శ్రీరంగపట్టణము (రాజధాని) నుంచివచ్చి, ఆదవేనిమీద 'మోహిం'చేసి, సాధించి, దోచి, ఠాణా వేసికొని, 'మరహాటీ' సైన్యమును పశ్చిమమునకు తఱుమగొట్టి, తిరిగిపోవు సందర్భమున రాయదుర్గమును సాధించి, తద్దుర్గాధిపతులను శ్రీరంగపట్టణమునకు ఖైదీలుగా బంపి, గుత్తిసుబాకు 'కుతుపద్దీను ఖాను'ను నవాబుగ నియమించెను.

ఇట్లుండ బనగానపల్లెనవాబు 'అసరల్లీ ఖాను' కొంత సైన్యముతో వచ్చి, బనగానపల్లెలో ఠాణా వేసికొని, చుట్టుప్రక్కలనున్న పాళెగాండ్రను కూర్చుకొని దేశమును ధ్వంసముచేయుచుండ ఈసమాచారమును విని 'కుతుపద్దీనుఖాను' సైన్యసమేతుడై కదలివచ్చి, అవుకుగ్రామమునొద్ద దిగెను. (ఇరువురు నవాబులకు అచ్చటయుద్ధముజరిగెను.) ఆయుద్ధమున 'కుతుపద్దీనుఖాను' సైన్యము విరిగిపోయి గుత్తిచేరెను.

హైదరాబాదు నిజాంపరిపాలనము.

క్రీ. శ. 1789, 1790 సంవత్సరములలో టీపుసుల్తానుమీది శత్రుత్వమున, అతని రాజ్యమును పాడుచేయుటకై 'నిజామల్లీ ఖాను'ని సైన్యము వచ్చి పానుగంటియొద్ద దిగెను. 'నిజామల్లిఖాను'సరదార్లుపాళెగాండ్రను

కూర్చుకొని నలువదివేల గుఱ్ఱములతో వచ్చి, గండికోటకు ముట్టడివేసి, దానిని సాధించి, పిదప తాడిపర్తి ప్రాంతమును స్వాధీనపఱుచుకొనిరి. మూనముదినములు ముట్టడి సాగించి పోరాడినమీదగాని యీతాడిపర్తి కోట వారికి వశపడలేదు. పిదప 'హిస్సాఖియ్యా, తాడిపర్తికి అధిపతియయ్యెను.

మఱిమూఁడుసంవత్సరములకు అనగా క్రీ. శ. 1792లో నిజాంవారును, మహారాష్ట్రలును, కుంపిణీవారును టీపుసుల్తానుపై నెత్తివెళ్లి యాతనిని సాధించిరి. 1792వ సంవత్సరపు ఒడంబడికప్రకారము టీపుసుల్తాను తన రాజ్యములోని అర్ధభాగమును 'మిత్రమండలి'కి ఇచ్చివేసెను. టీపుసుల్తానునుండి తీసికొన్న దేశమును సమముగా ముగ్గురును పంచుకోవలెనను ఒడంబడిక యుండుటచేత టీపుసుల్తాను ఇచ్చినదేశమును నిజామును, కుంపిణీవారును, మహారాష్ట్రులును పంచుకొనిరి. తాడిపర్తిప్రాంతము నిజామునకు వచ్చుటచేత అది గుత్తిరాజ్యమునుండి విడదీయబడి గోలకొండరాజ్యమున జేర్చబడెను. అందువలన క్రీ.శ. 1793 నుండి పదిసంవత్సరముల పర్యంతము అనగా క్రీ.శ. 1800లవఱకు ఈతాడిపర్తి ప్రాంతమును పాలించుటకై అమలుదారులు గోలకొండ [హైదరాబాదు] నుండియే వచ్చుచుండిరి. ఈకాలమున ఈదేశమును పాలించిన అమలుదారులు (౧) దిలావరుద్దౌలా (౨) అమానుసాహేబు (3) గులాముల్లీఖా [౪] చందూలాలు.

కుంపిణీ పరిపాలనము.

మఱల క్రీ. శ. 1799లో మిత్రమండలివారు (మహారాష్ట్రులు, కుంపిణీవారు, నైజాము) మైసూరు టీపుసుల్తానుమీద యుద్ధమును ప్రకటించి, అతని రాజధానియైన శ్రీరంగపట్టణమును ముట్టడించిరి. ఆముట్టడిలో టీపుసుల్తాను వీరశయనము నలంకరించెను. అంతటితో ఇప్పటి రాయలసీమయంతయు పూర్తిగ నైజాము వశమయ్యెను; కాని తనరాజ్యమునకు శత్రుభయములేకుండ కాపాడిపెట్టుటకై తనరాజ్యమున గొంతసైన్యమును నిలిపియుంచు పద్ధతిమీద 1792,1799 సంవత్సరముల యొడంబడికలప్రకారము టీపుసుల్తానునుండి తాను పడసిన [యిప్పటిరాయలసీమ] మండలములనన్నిటిని నైజాము క్రీ శ. 1800లలో ఇంగిలీషువారికి (కుంపిణీ) ఇచ్చుటకు సమ్మతించెను. ఈవిధమున హైదరాబాదు నిజామువారు ఇప్పటిరాయలసీమ సంతను 'కుంపిణీ' వారికి 'దత్తము' జేయుటచేత క్రీ. శ. 1800లలో ఈతాడిపర్తికూడ 'కుంపిణీ'వారి వశమయ్యెను.

క్రీ. శ. 1800లలోనే ఈప్రాంతమంతయు 'కుంపిణీ' వారికి వశమైనను కట్టుబాటులేకయుండిన పాళెగాండ్లను సాధించి, దేశమునొకపంథకు తీసికొనివచ్చుటకు వారి కొకటి రెండేండ్లు పట్టెను. 'కుంపిణీ'రాజ్యమున యీసీమకంతకు మన్రో దొరవారు మొదటి ప్రిన్సిపల్ కలెక్టరు 'గనియమితులైరి. ఈదొరయే కైఫీయతులలో 'మనరోలు', 'ముండ్రోలు'

సాహేబు అని పేర్కొనబడియున్నాడు.

ఈరీతిని తాడిపర్తి 'కుంపిణీ'వారి వశమై, క్రమముగా బ్రిటీషువారి పరిపాలనము క్రిందికి వచ్చెను. ఇంతటితో [చరిత్రకు సంబంధించినంతవఱకు] మన కైఫీయతు ముగియుచున్నది.

ముగింపు.

ఇదివఱలో చెప్పినట్లు 'కుంపిణీ'వారి పరిపాలన కాలమునకు వచ్చు కొలది కైఫీయతు పెక్కుచిన్న సంగతులనుగూడ చాల వివరముగ దెలుపుచుండుటచేత ఇది ఆధునికచారిత్రమునకు అత్యంతోపయోగ మనుటకు సందియము లేదు. ఇతరాధారములతోపాటు ఈకైఫీయతులనుగూడ పరిశీలించి చూచిననేకాని మన దేశముయొక్కయు, మన గ్రామములయొక్కయు, సంపూర్ణచారిత్రము వెలువడ నేరదు. ఈతాడిపర్తి కైఫీయతును తమ 'దేశబంధు ఉగాదిసంచిక'లో ప్రకటించి చరిత్రి కుపకృతి యొనరించుచున్నందుకు 'దేశబంధు ముద్రణాలయమువారు' చరిత్రాభిమానుల అభినందనములకు పాత్రులు.

ప్రకటన పద్ధతి.

ఇక కైఫీయతునుగుఱించి రెండుమాటలు చెప్పవలసియున్నది. దీనిని తమ 'ఉగాదిసంచిక' లో ప్రకటింతుమని 'దేశబంధు ముద్రణాలయము'వారు వ్రాసినంతనే 'స్థానికచారిత్రముల'నుండి దీనిని తిరుగ వ్రాసితిని. అట్లు వ్రాయుటలో ఆకాలపు వర్ణక్రమము వ్రాతపద్ధతి తెలియుటకై ఉన్నదాని నున్నయట్లు మార్పు లేవియు చేయకయే వ్రాసితిని. మూలమున 'పేరాలు', 'సెమికోలను' మొదలగు విశ్రామచిహ్నములు ఏమియు లేవు. పాఠకుల సౌకర్యార్థము ఈవృత్తాంతమును కొన్ని 'పేరాలు'గ నేనే విభజించి, వాటికి 'విజయనగర పరిపాలనము' మొదలుగాగల ఉపశీర్షికల నుంచితిని. ఇవి యేవియు మూలమున లేవు. క్రమమైనపద్ధతిని పరిష్కరించి, సంపాదకీయోపోద్ఘాతముతో ప్రకటింపవలెనన్న ఒక్కొక్క కైఫీయతు ఒక్కొక్క పెద్దపుస్తక మగును. అట్టి సందర్భమున ఈప్రాంతముల పూర్వము పరిపాలించిన జూపల్లివారు, జిల్లేళ్లవారు, రావెళ్ళవారు, పోలేపల్లివారు, మట్లివారు, నందేలవారు, పెమ్మసానివారు-ఈ మొదలుగాగలవారికి సంబంధించిన చాటుపద్యములను, గ్రామచారిత్రమునకు సంబంధించినంతవఱకు శాసన, వాఙ్మయాది చరిత్రాధారములను పరిశీలించి, చర్చించి విమర్శించి, పరస్పరవిరుద్ధాంశములను సమన్వయపఱచి, సత్యము తేల్చి, సత్యేతిహాసమును బయలుపఱుపవలసియుండును. ఇందుకు చాటుపద్యములు, గాథలు, తామ్రశాసనములు, తాటాకు గ్రంథములు - ఈ మొదలైనవాటిని గ్రామములందు తిరిగి సంపాదింపవలసియుండును. ఇది యెంతయు వ్యయప్రయాససాధ్యము. పైనుడివినరీతిని రాయలసీమకు సంబంధించిన కైఫీయతులన్నియు పుస్తకములరూపమున పరిష్కృతములై ప్రక

టింపబడుచో ఆంధ్రదేశచారిత్రమునకు అమూల్యమైన యుపకారము కలుగగలదు. కాని అట్టిపనికి ద్రవ్యమెక్కడ? ప్రయత్నమెక్కడ? అందులకు పూనుకొను పుణ్యాత్ములెక్కడ? చరిత్రాభిమానులు తలయొకరు తలయొక కైఫీయతును ముద్రించి ప్రకటించుటకు పూనుకొన్నను చరిత్రకు చాల మేలు కలుగగలదు. ఎక్కడికక్కడికే ఎన్ని అచ్చుపడిన అంతే లాభము.

వందనములు.

నిరాశానిబిడీకృతమైన యీప్రతికూల వాతావరణమున 'దేశబంధు ముద్రణాలయమువారు' ఈ కైఫీయతును ఈరూపముననైన ప్రకటించుచున్నందుకు వారికి నాహృదయపూర్వకవందనముల నర్పించుచున్నాను.

(మల్లంపల్లి సోమశేఖరశర్మ.)



# తాడిపత్రి కైఫీయతు

కలియుగమందు యీపినాకినీతీర భాస్కరక్షేత్రమందు దక్షిణభాగాన తాటివనము విస్తారంగా వుండినందున అరణ్యమై వుండగా యీఅరణ్యములో వొకకిరాతుడు వాసముచేసుకొని తాడిగుడిశెలు వేసుకొని యీ అరణ్యములో వున్నమృగాల సంహారముచేసుకొంటూ వుండినందున యీ పల్లెకు తాళ్లపల్లె అనిపేరు నిర్మాణము అయినది.

విజయనగర పరిపాలనము.

యీ ప్రకారంగా కొంతకాలము జరిగినమీదట శ్రీవిద్యారణ్యస్వాములవారు పంపాతీరమందు తపస్సుచేసి తపస్సిద్ధి అయి తమపేర వకపట్నం నిర్మాణముచేయవలెనని యోచనచేసి పట్నం నిర్మాణము చేసినది.

శ్లో॥ నాగేన్ద్రాక్షే మితేశకయుగే
శాలివాహస్య జాతే।
ధాతుర్వర్షే సుగుణచరితే
మాసివైశాఖనామ్ని।
శుక్లపక్షే సూర్యవాదస్సులగ్నే
సప్తమ్యాం।
శ్రీవిజయనగరే నిర్మితే
నిర్మితేన్ద్రాః।

యీశ్లోకార్థప్రకారం శాలివాహన శకవరుషంబులు ౧౨౫౮ అగు నేటి ధాతునామసంవత్సర వైశాఖ శుద్ధ ౭ ఆదిత్యవారము సుముహూర్తము నిష్కర్షచేసి కనకవరుషంబు కురిపించి స్తంభప్రతిష్ఠచేసి నగరము సాంగంగా కట్టించి ఆనగరానకు విద్యానగరము అనేపేరు నిర్మాణముచేసి తామే సింహాసనారూఢులయి ప్రభుత్వం చేస్తూవున్నకాలమందు వొకబ్రాహ్మణుడయిన నారాయణభట్లు దరిద్రుడై దేశసంచారార్థం కుటుంబసమేతంగా తూర్పుసీమనుంచి వొచ్చి యీస్థలమందు పినాకినీతీరం బహుశస్యంగా వున్నదని మనసా యోచనచేసుకొని యిక్కడినుంచి పోయి శ్రీవిద్యానగరరాజధాని అయిన శ్రీవిద్యారణ్యస్వాములవారి తావుకు పోయి వారితో మనవిచేసుకొన్న వివరము స్వామి నేను దరిద్రుణ్ణి. నాకు కుటుంబరక్షణకు ఆధారం లేదు దేశసంచారం కుటుంబసమేతంగా వొచ్చినానని మనవిచేస్కున్నందున శ్రీవిద్యారణ్యస్వాములవారు బ్రాహ్మణునికి కొంతద్రవ్యం యిచ్చి ప్రాగ్దేశమందు పినాకినీతీర భాస్కరక్షేత్రమందు వకపల్లె వున్నది ఆపల్లెలో కిరాతకులు వాసంచేసుకొని వున్నారు నీవు ఆస్థలమందు చేరి అక్కడ వకదేవాలయము న్ను కట్టించి నీకుటుంబసమేతంగా వకయిల్లు కట్టుకొని వుండగా ముందర ఆగ్రామం విస్తారం అవుతూవున్నది అని ఆజ్ఞయిచ్చి పంపించినందున ఆబ్రాహ్మడు యీ తాళ్లపల్లె స్థలానకు వచ్చి యిక్కడ వాసంగావున్న కిరాతకుల పిలిచి యీనదీతీరమందు వకదేవాలయం కట్టించి ఆదినారాయణమూర్తి అనేవిష్ణుప్రతిమెను ప్రతిష్ఠచేసి యీదేవాలయానకు దక్షిణభాగమందు నాల్గుబారలమీద ఆంజనేయస్వామికి వకశిలామంటపం కట్టించి ఆంజనేయుల ప్రతిష్ఠచేసిన తదారభ్య కిరాతకులు యీయనకు వశవర్తులయి అబ్రాహ్మడిమీద శానా విశ్వాసంగా నడుచుకుంటూ వుండినందున తాటిచెట్లు కొట్టించి భూమి కొంత చదరం చేయించి దేవాలయము అంచున నాల్గు బ్రాహ్మణులకు యిండ్లు కట్టించి దేవునికి పూజ నైవేద్యము బ్రాహ్మలు చేస్తూ కొన్ని దినములు జరిగినపిమ్మట బోయవాండ్లుసహా కట్టుకున్నపల్లెకు తాళ్లపల్లె అనేపేరు నిర్మాణము అయివుండెను.

సంగ వంశము.

మరికొంతకాలానకు చంద్రవంశకులయిన హరిహర బుక్కరాయులవారిమీద చాలాకృపచేసి విద్యానగరపంపాసన అధికారము యిచ్చి రత్నసింహాసనారూఢుల చేసి పూర్వం దక్షిణ పశ్చిమ వుత్తరం యీనాల్గుదిక్కులలోను పేరుప్రఖ్యాతం అయి బహువిస్తారం శీమకు ప్రభుత్వం చేస్తూ యేనూరు సంవత్సరాల పర్యంతరం మీరు మీవంశంవారు రాజ్యభా

రం చేస్తూ వుండవలసినదని స్వాములవారు యీరాయలవారిమీద దయచేసి పట్నము స్వాధీనముచేసిరి. యీప్రకారం కొన్నిదినములు జరిగినమీదట విద్యారణ్యస్వాములవారు సిద్ధిబొందిరి. తదార్థ్యము విద్యానగరం అనేపేరున్ను రాజధాని అయిన రాయలవారికి మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప హరిహర బుక్కరాయలు ప్రౌఢదేవ మహారాయలు అని బిరుదావళులు ప్రఖ్యాతంగా రాజ్యభారం చేస్తూవుండగా ఆకాలమందు యీతాళ్లపల్లెలో వున్న నారాయణభట్లువారు అగ్నిష్టోమముచేసి సోమయాజులు అయి శ్రీవిద్యానగరం రాయలువారి తావుకు పోయి క్రమకు విద్యారణ్యస్వాములవారు దయచేసిన వర్తమానము సవిస్తారము మనవిచేసినందున రాయలవారు యీబ్రాహ్మడిమీద చాలా దయచేసి యీతాళ్లపల్లె అగ్రహారముగాను సెలవుయిచ్చి పంపించినందున అనుభవిస్తూ వుండిరి, ఆకాలమందు అగస్త్యగోత్రులయిన పెద్దిభట్లువారు వలయాచలపర్వతానకు వారణభాగమందు మూడుకోసులమీద వున్న మాముడూరు అనేగ్రామమందు వాసముచేసుకొని వుండిరి యీపెద్దిభట్లువారికి నల్గురు కొమాళ్లు కలిగి వుండగా బహుకుటుంబులు అయివుండగా ప్రథమపుత్రులు మాముడూరిలోను నిలిచిరి చిక్కిన ముగ్గురు పురుషులు వొచ్చి నిట్టూరు అనేగ్రామములోను వొకపురుషుడునిలిచెను కొదువ యిద్దరు పురుషులు యీభాస్కరక్షేత్రం పినాకినీతీరమందు తాళ్లపల్లెలో చేరివుండగా యీపల్లెకు అగ్రహారీకుడు అయిన నారాయణసోమయాజులవారు యీఅగస్త్యగోత్రులయిన యిద్దరు పురుషుల అయిన దేవరయవాబరసయ్యగారిని నిలుపుకొని యీఅగ్రహారానకు పాగుబడి చేసుకొని పత్రము వ్రాసుకొని వుండేలాగున నిష్కర్షచేసి గ్రాసోపాయానకు కొంతభూస్వాస్థ్యం యిచ్చినందున కాలక్షేపము చేసుకొనివుండిరి.

బుక్కరాయులు. తదనంతరము విద్యానగరపట్నమునందు బుక్కరాయులవారు ప్రుథివి సాంబ్రాజ్యము చేస్తూవున్న కాలమందు యీసీమామూలం వ్యవహారం విచారించేనిమిత్యం జిల్లేళ్ల చలపతిరాజుగార్ని పంపించినందున యీతాళ్లపల్లెకు తూర్పు యెనిమిది కోసులమీద చిత్రావతి పినాకినీ సంగము అయినందున ఆజాగాకు గండి అనేపేరు కలిగివుండగా తూర్పుకొండమీద జాగా బహువిస్తారంగాను దొనలు మొదలయినవి వుండి కొంచెపాటిగ్రామమున్ను వుండినందున యీచలపతిరాజుగారు యీగండి అనే జాగా చూచి బహురమ్యంగాను వున్నదిఅని విస్తారం చేయించేనిమిత్యం కోటకట్టించి స్థలంచేసుకొని యీసీమామూలం వ్యవహారంచేస్తూ వున్నప్పుడు యీతాళ్లపల్లె గ్రామానకు వుత్తరభాగమందు వకకోసుమీద వున్నగ్రామమందు జిల్లేళ్ల రమణరాజు వకదేవాలయము కట్టించి కేశవస్వామి అనేవిష్ణువిగ్రహం ప్రతిష్ఠచేసినారు యీకేశవస్వామి దేవాలయానకు దక్షిణముగాయిసకైబానలమీద జిల్లేళ్ల బాలరాజుగారు అక్కడ వకబుగ్గ ఖులాయించి తీయించి విస్తారముచేసి ఆబుగ్గనుంచి తూర్పు వకకోసుమీద కాల్వ విస్తారంగాను తొవ్వించి యీకాల్వక్రింద వొరమాగాణి విస్తారంగా చేయించినందున యీకాల్వకు బాలరాజుకాల్వ అనేపేరు కలిగెను. ఆకాలమందు యీతాళ్లపల్లె అగ్రహారములోను వున్న దేవరయ్య వాబరసయ్యగారు శ్రీవిజయనగరపట్నానకు పోయి అక్కడ ప్రధానిపట్నం చేస్తూవున్న దిక్కపడియలువారి దర్శనము చేసుకొని రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప హరిహరదేవరాయలవారితో యీతాళ్లపల్లె వర్తమానము యావత్తు మనవిచేసి యీతాళ్లపల్లె గ్రామానకు కరణీక మిరాశి మొకరరుచేసుకొని వొచ్చిన వివరము వందవరీకులయిన దేవరయ బాబరసయగారికి రెండుభాగాలు అనువేల వోబులయగారికి వకభాగం యీప్రకారం మూడుభాగాలు యేర్పరుచుకొని ముగ్గురున్నుకూడా యీతాళ్లపల్లె గ్రామానకు పెద్దిమిరాశి గుత్తిరెడ్డి పెద్దతిప్పారెడ్డి ౧ కదిరినుంచి వచ్చిన వారికిలప్పాడు అనేవాడు ౧ యీయిద్దరిని నిష్కర్షచేసి యీగ్రామానకు దక్షిణభాగమందువున్న భూమి దున్నించి సాగుబడి విస్తారంగా చేయిస్తూ వున్నకాలమందు యీసీమామూలం రాజ్యభారం చేస్తువున్న జిల్లేళ్ల చలపతిరాజువారు వ్యవహారంచేస్తూవుండగా జిల్లేళ్లవారిని పెనుగొండరాజ్యానకు పం

పించి విద్యానగరం రాయలవారు యీరాజ్యానకు నందేల వీరరాఘవరాజుగారికి గుత్తి గండికోటరాజ్యాలు వ్యవహారం యిచ్చి పంపించినందున ఆరాఘవరాజుగారు యీదేశములోకి వచ్చి యిక్కడవున్న తాళ్లపల్లె అనేగ్రామం విస్తారముగా పెంపుచేసి యీపినాకినీనదికి దక్షిణము వొడ్డున రంగస్వామి దేవాలయము కట్టించి ఆదేవునికి పూజానైవేద్యాలుకు సరకారునుంచి నడిపిస్తూ వుండిరి యీదేవునికి పూజనిమిత్తమై వొకబ్రాహ్మణ్ని ద్రావిళ్లను నేమకముచేసినారు ఆబ్రాహ్మణుడు ద్రావిడాచార ప్రకారం పూజచేస్తూవుండగా యీకాలమందు గుత్తిలో వున్న యర్రిమరాజుగారు ఈతాళ్లపల్లెకు తూర్పు కోసున్నరమీద యర్రిమలకొండలో వున్న కోనలో బుగ్గ వుత్పత్తిఅయి ప్రవాహం పారుతూ బహురమ్యంగా వున్నస్థళమందు వొకదేవాలయము కట్టించి శ్రీరంగస్వామిని ప్రతిష్ఠచేయించినారు ఈప్రకారం కొంతకాలము జరిగినమీదట,

ప్రౌఢ దేవరాయులు.

విద్యానగరపట్నమందు ప్రౌఢదేవరాయలవారు రాజ్యభారం చేస్తూవున్న కాలమందు ఈ రాజ్యానకు పెమ్మసాని తిమ్మానాయణ్ని మొకరరుచేసి పంపించినందున ఆ తిమ్మానాయడు ఈ దేశంలోకివచ్చి గుత్తి గండికోట మొదలుచేసుకొని రాజ్యం విచారించుకుంటూ ఈ తాళ్లపల్లెకు ఆరుకోసుల మీద వాయవ్యభాగమందు వున్న యాడకి అనేగ్రామమందు జాగ చేసుకుని ప్రభుత్వంచేస్తూవుండగా కొన్నిదినములు జరిగినమీదట్ను యాడకిలోనే కాలము అయను. ఈయన కొమారుడు రామలింగానాయడు రాయలవారి శెలవుప్రకారము వ్యవహారంచేస్తూ ఈ తాళ్లపల్లె అనేగ్రామము నందేలవీరరాఘవరాజుగారు కొంత బస్తీచేసి రంగస్వామి దేవాలయమున్ను కట్టివుండగా ఆదేవాలయము మొదలుచేసుకుని తూర్పు యింకా గ్రామము విస్తారంగా కట్టించి బస్తీచేసి తాడిపత్రి అనేపేరు పెట్టి ఈ గ్రామానకు ఆగ్నేయభాగమందు వకకోట కట్టించి ఆకోటలో నివాసం చేసుకొని వుండినకాలమందు తనపేరు శాశ్వతముగాను వుండేటట్టుగా ఈ తాడిపత్రికి నైరుతిభాగమందు నాలుగు కోసులమీద రామలింగానాయనిపల్లె అనేగ్రామము కట్టించినాడు తదనంతరం పరశురాములవారిచేత ప్రతిష్ఠితమయిన శ్రీరామేశ్వరలింగము అంతర్ధానంగావుండి రామలింగానాయణివారు ప్రభుత్వముచేస్తూ వుండగా ఈ నాయనివారి ఆవులు ఈ పినాకినీనదీతీరమందు నీలాద్రి పర్వతం చుట్టూ బహుఅరణ్యముగా వృక్షాలు పెరిగి నల్లగుండ్లువగైరా విస్తారంగా వుండగా ఈ అరణ్యములో నాయణివారు ఆవులుమేపుకొని యిందుకు దక్షిణము యీపైబారలమీద ఆవులుకు వొకదొడ్డి నిర్మాణము చేసుకుని నిత్యమున్ను ఈ నీలాద్రిగుట్టను ఆవులు మేశి నదిలో వుదకము త్రాగి దొడ్డిచేరేలాగున వకగొల్లవాణ్ని నిమ్ముకరుప చేసివుండగా ఆఆవులు పైకి వకఆవు నిత్యమున్ను నీలాద్రిగుట్టను పోయి పూర్వమందు పరశురాములవారు ప్రతిష్ఠచేసిన లింగము చుట్టూ పుట్టపెరిగి వుండగా ఆపుట్టతావుకు ఈ ఆవుపోయి నిల్వబడితే పుట్టలోనుంచి యీశ్వరుడు ఈ ఆవుపాలు పానముచేస్తూ వుండును. ఈ మర్యాదను నిత్యమున్ను జరుగుతూవున్న కాలమందు ఆవులుకాచే గొల్లవాడు. ఈ ఆవు తమకు పాలు ఇయ్యని అంశము తెలిసి ఆవును కనుపెట్టికొని కొన్నాదినములు జరిగినపిమ్మట ఆకాలమందు ఈ ఆవు రామేశ్వరుడు వున్నపుట్టకు నాలుగుతట్లా కాళ్లు పెట్టుకొని వుండగా ఆసమయమందు క్షీరపానము చేస్తువున్న యీశ్వరుణ్ని చూచి తనచేతిగొడ్డలిని విసిరివేసినందున తగిలీతగలనట్టుగా పుట్టలోకి జొరబడి పోయెను ఆవు యీవలికి వచ్చెను. ఆరాత్రి రామలింగానాయణి స్వప్నమందు శ్రీరామేశ్వరుడు వొచ్చి నేను బహుకాలాననుంచి యీనీలాద్రి గుట్టను పుట్టలో వుండి యీ ఆవుపాలు పానముచేసుకొని వుండగా మీగొల్లవాడు ఈ దినము చూచి గొడ్డలితో వేశినాడు ఈ పుట్టలోనుంచి నన్ను తీయించి దేవాలయము కట్టించి ప్రతిష్ఠచేయించమని నిజరూపము చూపినందున మరుసనాడు వుదయాన సకలపురజనులతో పోయి ఆపుట్ట ఖులాయించి తీయించి చూచినందున రామేశ్వరలింగం విస్తారంగా కనబడినందున విద్యానగరము రాయలవారికి యీవర్తమానము వ్రాయించి పం

పించి రాయలవారి ఆజ్ఞప్రకారం సరకారుద్రవ్యం ఖర్చుచే
యించి లింగనాచారి మొదలయిన కాశివాండ్లకు పనియిచ్చి
యీపినాకినికి జగతికట్ట కట్టించి యిందుకు పశ్చిమం మూ
డుకోసులమీద వజ్రగిరి నరసింహస్వామికొండ రాళ్లుకొన్ని
యీ తాడిపత్రికి యీశాన్యభాగమందు పదికోసులమీద
తలమంచిపట్నం రాళ్లు కొన్ని తీసుకొని వొచ్చేదానికి కను
మ వుత్తరభాగమందు మూడుకోసులమీద యర్రమలకొం
డను మార్గము యేర్పరిచి బండ్లమీదను తెచ్చినారు. గ
నుక యీకనుమకు బండ్లకనుమ అని పేరు కలిగినది. ఈ ప్ర
కారం రెండుస్థలాలయందు రాళ్లు మలిపించి తెప్పించి
దేవాలయము యేర్పర్చి నూతనంగా కట్టించినారు పశ్చిమ
ము వుత్తరము గోపురాలు దక్షిణ మహాద్వారము గోపుర
మున్ను కట్టించి యీదేవాలయానకు పూర్వభాగమందు
పరశురాములవారు నివాసముచేసుకొనివున్న జాగాన రా
మపాదము వున్నచోట దేవాలయము కట్టించి ఆదేవాలయ
ములోను రామప్రతిమెను ప్రతిష్టచేశినారు యిందుకు దక్షి
ణము మామిడివనము వేయించినారు యీదేవునికి పూజా
నైవేద్యాలున్ను సరకారుతట్టునుంచి ద్రవ్యమియిచ్చి పూజ
నైవేద్యాలు చేసేదానికి శివబ్రాహ్మణులను నిష్కరుష చేసి
పరిచారకత్వానకు తంబళవాండ్లను ఆయగుకేనివుంచి యీప
రిచారకులు చేశేపని వివరం దేవునికి పూజదండలు కట్టేది
వుత్సవవిగ్రహాలుకు అలంకారము చేసేది వుత్సవం చేయిం
చేది దేవాలయం చక్కగా సమ్మార్జనము చేసేది అఖం
డాలు కనిపెట్టుకొని వుండేది శివలింగానికి శివబ్రాహ్మలు
అభిషేకం చేశేది నైవేద్యము చేశేది నిర్మాల్యము అయి
నప్రసాదము తంబళవాండ్లకు యిచ్చేది యీప్రకారం తం
బళ్లవాండ్లు గ్రామములోను యిండ్లు కట్టుకొని వుందురు
శివబ్రాహ్మలు దేవాలయముదగ్గర యిండ్లు కట్టుకొనివుంద్రు
రు యీప్రకారము జరుగుతూ వుండగా గ్రామపురో
హితులు నిధనపాటి వెంకటసోమయాజులు అనే బ్రాహ్మ
డు నిత్యమున్ను నదిలో స్నానము చేసుకొని భాస్కరు
ణ్నిగూర్చి సహస్రనమస్కారములు చేసుకొని యీరామే
శ్వరునికి నిత్యమున్ను మహాన్యాసపూర్వకంగాను ఏకాద
శరుద్రాభిషేకము చేస్తువుండగా ఆబ్రాహ్మడు బహుతప
స్సుగావున్న వర్తమానము యీనాయనివారు విని ఆ
బ్రాహ్మణ్ని పిలుపించి యీదేవాలయానకు యజమాను
ణ్నిగా చేసి నిత్యవుత్సవకాలమందు మంత్రపుష్పం సమర్పిం
చివుండమని నేమకము చేశినారు. యిదిగాక మాఘబహుళ
౭ ౹౹ ధ్వజారోహణము చేసి యీబహుళ ౩౦ రథోత్సవము
చేసి పారువేటవుత్సవము తీర్థవిధితో నవదినపాలువుత్స
వము చేయించి రథోత్సవం నిమిత్యం యేమి ఖర్చు అయి
నా సరకారునుంచి చేస్తువుందురు ఈప్రకారము జరుగుతూ
వున్న కాలమందు యీ గ్రామమునుంచి వొంబులేశ్వరుని ద
ర్శనంనిమిత్యము గర్భిణిమనిషి యీయర్రమలకొండ యె
క్కలేక కష్టపడుతూ వున్నందున దర్శనము యిచ్చేనిమి
త్తము అహోబలేశ్వరుణ్ని నేను వొచ్చి యీయర్రమల
కొండలో నివాసంగా వున్నాను. నాకు యీయర్రమలకొం
డమీద మధ్యభాగమందు వకబుగ్గ వున్నది అస్థలమందు దే
వాలయము కట్టించి ఆబుగ్గకు కోనేరు కట్టించమని యీ
రామలింగానాయనివారి స్వప్నమందు చెప్పినందున అదేప్ర
కారము యీనాయనివారు సకలపరిజనములతో పోయి
యీయర్రమలకొండలో మధ్యభాగమందు బుగ్గకు కోనే
రు కట్టించేదానికి ప్రయత్నము చేశినందున ఆకోనేటిలో
వొంబలేశ్వరుడు కనబడెను తరువాత అస్థలమందు దేవాల
యము కట్టించి వొంబలేశ్వరుణ్ని ప్రతిష్టచేశినారు. గనుక
యీకొండమున్ను యీదేవునికిన్ని వొంబులదేవరకనుమ అనే
పేరు తదారభ్యము కలిగెను యీప్రభుత్వములోనే నాయ
నివారి కోమార్తె రాజగోపాళమ్మ నాయ
నివారి పేరు పెట్టి యీ తాడిపత్రికి నైరు
తిభాగమందు రెండుకోసులమీద వకపల్లె కట్టించి ఆపల్లెపే
రు రామలింగానాయనిపల్లె అని పేరుపెట్టి వకదేవాలయం
కట్టించి విష్ణుప్రతిమెకు గోపాలస్వామి అనేపేరునిష్కరు
ష చేశినారు యీదేవునికి పూజా నైవేద్యాలుకు రేగడిచే
ను యెనిమిదికూములచేను యిచ్చినది పూజచేశేదానికి వక
నంబివాణ్ని నిష్కరుష చేసినారు యీతాడిపత్రిగ్రామానుకు
యేటికాల్వ రామలింగానాయుడు ఖాసా సరకారుద్రవ్యము
ఖర్చుచేశి పశ్చిమాన వకకోసుమీద పినాకినిలో గోరకాల్వ
యేర్పరచి తూర్పు గడ్డకాల్వ తొవ్వించి యీకాల్వ గ్రామా
నుకు వుత్తరభాగాన వెళ్ళి నడవొద్దున చక్కగా వొచ్చి
తోట్సభూమికి పారి విస్తారంగా వొరిమాగాణి రాగితోటలు

న్గైరా సాగుబడి విస్తారంగా చేయించినారు. యీ ప్రకారము కొంత కాలము జరిగినమీదటను ఈయన కొమార్తె గోవిందమ్మ అనేఆయమ్మ ఈగ్రామానికి తూర్పు కోసుమీద వకపల్లె కట్టించి ఈపల్లెకు దక్షిణము వొకకుంట కట్టించి ఈ పల్లెలో ఆంజనేయస్వామి దేవాలయము నిర్మాణము చేసి కుంట వద్ద నే వక చలువేందుల పెట్టించి ఘండికోటకు వొచ్చేపొయ్యే మార్గము గనుక ఈ మార్గములోను నీళ్లుతక్కువ గాకుండా వకబ్రాహ్మణున్ని వుంచివుండెను. యీ గ్రామమువ్యవహారము విచారించుకొని చలువేంద్రులమీదను పరామరిక తీసుకుంటూ వుండేదానికి పట్రికేతయ అనేవాణ్ని వుంచివున్నందున యీపల్లెకు పట్రికేతపల్లె అనే నామధేయము కలిగెను. ఈ ప్రకారం కొన్నిదినములు జరిగినమీదటను రామలింగనాయుడు కాలముఅయెను. యీయన కొమారుడు తిమ్మానాయుడు పెద్దవాడుఅయి విద్యానగరము రాయలవారి తావుకు పోయి కొన్నిదినములు సముఖాన ఆశ్రయించుకవుండినందున రాయలవారు దయచేసి ఘండికోట సీమామూలం జాగీరు యిచ్చి పంపించినందున తిమ్మానాయుడు దేశములోకివచ్చి యీస్థలమందు తమసంబంధులు అయిన వుద్దండినాయణివారిని వుంచి తాము ఘండికోట చేరి అక్కడ కోట బలంగా కట్టించి ఠాణా కాయంగారి చేయించి ఆస్థలములోనే వుండెను. యీస్థలమందు వున్న వుద్దండినాయణివారు పెన్నబడిమాగాణి విచారిస్తువుండగాను గ్రామప్రతిగ్రామాలు యంతు తమఖాసాగతికమతాలు చేయిస్తువుండెను ఈ తాడిపత్రిగ్రామములోను వక కాల్వ త్రవ్వించినది ఈ గ్రామానికి పశ్చిమము కోసున్నరమీదను చిన్నపొలము మడవంకను తిల్లిపేరయేర్పరచి తిమ్మానాయణికాల్వ అని పేరుపెట్టి గడ్డకాల్వ త్రవ్వించి యీ కాల్వను నీళ్లువిస్తారంగా వొచ్చేలాగున చేసి గ్రామానకు మూడ్పు ఆరకోసు పరియంతరము అచ్చుకట్టు వేయించి వారిమాగాణి విస్తారంగా చేయించినారు.

యీ ప్రకారము జరుగుతూ వున్న సమయమందు శ్రీ విజయ నగరము రాజధాని అయిన కృష్ణరాయలవారి కాలము చేసిరి. యిందుకు పద్యము.

తుళువవంశము కృష్ణదేవరాయలు.

ఆనయ శాలివాహనశకాబ్దము
లద్రిగజాగ్ని సోములకు
తారణవత్సరంబున నిదాఘ
దినంబున జ్యేష్ఠశుక్ల ష
ష్ఠీగవివాసరంబున నృసింహుని
కృష్ణుడు శేషనారయా
ద్వారకయందు కృష్ణుడవతార
సమాప్తియు గాంచునై వడిన్ |

శాలివాహన శకవరుషంబులు ౧౩౮౭ .........
యిక్కడవున్న తిమ్మానాయనివారు తొల్కు యేనుగుల చన్నానాయుడు యీగ్రామానికి రెండుకోసులమీద గాండ్లపాడు అనే గ్రామం కట్టించి బక్క చన్నానాయణికై దారమంటపము కట్టించి ప్రతిష్ఠచేసినారు యీ తాడిపత్రిగ్రామములోను యేటిఅవతల వాల్గు కపిలెభావులు తొవ్వించి వారిమాగాణి చేసినారు ఈ తాడిపత్రికి కోసుమీద ఆగ్నేయభాగమందు వకపల్లెకట్టించి ఆపల్లెలో కమ్మవాండ్లను చల్లావాండ్లను అనేవారిని వ్యవసాయమునిమిత్యము మొకగరు చేసినందున చల్లావారిపల్లె అనేపేరు కలిగెను ఈ కాలమందు మిక్కిలినేని నలచన్నానాయుడు కోసుమీద ఆగ్నేయభాగముందు వకపల్లె కట్టించివుండగా ఆపల్లెకు తూర్పునాయణవారి తోడబుట్టినది కొనమ్మ అనే ఆయమ్మ వకచెర్వు కట్టించి వున్నందున ఆచెర్వులో నీళ్లు ఈ పల్లెకు అనుకొని వున్నందున జంబు విస్తారంగా పెరిగి వుండినందున జంబులపాడు అనే నామధేయం కలిగెను. ఈ తాడిపత్రికి పశ్చిమాన మూడుకోసులమీద వజ్రగిరి కొండమీద వక దేవాలయం కట్టించి నృసింహస్వామిని ప్రతిష్ఠచేయించి నిలిపినారు. గనుక వజ్రగిరి నరసింహుని కొండ అని తదారభ్యము జనపాఠము వున్నది. యిదిగా

కను యీతిమ్మనాయనివారు తమపేరు శాశ్వతంగా వుండవలెనుఅని యీతాడిపత్రి గ్రామానకు పశ్చిమము మూడు కోసులమీద వకచెరువు కట్టించి అస్థలమందే వకగ్రామము నిర్మాణము చేసినారు యీచెరువులో నీళ్లు నిలవనందున ఈచెరువుకున్ను ఈగ్రామమునకున్ను వోదుతిమ్మనాయనిచెర్వు అని పేరుకలిగెను.

తదనంతరం ఈ తిమ్మనాయనివారి ప్రభుత్వం చేస్తువున్న కాలమందు శాలివాహన శకవరుషంబులు ౧౪౨౯ అగునేటి ప్రభవనామ సంవత్సర మాఘ బ౧౪ సోమవారము శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర నరసింహరాయలు విజయనగరమందు పృథ్వీరాజ్యము చేస్తువుండగా తత్పాద పద్మారాధకుండయిన శ్రీమన్మహాప్రతాప సాళువ తిమ్మయ్యగారు పెండ్లిసుంఖాలకుగాను వేయించిన ధర్మశాసనము శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర నరసింహరాయలవారు మాకు నాయంకరమై చెల్లే జగతాపి గుత్తిరాజ్యములోనున్న అందుకు చెల్లే పెన్నబడి సీమలోనున్న పూర్వాద్యక్క పెండ్లిండ్లకున్ను పెండ్లిసుంఖాలు కొనంగాను అవీరనరసింహరాయ మహారాయలకు పుణ్యముగాను మేము పుర్వానను గుత్తిసీమను పెన్నబడిసీమను పెండ్లిండ్లకయినను పెండ్లిసుంఖాలు శివరాత్రి పుణ్యకాలమందు సర్వమాన్యంగాను విడిస్తిమి గాన ఈ ధర్మానకు యెవరు వక్రమై యెవరుతప్పకున్నా వారణాశిలో ఫలపిత్రవధ అని వేయించిన శిలాశాసనము వకటి యిదిగాకను దేవునికి అంగరంగవైభవాలకు గాను యిచ్చినది శిలాశాసనము వకటి శాలివాహన శకవరుషంబులు ౧౪౩౧ అగునేటి శుక్లనామ సంవత్సర వైశాఖ శు౧౫ శుక్రవారము వీరనరసింహ మహారాయలవారి ప్రభుత్వములోను యిదే సాళ్వ తిమ్మయ్యగారు యిచ్చినది కందలపాడు సర్వమాన్యంగాను యిచ్చినాము అని శిలాశాసనము వకటి పృథుము సాళ్వ తిమ్మయ్యగారు వేయించిన శిలాశాసనాలు రెండు రామేశ్వరస్వామి దేవాలయములోను వుత్తరభాగమున జంబిచెట్టుకింద వున్నవి యిదిగాకను సాళ్వ గోవిందయ్యగారు వేయించిన శిలాశాసనము ౧ గడితిమ్మపురము గ్రామము పొలములోను శాసనరంభము పొలం ౫౧ అక్షరాలా పుట్టుడు భూమి అమృతపల్లెకుగాను శ్రీరామేశ్వర దేవునికి యిచ్చినది శాలివాహన శకవరుషంబులు ౧౪౩౫ యీశాసనం పైనవ్రాసినప్రకారం జంబిచెట్టువద్దనే వున్నది. ఈ ప్రకారం తిమ్మనాయుడు ప్రభుత్వంచేస్తు గండికోటలో వుండగా ఈ స్థలమందు వుద్దండనాయణ్నివారు వున్నకాలమందు యీగ్రామానకు ఆగ్నేయభాగమందు వరచింతవనంలోగా వొకచింతవృక్షం పటపట పగిలి వృక్షములోనుండే విష్ణుశిల ఉద్భవించి స్వయము వ్యక్తముగా కనుపడినందున అక్కడ వున్నజనములు కొందరు చూచి ఆశ్చర్యపడియుక్కడ అధికారంచేసే వుద్దండనాయణివారికి యరుకపరచినందున అవుద్దండనాయణివారు చూచేనిమిత్యము సకలపురజనములతో పోయి చూచేవేళను చెట్టు రెండుపోవులుగా చీలి అతొర్రలలో స్వయంవ్యక్తమయిన శిలను చూచి యిదియేమిఆశ్చర్యమని విచారణ చాయగా పెద్దలు చెప్పేమాట యీవర్తమానం గండికోటలోవున్న తిమ్మనాయణివారికి వ్రాయించి పంపించమని చెప్పిరి అదేలాగున వ్రాయించి పంపించగా అతిమ్మనాయణివారు ఈ స్థలానకు వొచ్చి చూచేవేళను అనేకధ్వని వుత్పన్నమై చింతమాను నడిమికి చీలి రెండుభాగాలుగా యేర్పడినందున మాని మొదట శిల నిలిచివుండెను అది ప్రత్యక్షంగాను తిమ్మనాయణివారు చూచి యీశిలవర్తమానం చక్కగా విచారణ చేసి మాకు తెలియచెప్పమని శలవుయిచ్చి నగిరికి పోయినపిమ్మటను ఆరాత్రి తిమ్మనాయణివారి స్వప్నమందు దేవుడు సాదృశ్యంగాను చెప్పినది చింతమానులో వుద్భవించిన చింతల తిరువెంగళనాథస్వామి అని తమకు దేవాలయము కట్టించి కొల్వమని సాక్షాత్కారంగాను చెప్పినందున మనుసనాకు వుదయాన లేచి ఈ వర్తమానం సకలపురజనులు విశేలాగున తెలియజెప్పి తమవాత శ్రీవిద్యానగరం రాయలవారికి వ్రాసి పంపించి దేవాలయం కట్టించేటందుకు శలవు తెప్పించుకొని దేవాలయానకు పనియిచ్చి శిల్పశాస్త్రప్రకారం గర్భగృహ సుకనాసిక మహాదిలె మన్యరంగ అస్థానమంటప మాధోంతరాళ గోపుర ప్రాకార స్థూపికా పచనాలయ యాగశాల కల్యాణమం

టప ఆళ్వారాదిమంటప శయనాలయ గరుడమంటప హనుమన్మంటప వరాహమంటప వాహనమంటప మొదలైన మంటపాలతో శ్రీభాగవత రామాయణ అష్టదిక్పాలకాది చిత్రప్రతిమ విశేషముతో దేవాలయం కట్టించి దేవునికి పూజా నైవేద్యాలకు సరకాయదిద్రవ్యం యిచ్చి అర్చకత్వానకు ఘండా (టా) తిరుమలయగారిని రామాయణం రామాచార్యులు పురోహితులు శింగుగోత్రులవార్ని నిర్ధారణచేసి ఆచార్యపురుషత్వానకు కుమ్మమూరి పెద్దియాచార్యులవారి వంశ్యపుత్రులైన పెద్దతిరుమలాచార్యులవారి కున్నము తాడిపత్రి తిరువెంగళాచార్యులను నేమకంచేసి దేవుని పురాణంమీద గొల్ల వోబుళదాసరిని నిష్కర్షచేసి దేవుని భూషణాలు వగైరాసామాను పురాణం దాఖలాచేసి కావలసిన వస్తుభూషణాలు ఈ గొల్ల వోబుళదాసరి మార్కిత్తు యిస్తు పున్నురు యీలాగున నిష్కర్షచేసి పరిచారకులు వగైరావారికి సరకాయిదారు భూస్వాస్థ్యం సంబళం నిష్కర్షచేసి యిస్తున్నా నిత్యోత్సవ మాదిగా సకలోత్సవాలు చేయిస్తు రథోత్సవం వైశాఖ శు॥ ౭ ఆరంభం ధ్వజారోహణం చేయించి ఈ శు॥ ౧౫లు రథోత్సవం చేసి పారువ్యాట తీర్థవిధితోకూడా నవదినసాలు వుత్సవం చేయిస్తు కార్తీక శు ౧౫లు దేవాలయాన్కు వుత్తరభాగమందు వకకోనేరు కట్టించి ఆకోనేటిలో తెప్ప తిరునాల వుత్సవంచేయిస్తూవుండెను ఆకాలమందు వ్యాసరాయలవారు సేతుయాత్ర పోతూ ఈమార్గాన వచ్చి ఈ పినాకినీస్థలమందు దిగి ఈ భాస్కరక్షేత్రమందు మహాప్రసిద్ధమయిన స్థలమని తెలిసి ఈ పినాకినీకి వుత్తరపు వొడ్డున గర్భగృహం యేర్పరచి ఆంజనేయుల విగ్రహాన్ని ప్రతిష్ఠచేయించి స్వామికి పూజకు మాధ్వుల అర్చకత్వానకు నిష్కర్షచేసినారు.

ఈ ప్రకారం నానాదినములు జరిగినమీదట తిమ్మనాయడు కాలంఅయను తరువాత ఈయన కొమారుడయిన తిమ్మనాయడు ప్రభుత్వముచేస్తు వున్న కాలమందు

సదాశివరాయలు

అళియరామరాయలు.

కృష్ణరాయలవారి అల్లుడు అయిన అళియరామరాజుగారు రాజ్యభారం చేస్తువుండగా పూర్వము రాయలవారి జ్ఞాతులు రామరాజులవారిమీద ద్వేషించి రాజసింహాసనం నీకు అక్కరలేదు అని బహుళా వుపద్రవం చాయవలెను అని ప్రయత్నం చేస్తూవుండగా ఈ రామరాజులవారికి ప్రభుత్వము చేశేదానికి నిర్వాహకం లేక విజయనగరపట్నం విడిచి ఘండికోట యేలే తిమ్మనాయణివారి ఆసరాకు వచ్చి చేరినందున ఈతిమ్మనాయణివారు చాలా భరవసా యిచ్చి నిలుపుకొని వుండినకాలమందు ఈవర్తమానము విజయనగరములో వున్న రాయలవారి జ్ఞాతులు విని విస్తారము సైన్యముతోకూడా వొచ్చి ఈ ఘండికోటలో వున్న తిమ్మనాయణి తావుకు పెద్దమనుష్యులను పంపించి రామరాజును తమకు పట్టియియ్యమని అడిగినందున యీతిమ్మనాయడు చెప్పినది మా ఆసరాకు వొచ్చినవార్ని మేము పట్టియిచ్చేది లేదు. మీతోయుద్ధము చేశేము అని చుట్టూవున్న పాళెగాండ్లువగైరా మందిని కూర్చుకొని సైన్యం స్తోమంచేసుకొని యీ అళియరామరాజుల వారితోకూడ యీగ్రామాన్కు మూడుకోసులమీద పశ్చిమాన యుద్ధముచేసి కోమలివద్ద వారిసైన్య విరిగిపోయినందున వెంబడించి రామరాజువారు తిమ్మనాయణివారున్ను విజయనగరపట్నానకు పోయి అక్కడవున్న సకలము తిమ్మన్న వగైరావార్ని హతంచేసి శత్రుభయం లేకుండా అయినందున తదారభ్యము రామరాజులవారు రాజ్యభారం చేస్తు యీతిమ్మనాయణివారికి అనేకద్రవ్యము యిచ్చి బహుమానంచేసి శలవుయిచ్చి పంపించినందున తిమ్మనాయడు యీతాడిపత్రి స్థలమందు శ్రీచింతలరాయస్వామి ఆలయములోను చిత్రరువులు వ్రాయించి దేవునికి అంగరంగవైభవాలకు విస్తారంగాను ద్రవ్యము యిచ్చి నడిపిస్తూవుండెను యీకాలమందు శ్రీరామేశ్వరస్వామికి శ్రీనాథరాజ రామరాజు కొమారుడు శింగరయ్యగారు యిచ్చిన వెలిపొలము కొలపాటిచేను యీగ్రామం పొలంలోను పినాకినికి వుత్తరభాగమందు కాడారంభముచేను. ఖర నాలుగుపుట్లుచేను దద్యాన్న అవసరానకు సర్వమాన్యంగాను యిచ్చిన శిలాశాసనం శాలివాహన శకవరుషంబులు ౧౪౫౩ అగునేటి ఖరనామ సంవత్సర చైత్రి శు౧౫లు వేయించిన శిలాశాసనము రామేశ్వరుణికి సర్వమాన్యంగాను యిచ్చినది. యిం

రంలో తాడిపత్రి కర్నూలు కామరాజు గామన్న వరద ప్పపోతరాజు యల్లమరాజు వీరుముగ్గురున్ను కేతరెడ్డి పెద్ద నాగిరెడ్డి అనేవానికి దానపత్రం రెడ్డిమిరాశికి వ్రాశియిచ్చినారు అదే ప్రకారం వున్నది. యీ యనకొమారుడు చిన్నతిమ్మానాయణివారు ప్రభుత్వం చేస్తూవున్న కాలమందు శ్రీ చింతల తిరువెంగళనాథస్వామికి యిచ్చినది తాడిపత్రి గ్రామాన్కు కడపకొల్లు తెరువుదిక్కున రామలింగనాయణిబల్లెకు తూర్పు కుక్రము రఘుపతి అన్నబసువయ్య చేనికి దక్షిణము కరణాలు మాన్యము చన్నమరాజుగారి చేనికి పడమర కందికొవుల పాలిమేరకు వుత్తరం నరజంబిచేను స్థలము మడి ఖ 3/4 పదిహేదుము నీరారంభము చింతలరాయస్వామి దేవుణికి తలిగలున్ను సమర్పించినది. శ్రీవైష్ణవులు అవిచ్ఛిన్నముగాను ద్వాదశులయందు విశేషంగాను ఆరగించేటందుకు అశ్వాకుల తిరువరిగెలకు వుచితంగాను దానం సమర్పించినది. శాలివాహన శకవరుషంబులు ౧౪౦౦ యీ శాసనము మహాద్వారందగ్గర పశ్చిమతట్టున నిలువుగా వుండిన యాగిరాతిమీద వ్రాశినది. యిదిగాక యీనాయణివారు శ్రీచింతల తిరువెంగళనాథస్వామికి యిచ్చినది నైవేద్యము తక్వేదుబియ్యం అడ్డెడు నెయ్యి అడ్డెడు పెరుగు గిద్దెడు పెసలున్ను దద్యాన్నమవసరాన్కు ఘంటా తిమ్మయకేశవయగారి వశాన్కు యిచ్చినది అని శిలాశాసనం గోపురం వుత్తరంగోడకు వ్రాశినది శాలివాహన శకవరుషంబులు ౧౪౦౭ యీ తిమ్మానాయణివారి ప్రభుత్వంలోనే రంగస్వామికి ప్రతిష్టఆడగా పూర్వము ద్రావిడపూజ నడుస్తూవుండెను. గనుక పాంచరాత్ర ఆగమప్రకారము పుణ్యకాలమందు ఘంటా వోబుళయ్యకు చినతాడిపత్రి చేను మళ్ళు సహాగాను ఆగమశాణయాదిసహా ధారపోశి యిస్తిమి పాంచరాత్ర ఆగమప్రకారము దేవుణికి పూజ నైవేద్యాలు చేసుకొని వుండేది అని శిలాశాసనము పినాకినికి దక్షిణంవొడ్డున రంగస్వామి దేవళంలోను గోడకు రెండుతట్టుల వున్నది. శాలివాహన శకవరుషంబులు ౧౪౧౪ అగు నేటి జయసంవత్సరములోను వ్రాశినది. యీ రంగస్వామి దేవళంలోను తుంటశాసనం వఘటి శ్రీమతే రామానుజాయ నమః శ్రీమద్వేదమార్గ ప్రతిష్టాపనాచార్యులయిన వుభయవేదాంత ప్రవర్తకులయిన తిరుమల బుక్కపట్నము ఆచార్యులు శ్రీవాసాచార్యులు తాతాచార్యులుకు పెమ్మసాని చినానాయడు ఆచార్యాధీనంగాను ధారపోశి సమర్పించెను. శాసనము తుంటలో వున్నది యిదిగాకను శ్రీచింతల తిరువెంగళనాథునికిన్ని శ్రీరంగ నాయకులకున్ను చన్నమరాజు కృష్ణమరాజు కొమారుడు లింగన్నగారు పద్మ యక్షత్రిన్ని ఆనంతములయిన దండములు పెట్టి సమర్పించి యిచ్చిన భూదానధర్మ శాసనము యీకు పెమ్మసాని నారశింహనాయణివారు ధారపోశి యిచ్చినది. శిల్లలూరు పుట్టి యేనుము చేను ఖ 1¼ సూర్యగ్రహణ పుణ్యకాలమందు చింతలరాయస్వామికి ప్రతిదినమున్ను చాంగబడి చేసేదున్ను శ్రీతుళసీమాలలు ప్రతిదివసమున్ను చేసేదు తెంవ్యను చాందుబడి శ్రీతుళసీమాంముల సమర్పించి యిచ్చిన అయిదుము చేనున్ను సమర్పించి యిచ్చినది శిలాశాసనం మహాద్వారం గోపురము దక్షిణముగోడకు వ్రాశినది. శాలివాహన శకవరుషంబులు ౧౪౧౬.

యీప్రకారము జరుగుతూవుండగా శ్రీవిద్యానగరం రాజధాని అయిన అళియ రామరాజు ప్రభుత్వంచేస్తూ వుండగా యీ రామరాజుమీద యుద్ధానకు తురుష్కులు కుతుబశా హైదరాబాదు అల్లీ ఆదలుశా బిజాపూరు నిజాము శాబహారీ అమదానగరం నిజాంశా దౌలతాబాదుయిమాదులు ముల్కు బిరాదం బురానుపూరు యీ అయిదుగురు పాదుశాయీలు సైన్యముతో వచ్చి అళియరామరాజుగారిమీద తిరుగబడి యుద్ధముచేసి జయించి రామరాజును తల కోసుకొనిపోయి రాజ్యము తమస్వాధీనము చేసుకొనిరి.

**గోలకొండ ప్రభుత్వము.**

మరికొన్నాళ్లకు హైదరాబాదుకు తానీశావారు మొకరరు అయి యీ రాజ్యం తానీశావారికి వదుస్తూవుండగా యిక్కడ ఘండికోటలో వున్న చిన్నతిమ్మానాయణిన్ని వెళ్లగొట్టి ఘండికోట తానావేసుకొని కోటకాపాడేదానికి శిబ్బంది కిల్లాదారు మీరుజుమలావార్ని వుంచవుంచురు. యీ రాజ్యము విచారించేనిమిత్యం తానీశావారి తట్టునుంచి పాదిలె లింగప్ప గరిడీమిట్టగమ్మన్నగారు యేకాధిపత్యంగా వ్యవహారం చేసుకొని యీ తాడిపత్రిగ్రామము కసుబామా

బాలు ఆజాబాజు పుటగ్రామాలు నిష్కర్షచేసిన వివరం.

కసుబాతాడిపత్రి పుటు గ్రామాల తపశీలు గ్రామము కసుబా

| | | |
|---|---|---|
| మము కసుబా | ౧ సజ్జలదిన్నె | ౧ తలారిచెర్వు |
| కసుబాపైకి మజరలు | ౨ ఆలూరు | ౧ బోడాయపల్లె |
| ౧ రామలింగానాయన్నపల్లె | ౧ వీరాపురం | ౧ గూడూరు |
| ౧ గాండ్లపాడు | ౧ చాలువేముల | ౧ కడవకొల్లు |
| ౧ చల్లవారిపల్లె | ౧ అమళ్లదిన్నె | ౧ ఊరేపల్లె |
| ౧ జంబులపాడు | ౧ చింతకుంట | ౧ కోమలి |
| ౧ పట్రగిత్తిపల్లె | ౧ చిన్నపొలమడ | ౧ పూరజింతల |
| ౫ | ౧ పల్లకూరు | ౧ బొందలదిన్నె |
| | ౧ వంగనూరు | ౧ పుట్లూరు |
| | ౧ చలాపల్లె | ౧ దోసవేడు |
| | ౧ అరకటవేముల | ౧ మచ్చుకోట |
| | ౧ కంగనాపల్లె | ౧ పెద్దపొలమడ |
| | ౧ నెందలపాడు | ౧౨ |
| | ౧౩ | |

యీప్రకారము గ్రామాలు నిష్కర్షచేసి పరగణా యేర్పరచి గ్రామప్రతిగ్రామానకు కామీలుజేరీజు యేర్పరచి ఆయకట్టు నిర్మాణము చేసి ఆయకట్టు భూమిలో అప్పనం పాయకారి భూమి వాల్లుపర్గులు చేసి అంగును పన్ను మొకరరు చేసినారు గరిడీమిట్ట గమ్మత్తున్న యీకసుబా తాడిపత్రి గ్రామములో వక చెరువు కట్టించి యీగ్రామాన్కు ఆగ్నేయభాగమందు చెర్వుకింద మళ్లు అచ్చుకట్టువేయించి వోరిమహనూలు విస్తారంగా పండిస్తూవుండురు యీచెర్వుకు మామతూములు కట్టించినారు యీచెరువులో నీళ్లు భారీగా నిలుస్తూవుండును యీచెరువుకు పశ్చిమాన గన్నేరుచెట్లు విస్తారంగా వుండేగనుక అస్థళమందు యీవూరి రెడ్డికరణాలు కమ్మవాండ్లకు కౌలు యిచ్చి బీడుదున్నించి వొకపల్లె కట్టించి అపల్లెకు గన్నేరపల్లె అని పేరుపెట్టి యీపల్లెలో వున్న రయితులకు సహా గన్నేవారు అని జనపాఠం వున్నది యీ గ్రామం తాడిపత్రి అయకట్టుభూమిలో వున్నది గనుక మజరాకింద సా॥ నడుస్తూవున్నది. యీకాలమందు దేవాలయాలకు నడుస్తూవున్న గ్రామాలు భూస్వామ్యం జప్తీచేసి వుభయతా దేవళ్లకు సరకారు తట్టునుంచి అఖండదీపనైవేద్యాలుమట్టుకు నడిపిస్తూ రథోత్సవాలు చేయిస్తూ వుండురు మొ॥ వెంకటరాఘవాచార్యులుకు ఆచార్యపురం స్న ౧౧౦౧ హిజరిలో అయినది పత్రము రామాజీ క్రిష్ణప్ప పేరట కాలేను.

మరికొంతకాలం జరిగినమీదట ఆలంగిరి పాదుశావారి తట్టునుంచి జులుఫకారఖానునివారు వొచ్చి యీరాజ్యములో వ్యవహారము చేస్తూవుండి యీతాడిపత్రికి దక్షిణపువొడ్డునవున్న రంగస్వామిదేవాలయం పడగొట్టి మశీదు కట్టించి మీరుమామూదు అనేవస్తాదుకు యిచ్చిరి హిజరీ ౧౧౦౭ యీప్రకారం రంగస్వామిదేవాలయం మశీదుచేశి యీమశీదులోగా మీరుమామూదు అనేవస్తాదుకు యిచ్చిగి పశ్చిమంతట్టున గుర్జు నల్లరాతిమీద ఫారశీతో వ్రాశి నిలిపినారు యిదిగాక యేటి అవల వకమశీదు కట్టించి ఆమశీదుకు కొంతమాన్యం మొకరరుచేశి రోజుస్సవా చేశియిచ్చినారు యీతాడిపత్రిగ్రామాన్కు పశ్చిమంతట్టున యీదుగా కట్టించినారు యీదేశంలో తురకలున్న వగైరావారికి మాన్యాలు రోజా . చేశి సన్నదులుచేశి యిచ్చినారు యీస్థళంలోవున్న దేవాలయాలకు బహూపద్రవంచేశి చింతలరాయస్వామి దేవాలయంలో మధ్యరంగమందు మందుగుండు వేశి రాళ్ళు యెగర కాల్పించి ప్రతిమెలు భిన్నంచేశి దేవాలయాలకు నడిచేపూజ అఖండ-నైవేద్యాలు బందుచేశినందున దేవాలయాలు పాడుపడి వాకిండ్లకు గోడలు పెట్టివుండురు- యీతాలూకు పుటుగ్రామాలు యినువై అయిదు పైకి యీతాడిపత్రికి పశ్చిమము పనాకొసుమీదవున్న పెద్దపొలమడ అనేగ్రామము గజల్ ఖానుఖానునికి జాగీరుగా ఆలంగిరివారి హుకుముప్రకారము జులుఫకారఖానునివారు యిచ్చినందున జాగీరుగా నడుస్తూవుండెను. యీప్రకారము కొంతకాలం జరిగినపిమ్మటను బక్షుబందుఖానునివారు యీదేశములోకి వొచ్చి కొన్నికోటలు వగైరా కట్టించినారు వారుపోయిన తరువాతను నవాబు దావూదుఖానునివారు వొచ్చి కడప ఆరకాటు రెండు సుబాలు యేర్పరిచి యీరాజ్యము రెండుపఖాలుగా పంచివేశి గుత్తిసరకారు ఘండికోటసరకారు ని

ర్నయును చేశి యీతాడిపత్రి దేవాలయాలున్ను ప్రతిష్ఠచేయించి పూజనైవేద్యాలకు ఆకరం చేశి నడిపించెను, యీదావూతుఖానివారి దివానుఅయిన తోండ్రమల్లు నవాబు సెలవు ప్రకారం వుభయతా దేవాలయాలున్ను మధ్యమందు విస్తారంగా కోట కట్టించి ఆకోటలో వకకచ్చేరి కట్టించి యిండ్లు కట్టుకోని యీకడపా అగవేడు సుబాలలోను పరామరికె చేస్తూవుండురు యీకాలమందు మయిసూరు సీమనుంచి మలుపెద్ద శిరిదిశెట్టి అనేవర్తకుడు వొచ్చి యీతాడిపత్రి గ్రామములోను తోండ్రిమల్లుగారు కట్టించిన కోటలో మధ్యభాగమందు వకదేవాలయము శిలామంటపం నూతనంగా కట్టించి చెన్నకేశవస్వామిని ప్రతిష్ఠచేయించి పూజనైవేద్యాలున్ను తానే స్వదా నడిపిస్తూవుండును. నవాబు దావుతుఖానునివారి తర్ఫునుంచి మిదట తిమ్మాజి తిమ్మన్న పంతులవారు యీతాలూకు అమలు చేస్తూ వుండి యీగ్రామంలో వుభయతా దేవళ్లకు రథోత్సవము ప్రతిసంవత్సరం కావలశినందులకు యీతాలూకా గ్రామాలదేశస్థుల పిలుపించి గ్రామాలు శిస్తుకు నూటికి ౧౦।౦ భాగణం లెఖ్ఖను వరుమానము ప్రతిసంవత్సరం యిచ్చేలాగున గ్రామాలవారికి సమ్మతిచేశి యిచ్చిన శిలాశాసనము సుంకరచావిడివద్ద యుత్తరాతిమీద వున్నది. శాలివాహన శకవర్షంబులు ౧౬౬౫ తరువాత కాయిపంతులవారి అమల్లోను యీతాడిపత్రి గ్రామమునకు పశ్చిమంగాను వకదివాణము కట్టించి గ్రామంచుట్టూ కారుపణా కట్టించి నాల్గుతోపాలవాకిండ్లు యేర్పరచి మరికొన్నిదినములను జగ్గన్నపంతులుగారు అమలుచేశి పోయినపిమ్మట నవాబు దావుతు ఖానునివారు డిల్లీకి సాగిపొయ్యేటప్పుడు అగవేడుసుబాను హ్రాగుతుల్లాఖానునివారిని కడపసుబాను మయానా అబులనబీఖానున్ను వుంచి తర్లిపోయిరి తరువాతా యీతాలూకాలు ఆరువేటివారికి నడుస్తూవున్న కాలమందు కొంబా నాగోపంతులవారి అమల్లోను యీతాడిపత్రిలో యేటిఅవల అంజనేయస్వామి దేవాలయము వ్యాసరాయలవారిచేత పూర్వము ప్రతిష్ఠఅయివున్నందుకు సాలామంటపం కట్టించినారు ప్రసిద్ధిఅయిన వుద్యోగస్థులు తిమ్మాజి గోవిందప్పగారు యేటిఅవల వకవనం వేయించినారు యిదిగాకను పొన్నప్పగారు వకచింతవనం వేయించినారు. తరువాతను ఫత్తెల్లీఖానునివారి అమల్లోను హైదరుమహమ్మదుఖానుడు అమలుచేస్తూవున్నప్పుడు మరహాటీవారికి తాన్తిశిద్ధోజివారు చౌదాయి నిమిత్యం గుత్తి గండికోట రాజ్యముల్లోకి వచ్చి యీరాజ్యములో కరారత్తు చేస్తూ యీతాడిపత్రికోటకు ముట్టడివేశి చింతలరాయస్వామి గోపురము మీద రెండోవాకిలిమీద ఫిరంగి యెక్కించి కోటలోకి పడగాల్చి చౌథాయిరూకలు తీసుకొనిపోయిరి యీకాలమందు యీతాడిపత్రికి దక్షిణం వకకోసుమీద గత్తిరెడ్డి తిప్పారెడ్డి అనేవాడు వకపల్లె కట్టించి వకవనంవేయించి ఆగ్రామములోను ఆంజనేయస్వామిదేవాలయము కట్టించి ప్రతిష్ఠచేయించినాడు గనుక యీగ్రామము తాడిపత్రి అయకట్టుభూమిలో వున్నదిగనుక మజరాకింద నడుస్తూవున్నది యీగ్రామంలో హైదరుమహమ్మదుసాహేబు అనే మహాయను ఆసారు వకటి నడిగ్రామములోను కట్టించి యీ ఆసారులో నిమాజు చేసుకుంటూ కొన్నాదినములు వుండెనుగనుక్కు వారికి కాదారంభము నలుకుము చేను సరకారుతర్ఫునుంచి యినాముగా యిప్పించినారు గనుక నడుస్తూవున్నది యిదిగాక నడిగ్రామములో పీరుజాదాను మాయను కాశిముసాహేబు అనేఅయున దరగా కట్టించి ఈ దరగాలో మరుస్తుచేసేదానికి ఖిజమతుగారీ చేశేదానికి వకఫకీరువాణ్ని వుంచి యీఫకీరుకు గ్రామావకు సరకారు శెలవుప్రకారం యిద్దుముచేను మాన్యము యిప్పించినందున నడుస్తూవున్నది. నడిపేటలో వకమశీదు కట్టించి యీమశీదుకు చిరాబు కోసనాయికి రోజా మొకరరుచేశినది. సరకారు నడిపిస్తూవుందురు. యీ గ్రామములోవున్న శ్రీరామేశ్వరస్వామికిన్ని చింతలరాయస్వామికిన్ని ఆరువేటివారి ప్రభుత్వములోను రోజా నడిపిస్తూవున్నది వివరం చింతలరాయస్వామికి పూజనైవేద్యాలుకు రెండురూకలు శ్రీరామేశ్వరస్వామికి పూజనైవేద్యాలున్ను వకరూక రోజు ప్రతిదినం యిచ్చేటట్లుగా సాదుతుల్లాఖానునివారు పరవానా మొకరరుచేసి యిచ్చినారు గనుక అదేప్రకారము కొన్నిదినములు నడిచెను. యీగ్రామానకు పశ్చిమం లోగడ జుల్ఫకారుఖానునివారు వకయీదుగా కట్టించివుండగా ఆయీదుగాను ఫకీరునాయక్కరివారు గచ్చుగిరిచేయించి వకశిలమీదను పారశీతో శాసనము స్న ౧౧౨౯ హిజరి

ఆ గ్రామములోను హైదరుమహ్మదుఖానుడు యిక్కడ అమలుచేస్తు వున్నకాలమందు యీకోటను పశ్చిమంగాను మంటిఫకీరువానికి దరగా కట్టించి గ్రామాన్ని ఖాదారంభము మత్తుచేను యిప్పించినాడు గనుక నడుస్తూవున్నది యీకాలమందు యీతాడిపత్రికి పశ్చిమం వకమసీదు కట్టించి యిందులో రొడీగా అనేఫకీర్ను వుంచి అన్నాన్నకు గ్రామం కమిలా పొలంలోను నలుతూముచేను మాన్యం చూపించినారు గన్కు నడుస్తూవున్నది. శ్రీచింతలరాయస్వామి దేవాలయానకు వుత్తరభాగమందు వకమసీదు కట్టించి డోంగరిమ్యా అనేఫకీరును వుంచి వీనికి గ్రామాన్ని సరికారు తట్టునుంచి రోజీనా మొకరరు చేసి నడిపిస్తూవుందురు.

యీప్రకారము కొంతకాలము జరిగినమీదట మరహాటిబలవంతరాయణివారిసైన్యం

కడపనవాబుల [illegible]యాము.

వొచ్చి కడపతాలూకుముశీదుమియ్యాతో యుద్ధముచేసి అముశీదుమియ్యానువారింతేసి గుర్రంకొండరాజ్యం తాము కట్టుకొని యీతాడిపత్రి వెల్లలూరు యాడికితాలూకాలు అరవేటివారికి నడుస్తూవున్నవి. కడపతాలూకు మయాణావారు మొకరరుచేసుకొనిరి నవాబు గనీమియ్యావారు యీతాలూకాలు చేస్తూవుండి యీతాలూకాలు ఫకీరునాయణివారికి స్వాధీనము చేసినందున అకాలమందు కోటలోను వకమసీదు కట్టించినది. సన ౧౧౬౭ హిజరి యీమసీదుకు మాన్యము రోజనగైరా నడుస్తూవున్నవి. యీగ్రామాన్కు అకోసుమీద తూర్పుభాగమందు వకకుంట కట్టించి అక్కడనె వకదరగా కట్టించి ఫకీరువాణ్ని దరగా కావున వుంచి మాన్యము యిప్పించి నడిపిస్తూవుందురు అదిగాక యీతాడిపత్రిపేటలో వక అష్యూరుఖానా కట్టించినారు. లోగవ నడిచిన యీస్తానము యీతాడిపత్రి గ్రామాన్కు దాకలవాండ్ల యిండ్లకు తూర్పు వకకోనేరు తవ్వించినారు యీగ్రామాన్కు వుత్తరభాగమందు నదివొడ్డున శంకరదీక్షముషాహేబు అనేఫకీరుకు వకదరగా కట్టించియిచ్చినారు యీతాడిపత్రిలో పూర్వం యేటికాల్వ పెందలపాడుతావున తలిగేవుండగా అకాల్వ తలిగేక యేట్లో చిన్నపొల్మదకు నదీగా గోడకట్టించి యిందుకు తూర్పు పెందలపాటి పరివాడ్డుపరియంతరము గడ్డకాల్వతవ్వించి నీళ్ళు విస్తారం పారేలాగ్న చేయించినాడు తరువాత మరికొంతకాలాన్కు కడప మయాణావారి తట్టునుంచి వారితాలూకు బబ్బరఖానుడు అనేఅయన తాలూకా అమలుచేస్తు యీతాడిపత్రి గ్రామములోను శ్రీచింతలరాయస్వామి దేవాలయాన్కు తూర్పు నకపేట కట్టించవలెనని ఆరంభముచేసి పదిమళిగెలు వేయించి యిందుకు అరకోసుమీద వకపల్లె కట్టించి ఈపల్లెను వకకాప్ప పద్మాపు వాళయ్య అనేవాణ్ని నేమకము చేసి వుండగా అకాపవాడు నాల్గుఅయిదుయిండ్లు వేసుకొని బబ్బరఖానునిపల్లె అని నిర్మాణము వుండగా యింతలో ఆబబ్బరఖానుని వారు అమలు చాలించుకొని పోయ్నిమిమ్మట ఆపల్లె పాడు అయిపోయెను. ఈయన కట్టించిన పేట పాడుఅయిపోయెను. తరువాతను ఈగ్రామానకు పన్నెండుకోసుల మీదవున్న పాళెగాడు వ్యాపరి వెంకటప్పనాయుడు అనేవాడు వొచ్చి ఈతాడిపత్రి గ్రామము దరోబస్తు దోచుకొనిపోయెను. ఇదిగాకను ఈగ్రామములోను పద్మకన్నలవాండ్లు తమయిండ్లవొద్దనే వకకాళికాశక్తి దేవాలయము కట్టించి ఆదేవతను పూజనైవేద్యాలు తీమకులంవారే నడిపిస్తూవుందురు. తూర్పుపాళెములోను సుంకులమ్మ దేవాలయము కట్టించినారు.

యీప్రకారము జరుగుతూవుండగా మరహాటి శ్రీ ద్రోజికోమాదుడు ఘురాగ్రాయుడు

మహారాష్ట్ర ప్రభుత్వము.

దేశములోను కరారుచేస్తూవుండి నుక్తి తాకావేసుకొని యీతాడిపత్రిపరగణా యీవకి వెల్లలూరు యీమూడుతాలూకాలకు ముహాణావారు చేస్తూవున్నకాలమందు మురారాయణివారు వొచ్చి గనేమియ్యావారిని విడిపించి మురారాయణివారు కట్టుకొని తిదారభ్యము యిరువైసంవత్సరాలు పరియంతరం అమలుజారిగాను తాలూకాలను పంపిస్తూవున్న కాలమందు యీతాడిపత్రి తాలూకు మురారాయణివారు ధాతసంవత్సరం తాకావేసుకొన్నదిగా నివాహే నకతబదసంబు లు

౧౬౭౮ లాగాయతి యీతాడిపత్రి గ్రామ
ములోను నడిచిన పూర్వోత్తరం యీతాడిపత్రి
పేటలో వున్నవర్తకులు ముస్తాకొట్టి పెంచలైనకోమట్లు ఈ
చినాకిడికి దక్షిణభాగమందు దారుమంటపం కట్టించి ఆం
జనేయస్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠచేయించి పూజనైవే
ద్యాలుకు తమవర్తకులమీద తీరువ పెట్టుకొని నడిపిస్తూవుం
డురు యీవర్తకులు సమసిపోయిన తరువాతను సరకారు
వారు రోజు నిన్కరుషచేసి పూజనైవేద్యాలుకు నడిపిస్తు
వున్నారు శ్రీచింతలరాయస్వామి రథోత్సవము లోగడ
ప్రతిష్ఠ ఆదిగా వైశాఖమాసంలోను అవుతూవుండగా ము
రారిరాయణివారి ప్రభుత్వములోను యీతాడిపత్రి ఆమ
లుచేస్తువున్న రామాజీపంతులవారు రథోత్సవము అయ్యే
దినములలోను తమకు ఆపదవచ్చినందున ఆవైశాఖమాస
ము రథోత్సవము తప్పించి ఆశ్వయుజమాసములోను ఈ
శు ౧౫లు సాము రథోత్సవము మొకరరుచేసినారు గనుక
తదారభ్యము ఆశ్వయుజశు ౭లు ధ్వజారోహ
ణము ఆరంభము చేసి యీశు ౧౫ లు తిరుణా
లవుత్సవం తదారభ్యంచేసి యిదేరీతున నడుస్తూవున్న
ది. ఆకాలమందు యీమురారిరాయణివారి దివాను నర
దేశాయి నరశింగరాయణివారు శ్రీచింతలరాయస్వామి దే
వాలయంలో మధ్యరంగం లోగడ జాలఫకారఖానునివారి
ప్రభుత్వంలో ముందుల తిత్తులు వేయించి యొగరకాలుపిం
చి వుండగా ఆమధ్యరంగము బయలుగా వుండునుగనుక
యీ నరదేశాయి నరశింగరాయణివారు కొన్నివ్యాప
దూలాలు నల్లమలదూలాలు కొన్ని తెప్పించి వేయించిరి
కొన్నిదినములు జరిగినమీదటను రంగోగోవిందుగారు ఈ
తాలూకు అమలుచేస్తువున్న కాలమందు యీతాడిపత్రి ప
ట్నము పస్నెండుకోసులమీద వున్న పాళెగారు అనంత
పురం బసప్పగారు మందితోకూడా ఈ తాడిపత్రికి వచ్చి
ఈ గ్రామము దగ్గొబస్తు దోచుకొని రయితు లందరిని ప
ట్టుకొని దండుగలు తీసుకొని పొయ్యేటప్పుడు యిక్కడ
అమలుచేసే రంగోగోవిందుగారినిపట్టుకొనిపోయి దండు
గ వొప్పించుకొని విడిచెను. ఈ కాలమందు రఘునాథప్ప
గారు ఈ తాలూకా అమలుచేస్తువున్న కాలమందు కడప
తాలూకానుంచి నూగూరు దానప్ప వగైరావారు కొంత

మంది వర్తకులువచ్చి ఈ గ్రామములో చేరివున్నప్పుడు ఆ
నూగూరు దానప్ప అనేవర్తకుడు శ్రీరామేశ్వరస్వామి దే
వాలయము గచ్చుగిరి జీర్ణము అయివుండగాను తిరుగ గ
చ్చుగిరి చేయించి మహాద్వారమునకు పడమట వాకిలి తలు
పులు యేర్పరచి దేవాలయములో శృంగార ప్రతిమెలు చి
త్రాలు వ్రాయించిరి. ఈ ప్రకారము నూతనసంవత్స
రాలు దేవాలయము చక్కచేయించి ఈ గ్రామములోనే
వుండగా గుత్తి నరదేశాయి నరశింగరాయణివారు శ్రీచింత
లరాయస్వామి దేవాలయము యిదేప్రకారము గచ్చుగించే
యించవలెను. అని యోచనచేసి నూగూరిదానప్పగారి ము
ఖాంతరము కొంతద్రవ్యముయిచ్చి తమకు జాగీరుఅయి న
డుస్తువున్న అరకటవేముల గ్రామము దానప్ప అనేతని
కిని ఇనాముకు యిచ్చి దేవాలయము గచ్చుగిరి చేయించ
మని శలవు యిచ్చినందున అదేలాగున శ్రీచింతలరాయ
స్వామి దేవాలయము కొంతపనిచేయించి మహాద్వారము
గోపురముచక్క చేయిస్తువున్న సమయమందు మురారిరా
యణివారి తర్ఫునుంచి పాళేఖానుడు అనేకిల్లాదారునివా
రు మందితో ఈ తాడిపత్రికివచ్చి ఈ కిల్లాలో చేరి నూ
గూరు దానప్పవగైరాకువర్తకులను అందరిని పట్టుకొని దం
డుగలు తీసుకొనిరి గనుక దేవాలయము పనినిలిచెను.

మైసూరువారల ప్రభుత్వము.

యీప్రకారము జరిగిన పిమ్మటను మన్మథసంవత్స
రములో నవాబు బహాదరువారు ల
ష్కరుతోవచ్చి గుత్తికొండను ము
ట్టడివేసి యీదేశము యావత్తు సరా
రతుచేసి గుత్తికొండ మూడునెలలు
పోట్లాడి గుత్తికొండ సాధించి మురారిరాయణ్ని తీసుకొని
పొయ్యే సమయమందు గుత్తినుంచు బాబారాయణివా
న్ని మొకరరు చేసినందున ప్రభుత్వముచేస్తు కొన్నిదినము
లు జరిగినమీదటను మొగలాయివారి తట్టునుంచి ధ్వంసా
అనేవాడు సైన్యముతో వచ్చి యునిమక్కువొద్ద దిగి అగ్రా
లు యావత్తు సరారతుచేసి నేరేడుచర్లకోటలో బహాద
రువారితాలూకు మంది ఠాణావుండగా ఆకోట సాధించి
ఆకోటలోవున్న మందిని కాళ్ళు చేతులు తెగగొట్టించినం
దున యీదేశం యావత్తూ పాడుపడి దేశములో ప్రజలు
వలసలుతీసి గ్రామాలు పాడుచేసి ఖండికోటవగైరా గడే

స్థలాలలో చేరివుండగా అధ్వంసావారి సైన్యం యీపెన్న ఉత్తరాజ్యం యావత్తు కరారతుచేసి పాతర్లలోవున్న ధాన్యం వగైరాలు లూటిచేసి సంచారంచేస్తు వుండగా యీవర్తమానము బహాదరువారు విని ఖాసా బహాదరునవాబు సాహేబులవారు సైన్యంతోకూడా యకాయకీ వొచ్చి శింగనమలచెరువులో దిగినట్టే వర్తమానం విని యీధ్వంసావారి సైన్యం తీసిపోయి పశ్చిమాభిముఖంగా పోయినందున బహాదరువారు వెంబడించి కొన్నాదూరం పరియంతరం తగిలిపోయి కృష్ణానది అవల పారుచేసి అక్కడ బహాదరువారు దిగి యీరాజ్యం యావత్తూ బందోబస్తు చేసిరి ఆసమయమందు యీతాడిపత్రి గ్రామానిక్కి దక్షిణం కోటకట్టించేదానికి హుకుము అయినందున నత్తిదుఖాను సాహేబులవారి వశాన్ని ద్రవ్యము యిచ్చి పంపించినందున యీగ్రామాన్కు దక్షిణభాగమందు నూతనంగా కోట కట్టించినారు తరువాత ధ్వంసా గోలకొండమార్గము తీసుకొని పోయెను. యీరాజ్యములో హనిమద్గు శిరేడుచర్ల రయితులు పట్టుకొనిపోయి నిర్మూలరాజ్యము చేసెను. తరువాత బహాదరువారు సయిన్యములోకూడా చిత్రకల్లువగైరా రాజ్యము సాధించి యకాయకి వికారి సంవత్సరంలో కడప రాజ్యము చేస్తువున్న మయానా అబ్దుల్అలీంఖానునివారి కొమాళ్ళతో యుద్ధముచేసి శిధవటాన్కు ముట్టడివేసి అలీంఖానున్ని సాధించి శ్రీరంగపట్నానకు తీసుకొనిపోయిరి. యీదేశములోవున్న పాళెగాండ్లుతాలూకునవున్న గ్రామాలు యావత్తూ సరకారు జప్తిచేసి గుత్తి కడపరాజ్యముక్కు సామిలు చేసిరి.

**టీపు సుల్తాను.**

ఈ ప్రకారము కొన్నిదినాలు జరిగిన తరువాతను బహాదరువారు కాలముకేంద రాజ్యాన్కుపోయి అక్కడనే శరీరం విడిచిన తరువాత ఈ యవనొమారుడు శుభకృతునామ సంవత్సరం తాగాయితి రాజ్యభారం టీపుసాహేబు చేస్తువున్న కాలమందు విశ్వావసునామ సంవత్సర మాఘమాసములోను మరహాటివారితాలూకు బయిదుగుర్రం కృష్ణానదివొడ్డున దిగివుండి అయిమనూర్లుగుర్రం యకాయకి తాడిపత్రికివచ్చి గ్రామం దర్బస్తు దోచుకొని గ్రామములో బహుమంది సంసార్లను జేళ్లువరకి పాడుచేసి అదేకాలమందు బయిదుగుర్రం రెండోదఫావచ్చి వెల్లనాక దర్బస్తు దోచుకొని దేశములోను కరారతుచేస్తు వుండగా టీపుసుల్తానువారు సైన్యముతోకూడా యకాయకి శ్రీరంగపట్నమునుంచి వెళ్లి అదవేనిమీద హోకామచేసి దర్బస్తు దోచి అదవేని తాణా వేసుకొని పశ్చిమానకు కొన్నాదూరం పరియంతరంపోయి మరహాటీలవారి సైన్యం పశ్చిమానకు పాగనంపించి తిరిగివచ్చేసమయమందు రాయదుర్గముసాధించి అధోరలను శ్రీరంగపట్నానకు సాగించుకపోయిరి. ఈ రాజ్యంలో గుత్తిసుభావొద్ద కుతుబద్దీనుఖాను నవాబును వుంచివుంచిరి.

**హైదరాబాదు నిజాముగారి ప్రభుత్వము.**

ఆకాముందు కుతుబద్దీనఖానువారి సైన్యము ఈ రాజ్యము కాపాడుతూ వుండగా సౌమ్య సాధారణ సంవత్సరాలలో నిజాముల్లీఖానువారి సైన్యము వచ్చి పానగల్లువద్ద దిగి ఈ రాజ్యములో కరారతు చాయువలెను అని వుండగా ఆసమయమందు బనగానిపల్లెనవాబు అసదల్లీఖానువారు కొంతసైన్యముతో వొచ్చి బనగానిపల్లెను వచ్చి తాణావేసుకొని పూర్వము ఈ దేశములోను వున్న పాళెగాండ్లను పిలిపించుకొని ఈ రాజ్యములో కరారతు చేయవలెనని వుండగా గుత్తివద్దవున్న కుతుబద్దీనుఖాను నవాబువారు సైన్యముతో పోయి అవుకువద్దను దిగి బనగానిపల్లెవారు యీ అసదల్లీఖానునివారి యీకుతుబద్దీనఖాను నవాబుకు యుద్ధము అయినందున ఆయుద్ధములోను బహాదరువారితాలూకు కుతుబద్దీనుఖాను నవాబులవారి సైన్యము విరిగివచ్చి గుత్తిచేరినందున అసదల్లీఖానునివారు సైన్యముతోకూడా బనగానిపల్లె బలకాయించుకొనివుండగా నిజాముల్లీఖానునివారితాలూకు వారిసైన్యముతో ఖారామల్లు ఆసేపరదాలు యింకా కొంతమంది సరదారులు వచ్చిరి తమాము నలుదైవేలుగుర్రం దేశములో వున్న పాళెగాండ్లు మందిని కూర్చుకొని కుండికోటకు ముట్టడివేసి సాధించి యీతాడిపత్రితాలూకు నిజాముల్లీఖానునివారి కలవుప్రకారం హిస్సాము

యూర్టి అనేకసరదారుడు వొచ్చి కొల్లలూరుకోటకు ముట్టడివేశి సాధించి యీతాడిపత్రితాలూకాకు వచ్చి కోటకోటకు ముట్టడివేశి సాధించి గ్రామములోను దిగి తరూము సాడుచేసి కొలదినములు కోట పోట్లాడి సాధించిరి తరువాత శింగనమల వేముల రెండుతాలూకాలు సాధించిరి తరువాత నిజాము అల్లీఖానుగారి దివాను అయిన మష్రాయముఖకు భారీసైన్యముతోకూడా శ్రీరంగపట్నానకు పోయ్యేటప్పుడు యిక్కడవున్న యిస్పామియ్యావారు మశివారివెంబడిగా పట్నం పరియంతరం పోయి తిరిగివచ్చేటప్పుడు తాడిపత్రి మశిరువారు యిస్పామియ్యావారికి తాణా వేయించి యిచ్చి తాడిపత్రి పాళెగాణ్ని వెళ్లగొట్టినందున ఆతాడిపత్రితాలూకు పాళెగాండ్లు కురాపురానక్కు పోయి అక్కడినుంచి సైన్యముకూర్చుకొని వచ్చి ఈ తాడిపత్రి గ్రామముదగ్గిరబస్తు దోచుకొని రయితులను పట్టుకొనిపోయి ఈ తాడిపత్రి వాయువ్యభాగమందు అయిదుకోసులమీద కోన వుప్పలపాటి కోనలో దిగివుండగా యిస్పామియ్యాగారు వేములలోను వుండి యకాయకీ సైన్యముతోకూడా వొచ్చి ఈ గ్రామము వర్తమానమువిచారించి ఆరాత్రి తల్లిపోయి కోనలో దిగివున్న కురాపురంవారి సైన్యముతో పాళెగాణిమీద యుద్ధంచేశి దరోబస్తు దోచుకొని వచ్చి ఈవూరు చేరివుండగా ఆపాళెగాడు అక్కడినుంచి తాడిపత్రి తాలూకాలోకి పోయినందున యిక్కడవున్న యిస్పామియ్యావారున్ను సైన్యముతోకూడా పోయి అక్కడ పాళెగాణ్ని నిభాయించకుండా చేశినందున వాణికి నిభావులేక తిరిగి కురాపురం చేరెను. మరిన్ని యిస్పామియ్యావారు యీరాజ్యము వ్యవహారము విచారించుకుంటూ వుండగా యీగ్రామము నడిపేటలో పంసారీయిండ్లు పడగొట్టి పకశ్చేరి నిర్మాణము చేశిరి యీప్రకారం మూడుసంవత్సరాలు అయిదుతాలూకాలు అములు జేశినతరువాత యీతాలూకాలు గుత్తియిలాఖా విడిచి గోలకొండతాలూకు అయినది ఆకాలమందు యిస్పామియ్యా మొదలుచేసుకొని పదిసంవత్సరాలు పరియంతరం గోలకొండనుంచి అములుదార్లు వచ్చి విచారిస్తూవుండిరి. యిందుకు వివరము.

౧ యిస్పామియ్యా ౧ ప్రాకుటూరు అమానసాహెబు
౧ శిలావ రద్దౌలా ౧ గులాముల్లీఖాను
౧ చందూలాలు

యీప్రకారం అయిదుగురు సరదార్లతట్టునుంచి వొచ్చిన అములుదార్లు వ్యవహారముచేస్తువుండగా పదిసంవత్సరాల పరియంతరం జరిగినమీదట యీతాడిపత్రికి ముక్కాలుకోసుమీద అయకట్టుభూమిలోను గొర్తి రాముడు అనేకమ్మవాడు పకపల్లె కట్టించినాడు మజరా గొర్తిపల్లె అనిపేరు వున్నది యీతాడిపత్రికి దక్షిణభాగమందు కోసుమీద రెడ్డిపల్లె పొలంలో వెంకటాద్రినాయుడు పకపల్లె నిర్మాణంచేశినాడు గనుక వెంకటాపురము అనిపేరు కలిగినది. మజరాకింద యీరెండుపల్లెలు నడుస్తువున్నవి.

గులాముల్లీఖానువివారి అమల్లోను ఈ తాలూకాలు తాడిపత్రి వెల్లలూరు ఈ రెండు తాలూకాలు మహమ్మదు అనీపు అనేజమాదారుని మార్ఫత్తున యిచ్చివుండగా ఈ మహమ్మదు అనీపు జమాదారుణి తట్టునుంచి అములుదార్లు వెంగమ్మనాయుడు బొట్టెపల్లె అప్పన్నగారు వచ్చివుండగా రెండుతాలూకాలుక్కు రూకలు రూడాగా చెల్లక బాకీపడినందున ఆజమాదారుడు యీతాడిపత్రితాలూకాలో కూర్చొని అములుదార్లమీద రూకలుక్కు జాస్తీ జోరుచేసి గ్రామములో రయితులుచేత దండుగలు వొప్పించుకొని ఖర్చుచేశి యియ్యమని ఆలోచనచేస్తువున్న సమయమందు కానామంది రయితులు పరారిఅయిపోయి పరాయీన చేరి చిక్కిన రయితులచాత దండుగలు వొప్పించుకొని తీసుకొని పారిపోయినయిండ్లు తవ్వించి దొరకిన ద్రివ్యము తీసుకొని ఈ గ్రామంలో వున్నకాలమందు నిజాముల్లీఖానునివారి ఫౌంజులు శ్రీరంగపట్నానకు టిపుసాహేబుమ సాధించి ఈ మార్గాన కొంతసైన్యం వచ్చి గుత్తికిముట్టడివేశి అక్కడవుండగా కొంతమంది రయితులుపోయి ఫిరియాది చేశినందున సైన్యముతో పకసరదారుడు వచ్చి ఈ గ్రామములో వున్న మహమ్మదు అనీపు జమాదారుణ్ని వెళ్లగొట్టిరి యింతలో చందూలాలావారు గోలకొండనుంచి కడపరాజ్యము మొదలుచేసుకొని గుత్తి పరియంతరం ఖిల్లారిదేఖిలు చేసుకొని సైన్యముతో వొచ్చిరి. గనుక రాజ్యము చందూలాలావారి స్వాధీనము అయిన ఆకాలమందు ఈ అయిదుతాలూకాలు పైని వేరులతాలూ

గా శేకే కడపతాలూకాకు సామీలు చేసి తాడిపత్రి సింగనమల వెల్లలూరు యీ తాడిపత్రి యీ నాల్గుతాలూకాలు అమలు బలవంతరాయణికి యిచ్చి పంపించినందున తదారభ్యము బలవంతరాయడు రెండు సంవత్సరాలు అమలుచేస్తువుండగా దేశం యాకలునిమిత్యం గ్రామాలు చెచిరాకుఅయి దేశములో రయితులు పరారిఅయిపోయిరి.

**కుంపిణీ ప్రభుత్వము.**

యింతలో కుంపిణీవారు తమాము దేశమూము తమ స్వాధీనము చేసుకొని దేశము లోకి వచ్చేసమాచారము విని చందూలాలావారు లోగడ అమలుచేసిన అమలుదార్లను గోలకొండకు పట్టి అంపించి వుండిరి వారు అక్కడినుంచి తిరుగ విడుదల అయి దేశములోకివచ్చిరి ఆసమయమందు కుంపిణీవారు దేశం యావత్తు తమస్వాధీనముచేసుకొని ఈ గ్రామంలోను మొగలాయివారు లోగడ ఈ తాడిపత్రిగ్రామములో రయితులచేత దండుగలు తీసుకున్న రూకలు వాపసు యిప్పించి రాజ్యం కుదిరించిరి. తరువాతను దుర్మతిసంవత్సరం లాగాయతి దేశమాద్యంతము పయిమాషీ చేయించితరం జమాబందిచేసినారు యీప్రకారం వుండగా దేశములో వరుసము విస్తారము అయేర్లు అతివిస్తారంగా అయి ప్రవహించి దేశములో చెరువులు యావత్తు హాజరతు మనరోలు సాహెబులవారు కట్టించి పుద్ధారముచేసిరి యిదిగాకను దేవాలయాలు జీర్ణవుద్ధారము దేశములో చేశిరి. యీ తాడిపత్రి గ్రామమందు శ్రీ చింతలరాయస్వామి దేవాలయములో ఆస్థానమంటపం పూర్వాన వున్నప్రకారం శిలామంటపం కట్టించేదానికి తగిన ద్రవ్యము యిచ్చిరి గనుక ఆదేవాలయములో జీర్ణమయిన ఆస్థానమంటపం కల్యాణమంటపం ప్రాకారము యావత్తూ దురుస్తుచేయించినారు ఇదిగాకను చాలా పనములువేయించినారు, యీ గ్రామములోను వున్న వుభయతా దేవాలయాలు యింకా గ్రామములో వున్న దేవాలయాలు సర్కారు తట్టునుంచి నడుస్తూవున్నది. హాలీ కుంపిణీ సర్కారులో నడిచే కట్టుబడ్లు తపశీలు.

అంతు యీగ్రామములో వుండే దేవాలయాలు ౯కి పూజ నైవేద్యాలు సర్కారునుంచి మొకరరుఅయి వొచ్చిన దేవాలయాలు ౫ గాకను నిల్వ దేవాలయాలు ౪ కి స్వంతంగా పూజనడిచేశక్తి దేవాలయాలు ౨ గ్రా నిల్వబడి రెండుదేవాలయాలు పూజ నైవేద్యాలు లేక మూలవిగ్రహాలు సహితం లేవుగనుక పాడై దేవాలయాలుమాత్రం పాడుగావున్నవి. మండ్రోలుసాహెబులవారి ప్రభుత్వములో చింతలరాయస్వామిదేవాలయం ఆచార్యపురుషత్వానకు రామానుజాచార్యులకు సనదుప్రకారం అమలుదారు గోవిందరాయణివారి తాకీదు పుట్టినది. ౧ రక్తాక్షినామసంవత్సర ఆషాఢ శు ౧౪ లు.



# విష్ణుకుండి మాధవవర్మ [redacted] ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనము

[redacted] కోమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు

[redacted] Bharati Vol 7

శాసనప్రాముఖ్యవ[redacted]

పూర్వచాళుక్యులకు (౬౦౦) పూర్వము దక్షిణకళింగమును, వేంగీరాజ్యమును అన బరగు హిందూదేశ ద్వీపకల్ప ప్రాక్తీరభాగ మును పరిపాలించిన రాజులను గూర్చి మన కంతగా తెలియదు. మహమ్మదీయుల పరిపాల నమున ఉత్తరసర్కారు లనుపేర వ్యవహ రింపబడినదికూడ ఇంచుమించుగ ఈ భాగమే. ఉత్తరమునందు ఏ కొద్దిభాగమునో తక్క మిగి లిన ప్రదేశమంతటను తెలుగుమాటలాడు వారు నివసించుచున్నారు. రెండవ పులకేశియు, రాజమహేంద్రపుర పూర్వచాళుక్యవంశ ప్రతి ష్ఠాత యగు ఆతనిసోదరుడు కుబ్జవిష్ణువర్ధను డును ఈ ప్రదేశమును జయింపక పూర్వము వేఱువేఱు వంశములకు సంబంధించిన రాజు లనేకులు దీనిని పరిపాలించినట్లు చిల్లరగ దొర కిన తామ్రశాసనముల ననుసరించి తెలియ వచ్చుచున్నది. ఇక్ష్వాకులు[5], బృహత్ఫలాయనులు[6],

1. [ఈశాసనమును ప్రకటనార్థము శ్రీలక్ష్మణరావు గారు కలకత్తా విశ్వవిద్యాలయమువారి 'జర్నల్ ఆఫ్ ది డిపార్టుమెంట్ ఆఫ్ లెటర్స్'కు ౧౯౨౩ లో పంపిరి. కాని యిది వారు దివంగతులైన యనంతరము ౧౯౨౫ లో కాని ఆ 'జర్నల్'లోను ప్రకటింపబడ లేదు. ఆంధ్రదేశచారిత్రమున కిది ముఖ్యమైనది యగుట చేతను, ప్రధానములైన వారిశాసన వ్యాసములలో నిది యొకటి యగుటచేతను వారి యీవ్యాసము ననుసరించి యిందు ప్రకటించుచున్నాను.— మ. సో. శర్మ].

2. అసలు కృష్ణాగోదావరి నదులకు మధ్యనున్న సముద్రతీరప్రదేశమే వేంగీవిషయము. కాని చాళుక్యులు దానిని జయించిన తర్వాత సాధారణముగ వారి రాజ్య మునకే ఆపేరు వాడుకాయెను. మొదటి రాజరాజు (౧౦౨౨-౧౦౬౩) కాలమున రచియింపబడి, అతనికే అంకిత మీయబడిన ఆంధ్రమహాభారతమున రాజమహేం ద్రవరము వేంగీదేశంబునకు నాయకరత్నంబుగ నుండినట్లు వర్ణితమైనది [ఆదిపర్వము, ౧-౭].

3. సర్కారను పదమును భూవిభాగము లేక జిల్లాయను నర్థమున వాడియున్నారు. ఈ ప్రాంతమును మహమ్మదీయు లాక్రమించినప్పటినుంచి ఉత్తరసర్కారు లను పేరు వాడుకలోనికి వచ్చెను. అప్పుడవి అయిదు సర్కారులు: అవి ఏవన, ముర్తుజానగరు, ముస్తఫా నగరు, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము. ఇవి యిప్పుడు వెనుకటిసరిహద్దుమార్పులతో గంజాం, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ, గుంటూరు లనుపేర బరగుచున్నవి. సంవత్సరమునకు ౫౦,౦౦౦ల పౌనులు శిస్తుకట్టి నిజామువారు ౧౭౬౬ లో ఈ సర్కారులను కుంపిణీ (తూర్పు ఇండియా కంపెనీ) వారి కిచ్చివేసిరి. క్రీ. శ. ౧౮౨౩ లో కుంపిణీవారు నిజామువారికి ౧౬,౫౦,౦౦౦ లిచ్చి ఆ ప్రభువు కుత్తరసర్కారులపై నుండు హక్కులను తొలగించిరి.

4. గంజాములోని యుత్తరభాగమునందలి దేశ భాష ఓఢ్రము.

5. జగ్గయ్యపేట స్థూపశాసనములు, Ind.Ant., Vol, XI, P, 286.

6. కొండముది శాసనము, Ep. Ind., Vol, VI, P. 315.

కాలంకాయన[7], పల్లవ[8], విష్ణుకుండి[9] వంశజుల శాసనములు ప్రత్యేక ప్రత్యేకముగ ఈ ప్రదేశమున చాల దొరకినవి కాని యీ వేఱు వేఱు వంశములు వేనితరువాత నేవి పాలించినవో యీ పరస్పరసంబంధమును దెలుపు కాలము మాత్రము తెలియుటలేదు. ఈ రాజుల కాలనిర్ణయమునకు గల యాధారమెల్ల వారి తామ్రశాసనములలోని లిపియే. దీని యాధారమున కాలమును తృప్తికరముగ నిశ్చయింపగాదని శాసనపరిశోధకులకు బాగుగ దెలిసిన విషయమే. ఇట్టి సందర్భములలో విష్ణుకుండి మూడవ మాధవవర్మయొక్క యీ ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనము చాల ముఖ్యమైనదని భావించుచున్నాను; ఏలయన తూర్పుచాళుక్యవంశమునందలి మొదటి ప్రభువునకు సమకాలికుడును, ప్రాయికముగ అతనిచేత జయింపబడినవాడును కాదగు విష్ణుకుండివంశపు కడపటిరాజు కాలమును సరిగా నిర్ణయించుట కిది యాధారపడుచున్నది. ఈ కాలము నాధారముగా గొని చాళుక్యులకు పూర్వము వర్ధిల్లిన చాలవంశముల కాలమును అంత కష్టము లేకుండ నిర్ణయింపవచ్చును.

## శాసనచరిత్రము

గోదావరి జిల్లా పొలమూరు గ్రామమున తూర్పుచాళుక్యవంశమునకు చెందిన మొదటి జయసింహవల్లభుని శాసనముతోపాటు ఇది భూమిలో పూడిపోయియుండగా ౧౯౧౩ లో దొరకినది. కాకినాడ వాస్తవ్యులు శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు ఒక తెలుగు పత్రిక(? ఆంధ్రభారతి) లో ఈ శాసనపాఠమును ప్రకటించియున్నారు. అటుపిదప ఈ శాసనమును ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునకు బంపిరి. తరువాత నిది మద్రాసు గౌనర్మెంటుశాసనశాఖవారి కంపబడినది. ఇది ఆ శాఖవారి ౧౯౧౩-౧౯౧౪ వ సంవత్సరపు నివేదికలో[10] ౭-వసంఖ్యగల తామ్రశాసనముగ నమోదయినది. మద్రాసు ఆంధ్రసాహిత్యపరిషత్తువారి వస్తుప్రదర్శనశాలయందు భద్రపఱుపబడియున్న అసలు శాసనమును ప్రతిబింబములతో గూడ మొట్టమొదటిమాఱు (ఇంగ్లీషులో) వివరణ వ్యాఖ్యానములతో ప్రకటించుచున్నాను.

## ఆకారాదికములు

ఈ శాసనమున నాలుగు రాగిరేకులు కలవు. ఒక్కొక్కదాని పొడవు $6\frac{3}{8}$"; వెడల్పు

7. నందివర్మ కొల్లేరు శాసనము, Ind. Ant., Vol II, P. 175; బర్నెల్ "సౌత్ ఇండియన్ పేలియోగ్రఫీ" పుట ౧౪, ప్లేటు ౨౦, ౨౧; విజయవర్మ ఏలూరుశాసనము, Ep. Ind,, Vol. IX, p. 56.

8. మైదవోలు శాసనము, Ep. Ind., Vol. VI, p. 84; చెందలూరు శాసనము, Ep. Ind., Vol. VIII, p. 233.

9. ఈపూరు శాసనము, C. P. 12 of 1919-1920; రామతీర్థము శాసనము, Ep. Ind., Vol, XII, p. 133; చిక్కుళ్ల శాసనము, Ep. Ind.,Vol, IV, p. 193: C. P. 11 of 1919-1920.

10. Ep. Reports (S.C.), 1914, p. 102, Para. 35.

2¼". ఇవి ఒక రాగి కడియమునకు తగిలించి యున్నవి. ఆ కడియము మందము ¼". రేకులును, కడియమునుగలసి దాదాపు 41¼ తులముల యెత్తున్నవి. మొదటి రేకు, చివరరేకు మిగిలిన రెండవ, మూడవ రేకులకంటె పలుచనగ నున్నవి. ఇందువలన వానిలో నచ్చటచ్చట బెజ్జములు పడినవి. మొదటిరేకు దిగువభాగమున కొంచెము పగిలినది. అందువలన ఒకటి రెండక్షరములు చెడిపోయినవి. అసలు కడియమున కతుకుకొని పోయియుండు ముద్రిక పగిలిపోయి ఎచ్చటనో పోయినది. దానిలోని చిన్న భాగముమాత్రము కడియపు కొనలలో నొకదాని కంటిపెట్టుకొని యున్నది. కడపటి చాళుక్యుల శాసనములలో వలె ఈ రేకుల కొనలు అక్షరములను గాపాడుట కంచులుగ తీర్పబడి యుండలేదు. ఇది చాళుక్యులకు పూర్వపు శాసనములయొక్కయు, మొదటి చాళుక్యశాసనముల యొక్కయు లక్షణములలో నొకటి. మొదటి పల్లవ, శాలంకాయన, విష్ణుకుండిరాజుల శాసనములన్నియు నిట్లే యుండును. క్రీ. శ. అయిదవ, ఏడవ శతాబ్దులకు మధ్యకాలపు రాగిశాసనములు పెద్దవిగను, బరువుగను నుండు కడపటి వేంగీచాళుక్య తామ్రశాసనములకు భిన్నముగ పలుచగాను, చిన్నవిగాను నుండును.

భాష.

ఈ శాసనభాష యంతయు సంస్కృతము. ౧౪-౧౯ పంక్తులలో శాసనకర్త రచియించిన శ్లోకము తక్క తక్కిన శాసనమంతయు గద్యముననే కలదు. శాసనము కడపట ౨౯-33, 3౫-౪౧ పంక్తులలో స్తుతి శ్లోకములును, వ్యాసగీతశ్లోకములును గలవు. ౨౯-33 పంక్తులలోని శ్లోకములు స్వయముగ శాసనకర్త రచియించినవో లేక ఏ శాసనములలోనుండి యైనను, గ్రంథములలో నుండి యైనను తీసికొన్నవో తెలియదు. సంస్కృతపద్యరచనము, గద్యరచనము శాసనకర్తకు క్రొత్త యని తోచును. ౧౪-౧౯ పంక్తులలోని అనుష్టుప్ శ్లోకమున సాహిత్యగుణము ఏదియు నున్నట్లు కనిపింపదు. అందువలన ఏదో 'బంధము'కాని లేక ఏదో చారిత్రకవిషయము కాని తెలుపుటకది యుద్దేశింపబడలేదుకదా యని సంశయము కలుగుచున్నది. దానినిగురించి పెక్కుమంది విద్వాంసులను సంప్రతించినప్పటికి అందు గూఢార్థమున్నట్లు నా కేదియు పొడకట్టలేదు.[11] ౨౯-3౧పంక్తు

11. ఈ పైభాగము వ్రాసిన పిదప ఈ శ్లోకములోని గూఢార్థమును దెలిసికొనుటకు తోడ్పడు నొక యభిప్రాయము తట్టినది. ఈ యూహ సరియైన దగునో కాదో యని ఇంకను నాకే యనుమానముగ నుండుట వలన దిగువ "ఫుట్‌నోటు"లో దానిని తెలుపుచున్నాను. కైశవం సత్త్వం, ఐందవం కాంతిం, విక్రమాదాప్త భూరిభూః అను పదములలో శ్లేష కలదని నా యనుమానము. విక్రమ మనగా పరాక్రమమునో, విక్రమనామాంకితుడైన రాజును. మూడవ మాధవవర్మకు సమకాలికుడైన చాళుక్య మొదటిపులకేశి భూపతికి రణవిక్రమ డను బిరుదము కలదు. రెండవ పులకేశి అయ్యావళి (Aihole) శాసనమునుబట్టి అతనితాతయైన మొదటిపులకేశి వాతాపి జయింపక పూర్వము ఇందుకాంతి యను నగరమున నుండినట్లు తెలియుచున్నది (శ్లో. ౭) [ఇండి.

లలోని మొదటిశ్లోకమున అనుష్టుప్‌చరణమున నుండవలసిన వానికంటె ఒకమాత్ర ఎక్కువగ నున్నది. ౩౦-వ పంక్తిలో "శ్రేయా కీర్తిః" అనునది "శ్రేయఃకీర్తిః" అనియు[12], "మహామాత్ర యోధయో స్తేషాం" అనునది "మహామాత్ర యోధయో స్తయోః" అనియు నుండవలెను.

## లిపి

లిపి క్రీస్తుశకము ఆఱేడు శతాబ్దులలో తూర్పుతీరమున వాడుకలోనుండిన తెలుగు కన్నడ లిపి. ఇది నాలుగైదు శతాబ్దులనాటి శాలంకాయనుల 'వేంగీలిపి' అని "బర్నెలు[13]" పేరు పెట్టిన లిపియొక్క క్రమపరిణామమును సూచించుచున్నది. ప్రాయికముగ నిది 'ఇండిషీ పేలియోగ్రఫీ' అను గ్రంథమున "బూలరు" "కన్నడ-తెలుగు లిపియొక్క ప్రాతవడ్డ రూపము" ("ఆర్కాయిక్ వెరయిటీ ఆఫ్ ది కెనరీస్ అండ్ తెలుగు ఆల్ఫబెట్"—౧౨, ౧౩, ౧౪, ౧౭ కాలములు—ఏడవప్లేటు) అని చెప్పినదాని కడపటి పరిణామమే. ఆదాం యుద్దేశప్రకార మిది వేంగీచాళుక్యులలోని మొదటి ఇరువురు ప్రభువుల పరిపాలనాంత్యకాలమువఱకు వాడు

అంటి. సం ౮, పు ౨౩౯ లో ఈశ్లోకమునకు ఫ్లీటు దొర యిచ్చిన యర్థమును, "ఆర్క్యియలాజికల్ సర్వే ఆఫ్ వెస్టరన్ ఇండియా" అను గ్రంథము, మూడవ సంపుటము, పుట ౧౩౬లో బర్గెస్‌దొర యిచ్చిన యర్థమును జూడుడు]. "కైశవం సత్త్వం" అనగా విష్ణువు యొక్క బలము అనికాని లేక గిరిదుర్గమైన హరివత్స కోట యనికాని యర్థము కావచ్చును. సత్త్వమునకు సంస్కృతమున గిరియనికూడ అర్థము కలదు (?). ఎవరో యొక జయసింహుడను నతడు ఆకోటకు సైన్యాధిపతి యని ఉండివాటికశాసనమున గలదు (Ep. Ind. Voi, VIII, p. 163; Ind. Ant., Vol XXX' p. 514). డాక్టర్ డుబ్రాయిల్ (Ancient History, p. 111) అన్నట్లు ఈజయసింహుడు రణవిక్రమ బిరుదాంచితుడైన మొదటి పులకేశి తాతగారైనయెడల ఈ కోట పులకేశి స్వాధీనముననే యుండి యుండవలయును. నే ననునట్లు ద్వంద్వార్థమే యున్నయెడల, అఱువది సంవత్సరములకు పైగా రాజ్యమేలిన మూడవమాధవవర్మ మొదటిపులకేశికిని, రెండవపులకేశికిఁగూడ సమకాలికుడుగ నుండెననియు, అతడు రణవిక్రమ మొదటి పులకేశినుండి ఇందుకాంతినగరమును, గిరిదుర్గమైన హరివత్సకోటను దీసికొనెననియు ఆశ్లోకమువలన స్ఫురించును. మాధవవర్మ మామగారి త్రిపురనగరము జబ్బల్‌పూరుజిల్లాలో తేవారయి యుండవచ్చుగావున, మాధవవర్మ ఎప్పటనో జబ్బల్‌పూరు ప్రాంతమున మహాదేవపర్వతములలో నుండెననబడు హరివత్సకోట నెట్లుసాధించెనని యనుమానింప నవసరము. అది అసాధ్యము కాదు. చాళుక్యులపై తనమామగారైన చేదివంశపురాజునకు సాయమరిగినప్పుడో లేక స్వతంత్రముగనో వెళ్లి మాధవవర్మ యీ గిరిదుర్గము సాధించియుండును. అయినను నేను చెప్పు దాని కొక్కయాక్షేపము కలదు. ఫ్లీటు, బర్గెస్ దొరలు ప్రకటించిన పిదప అయ్యావలిశాసనమును డాక్టరు కీల్‌హారన్ దొర మరల ప్రకటించినప్పుడు (Ep. Ind, VI) అతడు తన ఆంగ్లేయానువాదమున ఇందుకాంతిపదమునకు ద్వంద్వార్థము చేయలేదు.

నాకిందు గొన్నిటికి ద్వంద్వార్థములను ప్రొఫెసరు పిషోలిగారు సూచించిరి.

12. [మూలమున అసలు శ్రేయఃకీర్తి అనియే కలదు గాని 'శ్రేయాకీర్తి' యని లేదు ఇప్పటి జిహ్వామూలీయపు గుర్తు వలన దెలుపబడినది. —మ. సో. శ.]

13. Burnell's South Indian Palaeography, 2nd Ed., p. 16 and plate 1.

కలో నుండెను. పరిమాణమున చిన్నవిగ నున్న యీ ప్రస్తుత శాసనాక్షరములు—శాసనమును చెక్కినవాడు అచ్చటచ్చట కొంత అజాగ్రత కనబఱిచినప్పటికి—బాగుగ చెక్కబడి సుస్థితి నున్నవి. ఇవి 'గుండ్రఖత్తు' అక్షరములు: పృథివీమూలుని గోదావరి[14], ఇంద్రభట్టారకవర్మ రామతీర్థము[15], రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల[16] శాసనములలోని యక్షరములను బోలియుండును. వీటిని కుబ్జ విష్ణువర్ధనుని చీపురుపల్లి[17], తిమ్మాపురం[18] శాసనాక్షరములతో గూడ పోల్చవచ్చును. మన శాసనమునందలి కొన్ని యక్షరములు పై నుడివిన రెండుతెగగతుల శాసనములలోని యక్షరములకు మధ్యస్థమైన పరిణామమును సూచించుచున్నవి. ఈ శాసనమున సంఖ్యా సంకేతము లైదు కలవు. నాలుగు రేకుల మీదను వరుససంఖ్య లుండుటవలన ఒకటి మొదలు నాలుగవఱకు సంఖ్యలు కలవు. నాలుగవ రేకు చివర రాజుయొక్క విజయ రాజ్య సంవత్సరము ౪౮ కలదు. మొదటి రెండుసంఖ్యలు డాక్టరు బర్నెల్ ౨3-వ "ప్లేటు"లో నిచ్చిన వేంగీపల్లవసంఖ్యలవలెనే యున్నవి. మూడవసంఖ్య తెలుగులో ఇప్పుడు వ్రాయు అచ్చు ౩ వలె నున్నది. నాలుగవ సంఖ్య ఆకృతి శిలువ (†) మాదిరి నున్నది. ఈ సంకేతము అశోకలిపిలోను, పూర్వగుహా లిపిలోనుగూడ కనబడును. ఇక చిట్టచివరి ౪౮-వ సంఖ్య ౪౦ సంఖ్య సంకేతమును, ౮ సంఖ్య సంకేతమును కలియ జేర్చుటచే తెలుపబడినది. ౪౦ సంఖ్యాసంకేతము పశ్చిమ గుహాలిపిలోను, ౮ సంఖ్యాసంకేతము చిక్కుళ్ల శాసనములోను గాననగును.

## వర్ణక్రమము

ఈశాసనమున వర్ణక్రమమునకు సంబంధించిన విశేషములు కొన్ని కలవు. వర్గవిషయే (పం. 3), విషయ్యే (పం. ౧౯) అను పదములు వర్గ్గే (పం. 3) గాను, విషయ్యే (పం. ౧౮)గానుకూడ వ్రాయబడినవి. వర్మణ (పం. ౬-౭లు) పదమున 'మ'కు ద్విత్వము లేదు కాని శర్మ్మణ (పం. ౨౨-౨3 లు) అనుపదమున 'మ' కు ద్విత్వము కలదు. 'అప్ప్రతిహత' (పం. ౧) లో పవర్ణద్వయము కలదు; శౌర్యౌదార్యపదము శౌరియౌదార్య్య (పం. ౧౦)గా వ్రాయబడెను. అనుస్వార మెక్కడకప్పుడు దానికిసంబంధించిన యక్షరమునకు తరువాతిదానిమీఁద నుండుట కలదు (పం.౪౦). లేఖకు డొక్కొక్కప్పుడు అనుస్వారమును—సంస్కృత వ్యాకరణము ప్రకారమట్లు మారని పట్టులగూడ—'మ'కారపు పొల్లుగా మార్చుచున్నాడు: ఉదా: పరదత్తాం వ్వా (పం. 3౭). ౬-వ పంక్తిలో ప్రియతనయః అనునది 'ప్రియతనయ' గాను, 3-వ పం

14. J. Bo. B. A. S. Vol. XVI p. 114.
15. Ep. Ind. Vol. XII, p. 133.
16. Ep. Ind. Vol. IV, p. 193.
17. Ind. Ant. Vol. XX, p.16; Burnell's S. I. Palaeography, 2nd ed., plate XXVII.
18. Ep. Ind. Vol. IX, p. 318.

క్తిలో వృద్ధ అనునది వ్రిద్ధగాను వ్రాయబడినవి. వర్ణక్రమమునం గల యీ తాళు మాటలనుబట్టి ఆఱవశతాబ్దియంతటి పూర్వకాలముననే సంస్కృతపు అచ్చయిన 'ఋ'కు దాని అజంతస్వరము పోయినట్లును, దానిని సరిగా 'రి'వర్ణమువలెనే ఉచ్చరించుచుండినట్లును ఊహింపనగును. పితృపదము ౧౭-వ పంక్తిలో పిత్రుగా వ్రాయబడినది. ప్రస్తుతము ఋ అను అచ్చునకు ఉత్తరహిందూదేశమునను, దక్షిణహిందూదేశమునను రెండు భిన్న స్వరములుకలవు. ఉత్తరహిందూదేశీయులును, బంగాళీలును దానిని 'రి'గా ఉచ్చరించెదరు. దీనిని గౌడోచ్చారణ మనవచ్చును. మహారాష్ట్రులు, కన్నడులు, తెలుగులు, తమిళులు —ఈ దక్షిణహిందూదేశవాస్తవ్యులు దానిని 'రూ'గా నుచ్చరించెదరు. ఇది యీస్వరము యొక్క ద్రావిడోచ్చారణ మనవచ్చును: మనశాసనమున పితృ అనునది పిత్రుగ వ్రాయబడుటవలన దక్షిణమున నీ యచ్చుకు స్వరము మారుట కదియే యారంభమని మన శాసనము సూచించుచున్నది. ఈ శాసనమున ఈ యచ్చుకు గౌడ, ద్రావిడోచ్చారణములు రెండును గలవు. ప్రాయికముగ పండితులు గౌడస్వరశాస్త్రమునననుసరించుచుండ ఇతరులు (పండితులు కానివారు) వారి యిచ్చవచ్చినట్లు దాని స్వరమును మార్చుచుండిరేమో.

శాసనవిషయము

దాతయైన మాధవవర్మ గోవిందవర్మ యొక్క ప్రియపుత్రుడు (పం. ౬). విష్ణుకుండి విక్రమహేంద్రవర్మపౌత్రుడు (పం. ౪). ఈవిక్రమహేంద్రవర్మ శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుడు (పం. ౧) సామంతరాజులనేకులను జయించినవాడు (పం. ౨). గోవిందవర్మ అనేక యుద్ధములలో జయమును పొందినవాడు. ఇతనికి విక్రమాశ్రయబిరుదము కలదు (పం. ౬). మాధవవర్మ ప్రసిద్ధికెక్కిన గొప్పవీరుడు (పం. ౬-౭లు). ఇతడు త్రివరనగరభవనగతయువతీజనవిహారణరతుడు. వేయిక్రతువులను జేసినవాడు. పదునొకండు అశ్వమేధయాగములను జేసెను (పం. ౧౨) అనేక సుగుణసంపన్నుడు (పం. ౯-౧౧లు). హిరణ్యగర్భప్రసూతుడు (పం. ౧౨). ఇతనికి జనాశ్రయబిరుదము కలదు. ఇతడు తన విజయరాజ్యము ౪౮-వ సంవత్సరమున (పం ౪౧) తూర్పుదిక్కున నున్న దేశములను జయించవలెనుకోర్కెతో దండువెడలి గోదావరినదిని దాటి (పం. ౫౨-౨౨) గుద్దవాదివిషయములోని పులుంబూరు[19]

19. గ్రామము పేరు మూలమున 'పులొంబూరు' అని కలదుగాని 'పులుంబూరు' అని లేదు. అందువలన 'పులుంబూరు' పాఠము సరియైనదికాదు. ఈ శాసనముతోపాటు పొలమూరిలో దొరకిన చాళుక్య మొదటి జయసింహవల్లభుని శాసనమును ఆర్. సుబ్బారావు (ఎమ్. ఏ., ఎల్. టి) గారు ఆంధ్రచరిత్రపరిశోధకసంఘమువారిపత్రిక నాలుగవసంపుటమున (పు. లు ౭౨-౭౬) ప్రకటించి యున్నారు. వారచ్చట ఈ గ్రామనామమును 'పులింబూరు'గ జదివియున్నారు. 'లి' రూపము జయసింహుని శాసనమున ౩౬-వపంక్తిలో 'పాలితా'లో

గ్రామమును నాలుగునివర్తనముల క్షేత్రముతో గూడ కమ్మరాష్ట్రములోని కుందూరు గ్రామము వాస్తవ్యుడును, యజుర్వేద తైత్తిరీయశాఖకు సంబంధించినవాడును, గౌతమ సగోత్రుడును అగు శివశర్మకు (పం. ౨౨-౨౪) దానము చేసెను. ఇతడు నాలుగు వేదములను జదివినవాడు: దామశర్మ కొడుకు: రుద్రశర్మ మనుమడు. ఫాల్గుణ పౌర్ణమి సోమగ్రహణ సమయమున (పం. ౨౪-౨౮ లు) మూడవ మాధవవర్మ ఈ దానము చేసెను. ఈ ధర్మమునకు 'ఆజ్ఞప్తి'. హస్తికోశ, వీరకోశులు. ప్రతిగ్రహీత కీదానానుభవమున ఎవరివల్లను బాధకలుగకుండ జాగ్రత తీసికొనవలసినవారు వీరు (పం. ౨౮-౩౮ లు).

## స్థలనిర్దేశము

దాదాపుగ శాసనమున వచ్చు స్థలములనన్నిటిని సులభముగనే గుర్తింపవచ్చును. దానము చేయబడిన పులుంబూరు[19] ఇప్పటి పొలమూరు గ్రామము. ఈ గ్రామముననే ఈ శాసనమును, ఇందలి దానమును స్థిరపఱుచుచు మొదటి జయసింహుడిచ్చిన శాసనమును—రెండును గలసి యొకచోటనే భూమిలో కప్పడియుండగా దొరికినవి. ఈగ్రామము గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకాలో గోదావరినది కుత్తరమున ఆనది పాయయైన తుల్యభాగతీరమున నున్నది. గోదావరి కనకట్ట కట్టిన పిదప ఈ తుల్యభాగ మురుగుకాలువగ మారిపోయినది. మన శాసనమున మైందవాటకి (పం. ౨౦) అను పేరుగల యొకగ్రామము వచ్చును. ఇది పొలమూరు దక్షిణపు సరిహద్దు నంటియుండు నిప్పటి మహేంద్రవాడగ్రామము కావచ్చును. శాసనమున పులుంబూరు[19] దళియవావి తీరమున నున్నట్లు చెప్పబడినది. ప్రాయిక

గాంచనగును. 'పులింబూ'రని చదువబడిన దానిలోని ద్వితీయవర్ణ రూపమును, 'పాలితా'లోని ద్వితీయవర్ణ రూపమును, పరస్పరము భిన్నముగ నుండుట చూడనగును. జయసింహవల్లభుని ఈ శాసనమునే శ్రీమాన్ వి. రంగాచార్యులు (ఎమ్. ఏ., ఎల్. టి)గారు 'ఎపిగ్రాఫియా ఇండికా' (సంపుటము ౧౯, పుటలు ౨౫౪-౨౫౭) లో ప్రకటించియున్నారు. వారు దీనిని 'పులిబూంరు'గ చదివిరి. ఈయనుస్వారము 'లి'కి సంబంధించినది కాని 'బూ'కు సంబంధించినది కాదు. ప్రాచీనశాసనములలో ఏ యక్షరమునకు సంబంధించిన యనుస్వారము ఆ యక్షరముమీదగాక దాని తరువాతియక్షరముమీద నుండుట గాంచనగును. దీనికి గారణము లేకపోలేదు. ప్రాచీన వర్ణక్రమము ప్రకారము ఈపేరును 'పులొమ్బూరు' అని వ్రాయవలసి యుండును. 'మ్బూ' లోని అనునాసికమైన 'మ'యే కాలక్రమమున అనుస్వారముగ మారినది. అట్లగుటంజేసి యది కొంతకాలమువఱకు 'మ' స్థానమున 'బ'కు పైననే చూపబడుచుండెడిది. అనునాసికములే కాలక్రమమున అనుస్వారములుగ మారుటచేత, ప్రాచీనశాసనములలో ఏయక్షరమునకు సంబంధించిన యనుస్వారములు ఆయక్షరముమీదగాక దాని తరువాతి యక్షరముమీద (ఇప్పుడు నాగరిలో వలె) ఎగువ నుండుట కిదియే కారణము. రానురాను ఎగువనున్న యనుస్వారము దానికి సంబంధించిన యక్షరము ప్రక్కకు చేరినది. 'పులొంబూరు' పాఠమే కాని, 'పులింబూరు', 'పులిబూంరు'పాఠములు సరియైనవి కావు. 'లొ' రూపమును స్పష్టముగ ఈ శాసనమునందలి ౩౧వ పంక్తిలో 'లొభేన' పదమున జూడనగును. ప్రాచీన శాసనముల హ్రస్వ, దీర్ఘములు ఒ,ఓలకు, ఎ,ఏలకు ఒక్కరూపమే యుండెడిది. —మ. సో. శ.]

ముగ ఆకాలమున తుల్యభాగను దేశభాషలో నట్లు పేర్కొనువారేమో. పులుంబూరు[19] గ్రామము గుద్దవాది విషయములోనిదిగ జెప్ప బడినది. రామచంద్రపురము తాలూకా దాక్షారామములోని అసంఖ్య శాసనముల వలన ఆగ్రామము గుద్దవాదినాటిలో[20] నుండి నట్లును, పండ్రెండు, పదుమూడు శతాబ్దుల లో ఈనాడు గంగగొండచోడవలనాటిలోని యొక విభాగముగ నుండినట్లును తెలియు చున్నది. ఇట్లే కోరుమిల్లి[21] శాసనమువలన ఇప్పుడు రామచంద్రపురంతాలూకాలోనున్న కోరుమిల్లిగ్రామము ప్రాచీనకాలమున గుద్ద వాది విషయములోనిదని తెలియనగును. ఇట్లే మల్లిదేవునియొక్కయు, మన్మసత్య భూపతియొక్కయు పిఠాపురముశాసనము[22] గుద్దవాదివిషయములోని ఒదియూరనుగ్రామ ము నొకదానిని పేర్కొనుచున్నది. ఇది రామ చంద్రపురం తాలూకాలోని యిప్పటి ఓదూ రే. కావున రామచంద్రపురం తాలూకాలోని చాలభాగము ప్రాచీనకాలమున ఆఱుశతాబ్దు లుపైవఱకు గుద్దవాదివిషయ మనుపేర బర గుచుండెనని నిశ్చయింపవచ్చును ; కాని యీ గుద్దవాదివిషయమును, కృష్ణాజిల్లా గుడివా డకు చుట్టుప్రక్కలనుండిన ప్రాచీన గుద్రాహార లేక గుద్రాగవిషయమును వేఱని తెలిసికొన వలెను.[23] మన శాసనప్రతిగ్రహీత కమ్మరాష్ట్ర ములోని కుండూరు వాస్తవ్యుఁడు. కమ్మరాష్ట్ర ము దక్షిణ హిందూదేశశాసనములలో చాల ప్రఖ్యాతి కెక్కినది. ఇప్పటి నెల్లూరుజిల్లాలోని యుత్తరభాగమును, గుంటూరుజిల్లాలోని కొంత భాగమును గలసి ప్రాచీన కమ్మరాష్ట్ర మగు చున్నది.[24] ప్రతిగ్రహీత నివాసస్థలమైన కుండూ

20. Ep. Rep. (S. C.) 1894 p. 5.

21. Ind. Ant. Vol. XIV, p. 53.

22. Ep. Ind. Vol. IV, p. 83,

23. [గుద్దవాది విషయమునకును గుద్రవార (గుద్రహార) విషయమను పేరుండినట్లు వెలనాటి పృథివీశ్వరుని పిఠాపురముశాసనమునందలి యీక్రిందిశ్లోకమువలన నూహింప నవకాశ మున్నది.

'తత స్సాహాయ్యసంతుష్టః కుడ్యవర్మమహీభృతే,
విమలాదిత్యభూపాలో గుద్రవారద్వయం దదౌ.'

తనకు వెలనాటి నృపతియైన కుడ్యవర్మ చేసిన సాయమునకు సంతుష్టుడై విమలాదిత్య భూపాలు డతనికి గుద్రవారద్వయమును (గుద్రవార మను పేరు గల విషయములను రెంటిని) ఇచ్చెనని దానియర్థము. గుద్రహార మన బరగిన విషయము గుడివాడప్రాంతపు దొకటి తెలియుచునే యున్నది గనుక ఆపేరేగల రెండవ విషయము గుద్దవాదియై యుండునని తోచుచున్నది. కాని రామచంద్రపుర ప్రాంతమునకు గుద్రవార మనునది కాక గుద్దవాది యను పేరే రూఢిపడినట్లు శాసనములవలన స్పష్టమగుచున్నది. పైశ్లోకమున గుద్రవారములోని వారము 'హారము' యొక్క రూపాంతరమే. హార మను నది కడుప్రాచీనకాలమున దేశవిభాగమునకు పేరు. ఉదా: సాతివాహనిహారము: కూదూరహారము. ఈ కడపటి కూమారహారమే గుద్రాహారమై తుదకు గుద్రాహార మయ్యెను. కాలక్రమమున నీ 'హారము' అసలు పదమున జేరిపోయి, దేశవిభాగమని యర్థమిచ్చు విషయము కూడ దీనికి చేర్చి వ్యవహరింపబడుచువచ్చినట్లు శాసనములవలన దెలియుచున్నది. దానంజేసియే యది గుద్రాహారవిషయ మయ్యెను. గుద్రాహారమే గుద్రవార (గుద్రవార) విషయము. పావునవార విషయముకూడ నిట్లేర్పడినదే.

—మ. సో. శ.]

24. Ep. Ind. Vol. XV, p. 250.

డు గ్రామ మెచ్చటిదో సరిగాచెప్పలేము. సత్తెనపల్లి తాలూకాలో ఒక కొండూరు కలదు. గుంటూరుజిల్లా తెనాలి తాలూకాలో పెదకొండూరని ఇంకొక గ్రామము కలదు. ఈకడపటి గ్రామమున కొండూరిని పేర్కొను పండ్రెండవ శతాబ్దినాటివి కొన్ని శాసనములును[25], కొండూరిస్థలమును పేర్కొనుపదునాలుగవశతాబ్దినాటి యొకశాసనమును[26] గలవు. మన శాసనమున రాజు "త్రివరనగరభవనగత పరమయువతీజన విహారణరతు" (పం. ౯-౧౦లు) డని వర్ణింపబడెను. మధ్యపరగణాలలోని (జబ్బల్‌పూరు జిల్లా) తేవారే (Tewar) ఈ త్రివర నగరమని నా యనుమానము. తేవార్ ఒకప్పుడు చాల ప్రసిద్ధి గాంచిన పట్టణము: అది చాలకాలమువఱకు చేదిరాజులకు రాజధానిగ నుండెను. జనరల్ కన్నింగ్‌హామ్‌దొర తన "ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా" అను గ్రంథము ౯-వ సంపుటమున[27] ఈ చేది లేక కలచురిరాజుల అనుస్యూత చారిత్రమును వ్రాసియున్నాడు. అభోనా[28], సర్సబ్నీ శాసనము[29]లవలన ఈరాజులనుగుఱించి మనకు మఱికొంత స్పష్టమయిన సమాచారము తెలియుచున్నది. క్రీ. శ. ౫౯౫ నుండి పరిపాలించిన శంకరగణభూపతియో లేక ప్రాయికముగ నొకవేళ అతనితండ్రి కృష్ణరాజో మన మూడవ మాధవవర్మ మామగారై యుండవచ్చును. చిక్కుళ్ల శాసనమునసుసరించి విష్ణుకుండి వంశజులకు వాకాటకనృపతులకు సంబంధ బాంధవ్యములు కలవని తెలియుచున్నది. అందు మొదటివిక్రమేంద్రవర్మ విష్ణుకుండి వాకాటవంశద్వయాలంకృతజన్ము డని వర్ణింపబడెను. దీని ననుసరించిచూడగా అతనితండ్రి వాకాటకవంశజయైన రాజకుమారిని పెండ్లియాడినట్లు స్పష్టమగుచున్నది. కన్నింగ్‌హాము దొరగారి దేశపటముప్రకారము[30] వాకాటక రాజ్యము చేదిరాజ్యము వంటి దానికి సరిగా దక్షిణమున నున్నది. క్రీ. శ. ౫౦౦ ల ప్రాంతమున వాకాటకరాజ్యము పడిపోయిన తరువాత ఆదేశమును చేదిరాజు లాక్రమించుకొని, మఱియొకశతాబ్దివఱకు దానిని పరిపాలించి యుండవచ్చును. ఈ కాలముననే కావచ్చును విష్ణుకుండి ప్రభువులతోపాటు వారును ఏకకాలముననే పశ్చిమ చాళుక్యుల వలన నిర్జింపబడి యుందురు. కావున మధ్యహిందూదేశమున రాజ్యమేలుచుండిన బలవంతములైన రాజవంశములతో విష్ణుకుండి ప్రభువులు సంబంధబాంధవ్యములను గలుపుకొనుచుండిరని యూహింపవచ్చును. బలవంతులైన యీ వాకాటకరాజుల తోడ్పాటున వారు నాలుగవశతాబ్ది యారంభమున ఆంధ్రదేశ సముద్రతీరస్థ దేశములను జయించి పిదప చేదిరాజుల సహాయముతో వాటిని నిల

25. Ep. Rep, (S.C.) 695, 696 of 1921.
26. Ibid, No. 715.
27. P. 112.
28. Ep. Ind. Vol, VI, p, 294,
29. Ep. Ind, Vol. VI, p. 295.
30. Arch. Sur. of India, Vol. IX, map at the end,

పెట్టుకొని యుండవలెను. ఆఱవశతాబ్ది కడపటి భాగమున పరాక్రమవంతులైన పశ్చిమ చాళుక్యులు ఈ చేదిరాజులను, విష్ణుకుండి ప్రభువులను గూడ తుడిచివైచిరి.

### మాధవవర్మ విజయములు

మూడవ మాధవవర్మ ప్రాగ్దిశను జయింపవలయునను తలంపుతో గోదావరినదిని దాటినట్లును, అప్పుడు అత డీదానమును జేసినట్లును (పం. ౨౨) మన శాసనమున గలదు. ఇందువలన ఆతడు ఈశాన్యదిశకు అనగా కళింగదేశముపై దాడివెడలెననియు, ఇప్పటి కృష్ణాగుంటూరుజిల్లాలలో ఎచ్చటనో యుండవలసిన రాజధానినుండి అతడు వచ్చుచుండెననియు నూహింపవలసియున్నది. ఇప్పటికి నీజిల్లాలలోనివారు విశాఖపట్టణము,గంజాము జిల్లాలవారిని తూర్పువారని పేర్కొనుచుందురు. చిక్కుళ్ల శాసనము[31] ననుసరించి మాధవవర్మ తాతగారైన రెండవ విక్రమేంద్రవర్మ రాజధాని వేంగి, ఏలూరు లనమీపముననున్న దెందులూరని తెలియుచున్నది. ఈశాసనము కృష్ణాజిల్లాలోను, రెండవ, మూడవ మాధవవర్మల ఈపూరు శాసనములు[32] గుంటూరు జిల్లాలోను దొరకినవి. ఇందునుబట్టి మూడవమాధవవర్మకు పూర్వము అధమము నాలుగుతరముల నుండియైనను వేంగీదేశము విష్ణుకుండిరాజులక్రిందనేయుండినట్లు నిరాతంకముగ నూహింపవచ్చును. మన శాసన ప్రతిగ్రహీతను మూడవ మాధవవర్మయే కమ్మరాష్ట్రమునుండి అంతకంటె నిస్సంశయముగ సారవంతమైన ప్రదేశమగు గుద్దవాది విషయమునకు దీసికొనివచ్చినట్లు కనబడును. ఇందువలన కమ్మరాష్ట్ర మంతయు గూడ మాధవవర్మ రాజ్యములోనిదనియే యూహింపదగును. ఈమూడవ మాధవవర్మయే పదునొకండు సంవత్సరములకు పూర్వము అనగా అతని ముప్పదియేడవ విజయరాజ్య సంవత్సరమున ఈ గుద్దవాది విషయములోని గ్రామమునే దాన మొసంగియుండెను కాన నీ విషయ మతడు తన నలువది యెనిమిదవ విజయరాజ్య సంవత్సరమున క్రొత్తగ జయించినది కాదు. కాని యీరాజు గుద్దవాది విషయాధికారుల కాజ్ఞాపించినది తన విజయస్కంధావారము నుండియే. ప్రాయికముగ నతడాకాలమున ఎడపదడప నియతప్రకారము చేయు చైత్రయాత్రలో నుండి యుండును. మాధవవర్మ ప్రపితామహుడు ఇంద్రభట్టారకవర్మరాజ్యము విశాఖపట్టణము జిల్లాలోని 'పష్ట(ట)కి' రాష్ట్రము[33]. ఆప్రాంతపు కళింగరాజ్యమెప్పుడు విష్ణుకుండి ప్రభువుల కుండునో యూడునోయన్న స్థితిలో నుండెడిది. ఏలయన కృష్ణానదీతీరమున దెందులూరినుండి ప్రాయికముగ నీతూర్పుదెస రాజ్యమును కట్టుబాటులో

31. Ep. Ind. Vol. IV, p. 193.

32. C.P. No. 12 of 1919-1920, (Ep. Coll) (S.C).

33. Ramatirtham plates, Ep. Ind Vol. XII, p. 133.

నుంచుట వారి కసాధ్యముగ నుండియుండును. అందువలన సాధారణముగ కళింగదేశాధిపతులో లేక వారి సామంతులో ఆక్రమించుచుండు నీ సముద్రతీరపు ఈశాన్యదిగ్భాగముపై ఈ విష్ణుకుండివంశపు రాజులు ప్రాయికముగ నెడపదడప దండయాత్రలు సలుపుచుండి యుందురు.

కాలనిర్ణయము

ఈశాసన కాలమును, దీని ననుసరించి మాధవవర్మయొక్క పరిపాలన కాలము ను శోంచెమించు సరిగానిశ్చయింపగలుగుట గొప్ప విషయము. ఈశాసనమును, మొదటి జయసింహవల్లభుని[34] (౬౩౩-౬౬౩) శాసనమును కలసి దొరకినవి. జయసింహవల్లభ శాసనమునందలి ప్రతిగ్రహీత మాధవవర్మ శాసనప్రతిగ్రహీత కొమారుడు. పాఠకులు రెండు శాసనములలోని ప్రతిగ్రహీతలను గుఱించిన వర్ణనను పోల్చిచూచుకొనుటకై జయసింహవల్లభ శాసనము మూలపాఠమును అనుబంధముగ నిచ్చియున్నాను. ఈ రెండు శాసనములలోని ప్రతిగ్రహీతలయొక్కయు, వారి పూర్వులయొక్కయు పేర్లు పోల్చిచూచినయెడల మాధవవర్మ గుద్దవాదివిషయములోని పులుంబూరు[19] గ్రామమును తైత్తిరిక సబ్రహ్మచారియు, గౌతమస గోత్రుడును, రుద్రశర్మ మనుమడును, దామశర్మ పుత్రుడును అయిన శివశర్మకిచ్చినట్లును, మొదటి జయసింహవల్లభుడు ఏతద్గ్రామదానము నే తైత్తిరిక సబ్రహ్మచారియు, గౌతమస గోత్రుడును, దామశర్మ మనుమడును, శివశర్మ కొడుకునుఅయిన రుద్రశర్మకు మఱల స్థిరపఱిచి నట్లును తెలియగలదు. శాసనమున రుద్రశర్మ "పూర్వాగ్రహారికు" డని, అనగా అదివఱకే యీ యగ్రహారము ననుభవించుచున్నవా డని వర్ణితు డయ్యెను. ఈ విధమున మాధవవర్మ ప్రతిగ్రహీత జయసింహవల్లభ శాసన ప్రతిగ్రహీత తండ్రియగుటవలన మాధవవర్మ జయసింహవల్లభుని తండ్రియు, వేంగీచాళుక్య వంశస్థాపకుడును అయిన కుబ్జవిష్ణువర్ధనుని కిని, అతని పెదతండ్రియు, శ్రీహర్షుని దక్షిణహిందూదేశ సుప్రసిద్ధ ప్రతిస్పర్ధియు అయిన రెండవ పులకేశికిని సమకాలికుడుగా నుండి యుండవలయును.

ఈ విధమున ఇంచుమించుగ ఆఱవ శతాబ్ది యంత్యభాగమును, ఏడవశతాబ్ది ప్రారంభభాగమును మాధవవర్మ పరిపాలన కాలమని స్థిరపఱుచుకొని దీని నింతకన్న స్పష్టముగ నిర్ణయింపగలమేమో ప్రయత్నింతము. ఈదానము ఫాల్గుణ పౌర్ణమినాడు చంద్రగ్రహణ నిమిత్తమున జేయబడినట్లు శాసనము వలన దెలియుచున్నది (పం. ౨౫-౨౭). క్రీ. శ. ౫౭౫, ౫౮౩, ౫౯౪, ౬౧౧, ౬౨౧ సం॥లలో చంద్రగ్రహణము ఫాల్గుణ మాసమున వచ్చు

34. చాళుక్యరాజుల రాజ్యకాలమునకు ఫ్లీటుదొర 'ఇండియన్ అంటిక్వొరి' ఇరువదవ సంపుటమున దెలిపిన కాలములనే గ్రహించితిని.

నను కుబ్జవిష్ణువర్ధనునిచేతనో, అతని సోదరుడు రెండవ పులకేశిచేతనో జయింపబడియుండవలసిన రాజుయొక్క ౪౮-వ పరిపాలన సం॥ముగ నుండుటచే మొదటిసంవత్సరము మరియు ముందటిది కాన దానిని త్రోసివేయవలసియుండును. క్రీ. శ. ౬౧౦ ప్రాంతమున ఏడవ శతాబ్ది ఆరంభమున ప్రాయికముగ పులకేశిచే జయింపబడిన రాజునకు కడపటి సంవత్సరము(౬౩౧) చాల తరువాతిది యగుటచేగాన దానిని కూడ త్రోసివేయవలసియుండును. కుబ్జవిష్ణువర్ధనుడు ౬౧౬ ప్రాంతమున స్వాతంత్ర్యమును ప్రకటించెనని మనకు దెలియును. మిగిలిన మూడు సంవత్సరములలోను ౫౮౭, ౬౧౨ సంవత్సరములలోని చంద్రగ్రహణములు హిందూదేశమున సూర్యుడు దిక్చక్రము (Horizon)న కగుచున్నప్పుడు సంభవించినవగుటచేత[35]అవి హిందూదేశమున గానరానివి. కావున మాధవవర్మ ఈశాసనము నిచ్చిన సంవత్సరము ఇక ౫౬౨ మాత్రమే కావలెను. శాసనకాలము ప్రాయికముగ ౫౬౨ వ సంవత్సరము ఫిబ్రవరి ౧౦ వ తేదీ కాదగును. శాసనమున చివర ఈదానము రాజుయొక్క ౪౮-వ విజయరాజ్య సంవత్సరమున చేయబడినట్లు తెలుపబడినది. కావున అతనిరాజ్యము క్రీ. శ. ౫౬౨ లో ప్రారంభమై యుండవలెను. రెండవ పులకేశి కాని లేక అతనిసోదరుడు కుబ్జవిష్ణువర్ధనుడు కాని వేంగినాక్రమించుకొనకపూర్వము జయించిన యీమాధవవర్మ విష్ణుకుండివంశజులలో కడపటివాడైయైనయెడల ఇతడు ౪౮ సంవత్సరములకు (౫౬౨-౬౧౦) తక్కువ కాకుండ పరిపాలించియుండవలెను. ఈ మాధవవర్మకు మంచణ్ణభట్టారకుడని యొక కుమారుడు కలడు[36]. తనతండ్రికాక ఒకవేళ ఈమంచణ్ణయే పులకేశిచే సంపూర్ణపరాజయము నొంది యుండవచ్చును; లేదా పులకేశివలననో, కుబ్జవిష్ణువర్ధనునివలననో తనవార్ధక్యమున మాధవవర్మ జయింపబడినను తాము నష్టపోయిన రాజ్యముకొఱకు అతని కొమారుడు మఱికొంతకాలము పోరాడుచుండియైన నుండవచ్చును. పూర్వాగ్రహార దానమును మఱల రుద్రశర్మకు స్థిరపఱుచు నీ శాసనమును మొదటి జయసింహుడు విజయస్కంధావారమునుండి యొసంగెను. పులుంబూరు[19] ప్రాంతముల మొదటి జయసింహుడు ఓడించిన శత్రువు మూడవమాధవవర్మ ప్రియకుమారుడైన మంచణ్ణభట్టారకుడగుట అసంభావితము కాదు. ఇదియే నిజమగునెడల, జయసింహుని పొలమూరుశాసన మాతని ౩౦ దవ జయరాజ్య సంవత్సరమునాటి దగుటచేతను, జయసింహుడు ౬౩౩లో రాజ్యమునకు వచ్చినట్లు మనకు దెలిసియుండుటచేతను మంచణ్ణ వినష్టరాజ్య సంపాదనమునకై అధమము ౬౩౮-వఱకైన నిరర్థకముగ ప్రయత్నించుచుండినట్లూహింపవలసి యున్నది. (సశేషము)

---

౩౫. నా కీ విషయమును డాక్టర్ యల్. డి. స్వామికన్ను పిళ్లగారు తెలిపిరి. వారు దయతో నాకా చంద్రగ్రహణములు సరిగా ఎప్పుడు పట్టినవో ఆ కాలములను నాకొఱకు గుణించిపెట్టిరి.

౩౬. మూడవ మాధవవర్మ ఈపూరు శాసనము, C. P. No. 11 of 1919-1920. దీని యాజ్ఞప్తి ప్రియపుత్రుడైన మంచణ్ణభట్టారకుడు (అస్యాజ్ఞప్తిః ప్రియపుత్రో మఞ్చణ్ణభట్టారకః). Ep. Rep. (S. C) 1920, p. 98.

౧౩

## మూలము[1]

### మొదటి రేకు : రెండవ పెడ




1. స్వస్తి భగవత్ శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతస్య విష్ణుకు[ణ్డినోఽ]ప్ర[2]
2. తిహతశాసనస్య స్వప్రతాపో(పా)పనతసామన్త మనుజపతి మణ్డలస్య
3. విరహితరిపుషడ్వర్గస్య విధి[వ*]దుపచిత త్రివర్గస్య విబుధపతిసాధ్వ శ్రీ
4. శరవీరవిభవ బలపరాక్రమస్య శ్రీవిక్ర(మ)మహేన్ద్రస్య సూనో[ః*] అనేక
5. సమరసంఘట్ట[3] విజయినః పరనరపతి మకుట మణిమయూఖావదాతచ
6. [ర*]ణ యుగళస్య విక్రమాశ్రయస్య శ్రీ గోవిన్దవర్మణః ప్రియతనయః[4] అతుల
7. [బ*]లపరాక్రమ యశోదాన వినయసంపనో[5] దశశత[6] సకల ధరణీతలనర

---

1. అసలు రేకులనుండి.

2. నాలుగవయక్షరమైన 'ణ్డి' లో దిగువ 'డ' కనబడుచున్నది. 'నో' లోని కొంతభాగము సరిగా గానరాదు.

['విష్ణుకు[ణ్డినా మ]ప్రతిహత' యని మూలమున గలదు. 'విష్ణుకుణ్డినో ఒప్రతిహత' పాఠము పొరపాటు. 'జర్నల్' లో ప్రచురమయిన యీ వ్యాసమునకు కడకింట స్వయముగ 'ప్రూఫులు' చూచుట పడనందున గావచ్చు మూలపాఠమున అందందు కొన్ని పొరపాట్లు దొర్లినవి. అయినను 'జర్నల్' లో నున్నరీతినే శాసనమూలపాఠము నిచ్చియున్నాను.— మ. సో. శర్మ.]

3. అనుస్వారము 'ఘ' మీద గాదు.

4. 'ప్రియ తనయః' అని చదువవలెను.

5. 'సంపన్నో' అని చదువవలెను. 'ప' మీద, 'నో' మీద అనుస్వారములు కలవు. 'నో' వర్ణముయొక్క దిగువభాగము కొంచెము పగిలినది. అందువలన అది 'న్నో' అగునో కాదో నిశ్చయముగ జెప్పలేము.

6 'దంశకత' అని చదువవలెను. 'శ', 'క' లు ఇంచుమించు నొక్కపోలిక నుండుటచేత లిప్యకర్త కిట్లు తప్పు చిక్కియుండును.

['వంశగత' యని లక్ష్మణరావుగారిచట దిద్దిరి. కాని యట్టి దిద్దుబాటు అనవసరముగ దోచును. 'దశశత సకలధరణీతల నరపతిః' అనగా దశశతపరిమిత సకల

## రెండవ రేకు : మొదటి పెడ



8. పతి రవసి[త[7]వివి]ధదివ్య స్త్రీవరనగర భవనగత పరమయువతి(తీ)జనవి
9. హారణరతి రన్నన్య[8]నృపతి సాధారణ దానమాన దయాదర్మ[9]ధృతి
10. మతిక్షాన్తికాన్తి శౌరియాదార్య్యై[10] గాంభీర్య్యై ప్రభృత్యనేకగుణసంప
11. జ్జనితరయ సముత్థిత భూమణ్డలవ్యాపి విపులయశో(శః) క్రతుసా
12. హస్రయాజీ హిరణ్యగర్భప్రసూతః ఏకాదశాశ్వమేధావభృథ స్నానవి
13. గతజగదేనస్కః సర్వ్వభూతపరిరక్షణచుఞ్చుః విద్వద్ద్విజగురువ్రి
14. ద్ధ[11]తపస్విజనాశ్రయో మహారాజః శ్రీమాధవవర్మా[।*] అపిచ[।*] నియమా[12]

ధరణీతలమునకు అధిపతి. దశశత మన వేయి. ఇతడు పరిపాలించినది వేంగియే. కావున వేంగిరాజ్యవిస్తీర్ణమే యీ సమాసమున దెలుపబడిన దని నా యభిప్రాయము. అనగా మాధవవర్మకాలమున వేంగిరాజ్యము (దశశతము) వేయి. వేంగి సహస్ర మని ('వేంగిగ్రామ సహస్రకం'— S. I. I. IV. No. 1158; 'వేంగీ సహస్రక్షమాధీశః'— S. I. I. VI. No. 96; ఈ కడపటి యుదాహరణము నకును, 'దశశతసకలధరణీతల నరపతిః' కిని పోలిక చూడుడు) ద్వాదశసహస్ర మని (ద్వాదశసహస్రప్రమాణ వేంగీ మండలం—గుణగవిజయాదిత్యుని సాతలూరు శాసనము, భారతి సం. ౧, పుట ౧౦౩), షోడశసహస్ర మని ('వేంగివిషయ షోడశ సహస్రావనీవల్లభ' S. I. I. IV. No. 974) చాళుక్యుల శాసనములలో గలదు. నే ననుకొనునట్లు ఈ 'దశశత......నరపతిః' అను సమాసమున వేంగిరాజ్యవిస్తీర్ణమే తెలుపబడిన యెడల వేంగిపేరు పెట్టి కాకపోయినను తద్రాజ్యప్రమాణమును దెలిపిన మొదటిశాసన మిదియే. —మ. సో. శ.]

7. 'త' చాల చెడిపోయినది కాని 'వి', 'వి' లను గుర్తింపవచ్చును.

['వివిధదివ్య స్త్రీవరనగర' అని మూలమున గలదు.—మ. సో. శ.]

8. °రనన్య° అని.

9. °ధర్మ° అని.

10. °శౌర్యౌదార్య° అని.

11. °వృద్ధ° అని

12. °నయమాశనమం° అని. మొదటి రెండక్షరములు 'ని', 'య' లు. మూడవయక్షరము కొంత చెడిపోయినను 'మే' గ గనబడును. అస లది 'మా' అయి యుండవచ్చును. నాలుగవయక్షరము 'గ', కాని యీ లిపిలో 'గ', 'శ' లు రెండు కొంచెము తేడాతో నొక్కరీతి నుండును. ఆ తేడా యేదన 'శ' వర్ణమున నొక యడ్డుగీ టుండును. అందువలన 'ని', 'శ' లు లేఖకప్రమాదము లేమో యని పైనివ్రాసినరీతిని దిద్దితిని.

## కొండవరేణు : కొండవపెద

15. గనసంసత్వం కైశవం కాన్తి మైన్దవీం[।*]ఉద్వహన్నురుభా[ః*]భాతి విక్రమా దా

16 త్తభూరిభూః[॥*] అప్యసౌ మహీతలనృపతిభాస్కరః పరమబ్రహ్మణ్యో

17. మాతాపిత్రు[13]పాదానుధ్యాతః జనాశ్రయమహారాజః గుద్దా(ద్ద)వ(వా)దివిష

18. య్యే(యే) విషయమహాత్తరా[14] నధికారపురుషాంశ్చ ఇమమర్థ మాజ్ఞాప

19. యత్య(తి।అ)స్తి[।*] విదితమస్తు వో యథాస్మాభిః గుద్దవాదివిషయే దళియ

20. వావితీరే పులుంబూరునామగ్రామః మయిన్దవాటకి దక్షిణత[ః*]సీ

21. మాన్తే చతుని|వర్తనక్ష్చ[15] క్షేత్రం యుగపత్సంప్ర[ద*]త్తం[॥*] ప్రాగ్ది[క్*]జిగీషయా ప్రస్థి

---

13. 'పితృ' అని.

14. [మూలమున 'మహాత్తరా' వని కలదు. —మ. సో. శ.

15. 'చతునివర్తనక్ష్చ' అని.

## ౧౮

## మాడవరేవు : రెండవ పేడు




22. తః గోదావరీమతితర్క[16] వేదవేదాంగవిదో రుద్రశర్మణో నప్త్రే స్వ[పితు]

23. రధికగుణాధ్యాసితతనోః[17] దామశర్మణఃపుత్రాయ శివశర్మణే గౌత

24. మసగోత్రాయ శర్మణ[18] రాష్ట్రే కుణ్డూర[19]వాస్తవ్యాయ తైత్తిరీక సబ్రహ్మచారిణే

25. వేదచతుష్టయసమామ్నాతావదాతాననాయ స్వశర్మణను

26. ష్ఠానపరాయ ఫాల్గుణ్యా(న) పౌర్ణమాస్యాం సోమరాహుసగ్రహనిమిత్తే

27. జనాశ్రయదత్త్యాం సర్వకరపరిహారేణాగ్రహారి(రీ)కృత్య సంప్ర[ద*]త్తః[।*] త

28. థా భవద్భి రన్యైశ్చ ధర్మాధిగతబుద్ధిభిః[20] పరిపాలనీయః[।*] న కై

---

16. 'గోదావరీ' లోని 'రీ' 'ర' వలె నున్నది. [మూలమున 'గోదావర మతితర్క' అనియే కలదు.—మ. సో. శ.]

17. ['గుణాధ్యాసిత తనోః' లో కడపటి 'త' దాని పూర్వపు 'త' కును, 'నో' కును దిగువ వ్రాయబడినది.—మ. సో. శ.]

18. [మూలమున 'శమ్మ' అనియే కలదు.—మ. సో. శ.]

19. [ఇచట 'ణ' క్రింద ప్రాచీనశాసనములలో నున్నచుట్టి పొట్టలో అడ్డుగీటు గీయబడు సంకేతము కలదు. కుణ్డూర ?—మ. సో. శ.]

20. 'ధర్మాధి గతబుద్ధిభిః' అని.

నాల్గవ రేకు : రెండవ వైపు

29

31

34



29. త్పిద్యాధా శగణీ యా[।*] ఆజ్ఞప్తి ద్ర్రా[21] హస్తికోశ వీరకోశౌ[।*] మహా[22]

30. మాత్రయోర్ద్వయో స్తేషాం శ్రేయః కీర్తి ర్నిదం మహత్[।*] స్వే

31. న భోగేన యుస్మాన్సి శ్యసాకా స్త్రీషు జాయతే[23][॥*] అన్యాయా

32. సముకాలేషు స్థానివ్యం శక్తితః పురా[।*] ఉపేక్షితి

33. పున ర్యస్మాన్త్ర నరకే సంముజ్జతి[।*] ఇ త్యేవ ముభయో

34. కాకా స్థిక్కృత్య[24] పరిపాల్యోత్[।*] అత్ర వ్యాసగీతా శో(శ్లో)కా[॥*]

21. [మూలమున 'ఆజ్ఞప్తిరత్రా' అని కలదు.— ము. సో. శ]

22. ఇప్పటినుండి అనుష్టుప్ శ్లోక మారంభము. కాని మొదటిచరణమున ఒకమాత్ర ఎక్కువ. 'మహా మాత్రౌ' అనుదానిని 'మామాత్రౌ'గ మార్చిన పరిహారమగును కాని యది సాధురూపముగ గనబడదు.

23. ఇచ్చట 'జాయతే' అని యుండవలెను, కాని యీమార్పుచేసిన ఛందోభంగ మగును.

24. [మూలమున 'స్థికృత్య' అని కలదు.— ము. సో. శ.]

నాలుగవ రేకు : మొదటిపెడ



35. బహుభి ర్వ్వసుధా దత్తా బహుభి శ్చానుపాలి

36. తా[।*] యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తదా ఫలం[॥*] స్వద

37. త్తాం పరదత్తాంవ్వా[25] యో హరేతి(త) వసున్ధరాం[26][।*] షష్టివర్ష[27]సహస్రా

38. ణి విష్ఠాయాం జాయతే క్రిమి[॥*] షష్టివర్షసహస్రాణి

39. స్వర్గే మోదతి భూమిదః[।*] ఆక్షేప్తా[28] చానుమన్తా చ తాన్యేవ న[ర*]క(కే) వ

40. సేత్[॥*] న విషం[29] విష మిత్యాహుః బ్రహ్మస్వం[30] విష ముచ్యతే[।*] విష మే

41. కాకినం హన్తి బ్రహ్మస్వం పుత్రపౌత్రికం[॥*] విజయ రాజ్యసంవత్సరే 48[।*]

---

25. 'పరదత్తాంవా' అని.

26. [మూలమున 'వసున్ధరాం' అని కలదు. ఇట్లే మూలమున హ్రస్వమునకు దీర్ఘమును, దీర్ఘమునకు హ్రస్వము నిచ్చినచోట్లు చాల గలవు. చూడుడు: పం. ౧౩-మహీతల నృపతి; పం. ౨౦-విష్ణవ్యాం; పం. ౨౬-పౌణ్డవాస్యాం; పం. ౨౯-కరణీయా; పం. ౩౦-వ్యసగితా.—మ. సో. శ.]

27. 'షష్టివర్ష°' అని.

28. 'ఆక్షేప్తా' అని.

29. అనుస్వారము 'ష' మీదగాక దాని తరువాతి 'వి' మీద గలదు.

30. ఇచ్చటగూడ అనుస్వారము 'స్వ' మీద గాక దాని తరువాతి 'వి' మీద గలదు.

ప్రమోదూత సం. భాద్రపదమాస భారతినుండి పునర్ముద్రితము

# విష్ణుకుండి మూడవమాధవవర్మ ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనము

కీ. శే. కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు

Bharati VIII. pp 302-315 (భారతి ౭-వ సంపుటము, ౯-వ సంఖ్య తరువాయి)

## విష్ణుకుండి వంశావళ్యక్రమ, కాలనిర్ణయములు

విష్ణుకుండి మూడవ మాధవవర్మకాలమును ప్రాతిపదికగా గైకొని ఆవంశము నందలి అంతకు పూర్వపురాజులకాలమును కొంచె మించుమించుగ నిర్ణయింపవచ్చును. పుదుచ్చేరి నివాసియగు డాక్టరు డుబ్రాయ్ దొర తన 'దక్కనుదేశ ప్రాచీనచరిత్రము'న ఈయన్వయమునకుచెందిన వారివంశావతరణికను అమర్చియున్నాడు.[37] ఆవంశవృక్షమును వేయునప్పటికి ఈవంశములోని రాజు లిచ్చిన తామ్రశాసనములు మూడుమాత్రమే కలవు. అయినను ఉన్నంతవఱ కది సరియైనదిగనే గ్రహింపవచ్చును. అటుతరువాత విష్ణుకుండిభూపతుల తామ్రశాసనములు రెండు మాత్రమే దొరకినవి[38]: ఒకటి రెండవ మాధవవర్మ యిచ్చినది[39]; రెండవది కడపటి మాధవవర్మ యొసంగినది[40]. ఈశాసనముల వలన దెలియవచ్చిన నూతన విశేషములను బట్టి డాక్టరు డుబ్రాయ్‌దొర ఇచ్చిన వంశావళికకు రెండు తరములు మొదటను, రెండు తరములు కడపటను కలుపుచున్నాను. ఫలిత మిది:

---

37. పుట ౯౦.

38. ౧౯౨౦-వ శాసననివేదిక, పుట ౯౭, పేరా ౭.

39. రెండవమాధవవర్మ ఈపూరుశాసనము; నెం 12 రు 1919-20; Ep. Ind. vol. XVII. p 334.

40. మూడవమాధవవర్మ ఈపూరుశాసనము, నెం. 11 రు 1919-20. గౌవర్నమెంటు శాసనశాఖవారు ౧౯౨౧వ సంవత్సరమున ఈపూరులో కనిపెట్టినరెండుశాసనములలో (నెం 11,12 రు—1919-1920) ౧౧-వ నెంబరు శాసనము స్పష్టముగ మూడవమాధవవర్మకాలమున కొకశతాబ్ది పూర్వపుది. కాని ౧౨ వ నెంబరుశాసనము నిస్సందేహముగ మనశాసనముకాలపుదే. ౧౨వనెంబరు శాసనము నొసంగిన మాధవవర్మ కుబ్జవిష్ణువర్ధనుని కాలమునకు పూర్వపువాడు కాడనుటకు ఆసంవత్సరపు(౧౯౨౧)నివేదికలోనే చాల గట్టిప్రమాణము కలదు. ఆ సంవత్సరపు ౯వ నెంబరుశాసనము కుబ్జవిష్ణువర్ధనుని మునిమనుమడైన మంగియువరాజు పేరిట పెద్దవాడుగనుండి నొసంగబడినది. ఈశాసనమువలన వత్సగోత్రుడును, అగ్నిశర్మమనుమడును అయిన మందశర్మ కొకగ్రామము దానముచేయబడినట్లు తెలియుచున్నది. ఇక విష్ణుకుండి మాధవవర్మ ౧౧-వ నెంబరు శాసనముచూతము. ఇందలి ప్రతిగ్రహీత వత్సగోత్రుడైన అగ్నిశర్మయే; ప్రాయికముగ ఇతడు మందశర్మతాతయై యుండవచ్చును. ఈమందశర్మ మంగియువరాజు భిక్షుడట. ప్రతిగ్రహీత్రయైన మనుమడు (మందశర్మ) దాతయైన మునిమనుమని (మంగియువరాజు)కాలమున నుండినచో ప్రతిగ్రహీత్రయైన తాత (అగ్నిశర్మ) రెండవదాతయొక్క ముత్తాత (కుబ్జవిష్ణువర్ధనుని)కంటెను పూర్వుడగుట అసాధ్యము. అందువలన ౧౯౧౯-౧౯౨౦వ సంవత్సరపు దాత మాధవవర్మ మనశాసనపు మాధవవర్మయేయనుట స్పష్టము. ఇదికాక, రెండు శాసనములలోగూడ మాధవవర్మ తండ్రి గోవిందవర్మయే. రెండుశాసనములలోను త్రివరనగరభవనగత యువతీజన మనుగుటించిన సూచన కలదు. ఇరువురు రాజులును హిరణ్యగర్భ(బంగరు ఆవుయొక్క)ప్రసూతు లనియే చెప్పబడినది. ఇరువురును సహస్రయాగములను, ఏకాదశాశ్వమేధములను జేసినవారే. ఈ కారణములవలన ఈ రెండుశాసనములలోను వర్ణితులైన రాజులొక్కరే యనుట నిస్సంశయము.

## విష్ణుకుండి వంశావతారక్రమము

మొదటి మాధవవర్మ (౩౫౭ - ౩౮౨)

౧౯౧౯-౨౦ సం రపు శాసననివేదికలోని ౧౨వ సం. శాసనము

దేవవర్మ (౩౮౨ - ౪౦౭)

రెండవ మాధవవర్మ (౪౦౭ - ౪౪౪)

రామతీర్థము శాసనము, ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౧౨ పుట. ౧౩౩.

మొదటి విక్రమేంద్రవర్మ (౪౪౪ - ౪౬౯)

ఇంద్రభట్టారకవర్మ (౪౬౯ - ౪౯౬)

చిక్కుళ్ల శాసనము, ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౪, పుట. ౧౯౩

రెండవ విక్రమేంద్రవర్మ (౪౯౬ - ౫౨౧)

ఆంధ్ర సాహిత్య పరిషత్ శాసనము

గోవిందవర్మ (౫౨౧ - ౫౪౬)

మూడవ మాధవవర్మ (౫౪౬ - ౬౧౦)

౧౯౧౯-౨౦ సం. రపు శాసన నివేదికలోని సం. ౧౧ శాసనము.

మంచన్న భట్టారకుడు (౬౧౦ - ?)

మూడవ మాధవవర్మ పరిపాలనము ప్రారంభసంవత్సరము ౫౪౬ గ గ్రహించి, సగటున తరమునకు ఇరువదియైదు సంవత్సరములచొప్పున లెక్క వేసి ఈపై వంశవృక్షము నందలి రాజుల కాలమును కొంచె మించుమించుగ స్థిరపఱుపవచ్చును. నేనీవిధమున ఆయారాజుల పరిపాలనకాలములను కొంచె మెచ్చుతక్కువగ లెక్క వేసియున్నాను. రామతీర్థము శాసనము ననుసరించి ఇంద్రభట్టారకవర్మ అధమము ఇరువదియేడు సంవత్సరములు పాలించినట్లు మనకు తెలియును కావున అతని పరిపాలనకాలపరిమితి ౨౫ సంవత్సరములకు బదులు ౨౭ సంవత్సరములుగ లెక్క వేయవలసియుండును. ౧౯౧౯-౨౦ వ సంవత్సర శాసననివేదికలోని ౧౨వ సంఖ్య శాసనము ప్రకారము అది ముప్పదియేడవ విజయరాజ్యసంవత్సరమున నొసంగబడినట్లు తెలియుచుండుటవలన రెండవ మాధవవర్మ కన్నియేండ్లు వేయవలసియుండును. ఈవంశములోని రాజులు చాలకాలము పాలించుచువచ్చినట్లు కనబడును. అందువలన సగటున తరమునకు ఇరువదియైదేండ్లచొప్పున వేసిన లెక్క అతిశయోక్తము కాదు.

ఈవంశపు మూలపురుషుఁడు

ఈవంశమునందలి రాజులకు మూలపురుషునుగ గ్రహింపదగిన మొదటి మాధవవర్మ మన లెక్క ప్రకారము ౩౫౭ నుండి ౩౯౦ వఱకు పాలించియుండవలెను. సముద్రగుప్తుని (౩౨౬ - ౩౭౫) యొక్కయు, అతనికొమారుడు రెండవ చంద్రగుప్తుని (౩౭౫-౪౧౩) యొక్కయు కాలముకూడ ఇదియే[41]. వాకాటకులలో[42] రెండవ రుద్రసేనుడును, రెండవ ప్రవరసేనుడును మొదటి మాధవవర్మకు సమకాలికులు. ఈ వాకాటకరాజులు అటు సామ్రాజ్యస్థాపకులైన గుప్తులతోను, ఇటు విష్ణుకుండి ప్రభువులతోను వివాహసంబంధమును గలిగియుండి రనువిషయమును మనము జ్ఞాపకముంచకోవలయును. రెండవ చంద్రగుప్తుని కూతురైన గుప్తప్రభావతి వాకాటకవంశజుడైన రెండవ రుద్రసేనునిభార్య[43]; రెండవ ప్రవరసేనునితల్లి. ఓక్కూల్లి శాసనమున రెండవ మాధవవర్మకొడుకైన మొదటి విక్రమేంద్రవర్మ 'విష్ణుకుండి, వాకాటవంశద్వయాలంకృతజన్మ' డని వర్ణింపబడి యుండుటంబట్టి మొదటి మాధవవర్మమనుమడైన రెండవమాధవవర్మభార్య వాకాటకరాజకుమారి యని స్పష్టమగుచున్నది. ఒకవేళ అంత సన్నిహితము కాకపోయినప్పటికి మొదటి మాధవవర్మకును, అతనితనయుడు దేవవర్మకును కూడ వాకాటకులతో సంబంధ ముండినదన్న అది అసంభావితము కాదు. ఎట్లయినను, గుప్త వాకాటకులతోడి సంబంధముమూలముననే విష్ణుకుండిప్రభువులు పైకివచ్చిరనుట స్పష్టము. మొదటి మాధవవర్మ తొలుత గుప్తుల యొద్దనో, వాకాటకులయొద్దనో సేనాధిపతిగ నుండి తన పరాక్రమముమూలమున ప్రముఖుడయ్యెనని నానమ్మకము. అతడు దక్షిణహిందూదేశ జైత్రయాత్రలో సముద్రగుప్తుని అనుసరించిన సేనాధిపతులలో నొక్కడో, లేక అతనితో చేరిన దక్షిణ హిందూదేశ సాహసికుడై యతని కళింగరాజ్య ప్రతినిధిగ వెనుక నిలిచిపోయినవాడో యైనను ఆశ్చర్యములేదు. అప్పటి కతడు చాల చిన్నవాడుగనుండి యుండవలెను; పాతిక సంవత్సరములకంటె ఎక్కువ ఉండియుండవు. మొదటి రెండుతరములవఱకు ప్రాయికముగ నీవంశమునందలి నరపతులు సామ్రాజ్యబిరుదములను ధరించి యుండరు. కళింగరాజ్యముపై గుప్తులకు అధికారముపోయిన తరువాతను, రెండవ ప్రవరసేనుని పరిపాలనానంతరము ౪౨౦-వ సంవత్సరమునుండి వాకాటకవంశము క్రముముగ

---

41. విన్సెంటు స్మిత్తుగారి 'ఎర్లీ హిస్టరీ' నుండి గుప్త రాజ్యకాలములను గ్రహించితిని.

42. స్మిత్తుగారు ౧౯౧౪-వ సంవత్సరపు ఆర్. ఏ. యస్. పత్రికలో (J. R. A. S., p. 328) ప్రకటించిన వ్యాసమునుండి వాకాటక రాజ్యకాలములను గ్రహించితిని.

43. ప్రొఫెసర్ పాఠక్‌గారి శాసనము, Ind. Ant. Vol. XLI, p. 268. ఇటీవల నిది సంపాదకీయ విమర్శతో ప్రకటింపబడినది; Ep. Ind. Vol. XV, p. 39.

క్షీణించుచువచ్చిన పిదపను రెండవ మాధవవర్మయే మొదట స్వాతంత్ర్యమును ప్రకటించి యుండునని నాయుద్దేశము. వాకాటకవంశము ఆరవశతాబ్ది ఆరంభమువఱకు పరిపాలనము సాగించుచునే యుండినను వారు విష్ణుకుండి భూపతులకు శత్రువులుగనే కాని మిత్రులుగ నుండినట్లు కనబడదు. రెండవ మాధవవర్మ తాను త్రికూటమలయాధిపతినని చెప్పుకొని యున్నాడు[44]. వాకాటక హరిసేన నృపాలుడు కళింగమును, త్రికూటమును, ఆంధ్రమును జయించినట్లు తెలుపుకొనియున్నాడు.[45]

రెండవ మాధవవర్మ స్వాతంత్ర్యమును ప్రకటించినకాలము వాకాటక చారిత్రమున ప్రాముఖ్యముగలది. పాఠక్ గారి శాసనము[46] ననుసరించి రాజ్యముచేయుటకు తగిన వయస్సురాని తన మనుమనికి ప్రతినిధిగా రెండవ చంద్రగుప్తుని కూతురైన గుప్తపద్మావతి అప్పుడు వాకాటక రాజ్యమును పాలించుచుండెను. వాకాటక రాజకీయవ్యవహారములను చక్కబెట్టుచుండినది స్త్రీయగుటంజేసి ఒకవేళ రెండవ మాధవవర్మ స్వాతంత్ర్యమును ప్రకటించి సమ్రాట్టుమాత్రమే పొందనధికారము గలబిరుదములను వహించి యుండును; లేదా పద్మావతికి సన్నిహిత బంధువు, అనగా మునుపు తెలుపబోవురీతిని ప్రాయికముగ ఆమెకూతురి భర్తయై యుండుటచేత ఆమె తనపట్ల చూపుచుండిన మంచితనమును, దయను లాభకరముగ దీసికొని స్వతంత్రుడై యుండును.

ఈ వంశమువారి బిరుదములు:

సామ్రాజ్యాధికార సూచకములైన విష్ణుకుండిప్రభుబిరుదములు నిక పరిశీలింతము. విష్ణుకుండి ప్రభువులలో కొందరు తాము సహస్రయజ్ఞములను జేసినవారమని, ఏకాదశాశ్వమేధములను జేసిన వారిమని చెప్పుకొని యున్నారు; కాని ఒక్క మాధవవర్మ నామాంకితులే యిట్టి యసామాన్య గౌరవాంచితులుగ దెలుపబడుట విచిత్రము! రెండవ మాధవవర్మ ఈపూరుశాసనమే[47] విష్ణుకుండి వంశజుల మొట్టమొదటి శాసనము. అందు రెండవమాధవవర్మ తాతగారైన మొదటి మాధవవర్మ అగ్నిష్టోమ సహస్రయాజియనియు, ఏకాదశాశ్వమేధావభృథావధూత జగత్కల్మషుడనియు వర్ణితుడయ్యెను. కాలక్రమము ననుసరించి ఈపూరుశాసనము తరువాత వచ్చునది రామతీర్థము శాసనము[48]. ఈపూరుశాసనమున మొదటి మాధవవర్మ కున్నట్టి బిరుదములే ఇందు రెండవ మాధవవర్మకును గలవు.

---

44. C. P. No. 12 of 1919-1920: Ep. Rep. 1920, p. 97.

45. హరిసేనుని అజంతా శాసనములు; Archaeological Survey of Western India, Vol. IV, pp 53, 124, 129.

46. వాకాటక రాణి ప్రభావతీ గుప్త పూనాశాసనము; Ep. Ind. Vol. XV, p. 39.

47. C. P. No. 12 of 1919—1920.

48. Ep. Ind. Vol. XII, p. 133.

అటుతరువాత చిక్కుళ్ల శాసనమున[49] ఏకాదశాశ్వమేధావభృథావధౌతజగత్కల్మషుఁడనియు, క్రమసహస్రయాజియనియు, సర్వమేధావాప్తసర్వభూతస్వారాజ్యాధిపత్యఁడనియు, బహుసువర్ణ, పౌండరీక, పురుషమేధ, వాజపేయ, యూష్య (? ఉక్థ్య), షోడశి, రాజసూయ, ప్రాధిరాజ్య, ప్రాజాపత్యాద్యనేక వివిధ క్రతు గురువరశతసహస్రయాజియనియు కీర్తింపఁబడియున్నాఁడు. మూఁడవ మాధవవర్మ రెండు శాసనములును[50] వేయియజ్ఞములను, పదునొకొండశ్వమేధయాగములను జేసినకీర్తి యతనికే యొసంగుచున్నవి. ఈవంశమున మాధవవర్మ నామాంకితులుకాని యితర భూపతు లెవ్వారు నట్టిక్రతువులను జేసినట్లు కీర్తింపబడలేదు. అశ్వమేధయాగాదులను జేసిన కీర్తి గౌరవములు ప్రత్యేకమొక్క మాధవవర్మలకు ఎందువలన నీవంశమున సంప్రదాయముగ వచ్చినవో తెలియరాదు.

ఈ బిరుదములకు మూలము

ఇన్ని యజ్ఞయాగాదులు నిజముగా జరిగినవా లేదా యన్న విషయమును గూర్చి యోచించుచో కేవలము వానిసంఖ్యయే యివి నిజముగ జరుపబడియుండవను ననుమానమునకు కారణమగుచున్నది. ఈ స్తోత్రకథలకును, ఆడంబర బిరుదములకును గల ఆధారములకొఱకు గుప్త, వాకాటక శాసనములను, అందు ముఖ్యముగ కడపటివారి శాసనములను మనము పరిశీలింపవలసియుండును.

కలియుగమున చాలకాలమునుండి ఆచరణమున లేని[51] అశ్వమేధయాగమును మరల ఉద్ధరించినవాఁడు సముద్రగుప్తుఁడు. అతని మనుమఁడు కుమారగుప్తుఁడు కూడ తాను అశ్వమేధయాగమును జేసినట్లు తెలుపుకొనియున్నాఁడు. ఈ ప్రభువులు గొప్పపరాక్రమవంతులైనప్పటికి తాము ఒక్కయశ్వమేధయాగముకంటె ఎక్కువ చేసినట్లు చెప్పుకొనియుండలేదు. కాని వాకాటకులలో ఈ డంబములు హెచ్చుగ గాన్పించును. రెండవ ప్రవరసేనమహారాజు చమ్మక్ తామ్రశాసనమున[52] మొదటి ప్రవరసేనుఁడు అగ్నిష్టోమ, అప్తోర్యామ, ఉక్థ్య, షోడశి, అతిరాత్ర, వాజపేయ, బృహస్పతిసవ, సాద్యస్కరయజ్ఞములను, నాలుగు అశ్వమేధయాగములను జేసినట్లును (అగ్నిష్టోమాప్తోర్యామోక్థ్య షోడస్యాతిరాత్ర వాజపేయ బృహస్పతిసవసాద్యస్కర చతురశ్వమేధయాజినః), అతని కుమారుఁడు మొదటి రుద్రసేనుఁడు దశాశ్వమేధావభృథ స్నానములను జేసినట్లును తెలుపబడెను. వాకాటకులకు బంధువులును, వారికి ప్రతిస్పర్ధులునైన మన విష్ణుకుండిభూపతులుకూడ ఈప్రగల్భోక్తుల విషయమున వారినే అనుకరించి యుందురు. వాకాటక రుద్రసేనుఁడు పది అశ్వ

49. Ep. Ind. Vol. IV, p. 193.
50. ఈ ప్రస్తుతపు ఆంధ్రసాహిత్య పరిషచ్ఛాసనము : C. P. No. 11 of 1919—1920.
51. Fleet's Gupta Inscriptions, No. 10, p. 44; No. 12, p. 51 etc.
52. Ibid, No. 55, p. 235.

మేధయాగములను జేసిన, విష్ణుకుండి మొదటి మాధవవర్మ పదునొకండశ్వమేధయాగములను జేసెను. విష్ణుకుండి ప్రభువుల యశ్వమేధయాగములకును, వారి దాంభికబిరుదములకును మూలము నాకిదే యని తోచుచున్నది. పరస్పరము బంధువులైనప్పటికిగూడ ఈ రెండు వంశములవారు నిజముగా ప్రతిస్పర్థులని దీని వలనగూడ దెలియుచున్నది. వాకాటకులు కాని, విష్ణుకుండిప్రభువులు కాని వారిశాసనములలో వారికి చెప్పబడిన రాజకీయబిరుదములలో దేనికిగాని అర్హులగలిగినయంతటి పరాక్రమవంతులైన భూపతులు కారని నాయభిప్రాయము. ఈయుభయవంశములవారిలో వాకాటకులు ఎక్కువ పరాక్రమవంతులనుట నిశ్చయమే కాని వారికిని సామ్రాజ్యమని చెప్పదగిన ప్రశాంత విశాలరాజ్య మెప్పుడును లేదు [53].

వారి యిష్టదైవము

తమ శాసనము లన్నిటిలో విష్ణుకుండి నృపతులు తాము శ్రీపర్వతస్వామిపాదానుధ్యాతులమని చెప్పుకొనియున్నారు. శ్రీపర్వతము మల్లికార్జును డనుపేరఁబరగు శివుని సుప్రసిద్ధాలయముగల శ్రీశైలమే. ఈ యాలయము (చిన్న రాజధానియుండలి) కర్నూలు మండలమునందుగల నల్లమలకొండల ఉత్తర పీఠభూమిమీఁద నున్నది. ఇంతవఱకు మన మెప్పుడును విష్ణుకుండి ప్రభువులను మధ్యపరగణాలలోని వాకాటకులతో ముడిపెట్టుచున్నాము. అట్లయినచో 'దక్షిణాది'కి సంబంధించని యీరాజులకు శ్రీపర్వతస్వామి యిష్టదైవ మెట్లయ్యెను? ఈప్రశ్నమునకు ప్రత్యుత్తరము ద్వివిధము.

వాకాటకులది అసలు దక్షిణహిందూదేశవంశము. వాకాటక గృహపతియు, గృహపత్నియు(వాకాటకగహపతి, గహపతిని), చేసిన దానములను దెలుపు ప్రాకృతశాసన మొకటి అమరావతిలో గలదు [54]. కావున దీని ననుసరించి క్రీస్తుశకము ప్రథమ, ద్వితీయశతాబ్దులలో తెలుగుదేశమున వాకాటకవంశ మొకటి యుండెననియైన జెప్పవలెను, లేదా వారిలో తెలుగుదేశమునకు వచ్చుచు పోవుచుండు వాడుకయైన నుండె ననవలెను. కావున వాకాటకులతో సంబంధముగల విష్ణుకుండి వంశజులుకూడ దక్షిణహిందూదేశీయులే యని చెప్పదగును.

ఒకవేళ విష్ణుకుండి వంశజులు కేవల మాంధ్రరాజులు లేయని యనుకొన్నను వారు తెలుగుదేశమున రాజ్యము సంపాదించినపిదప శ్రీ పర్వతస్వామిని తమ యిష్టదైవముగ బెట్టుకొనియుండవలెను. వారి శాసనముల ననుసరించి వేంగిదేశము చాలకాలము క్రిందటనే

53. డాక్టరు డుబ్రాయ్‌గారన్న నాకధికగౌరవ మున్నప్పటికి వాకాటకులను గూర్చిన వారి యభిప్రాయముతో నే నేకీభవింపజాలను. వారి యభిప్రాయముకొఱకు చూడుడు: వారి 'Ancient History of the Daccan', p. 71.

54. See 'Some Unpublished Amaravati inscriptions', Ep. Ind. Vol. XV. p. 267,

వారి యధీనత నుండినట్లు తెలియుచున్నది. చిక్కుళ్ల శాసనము (కృష్ణాజిల్లా) ఏలూరి యొద్దనున్న తె(ప్ర)న్దురూరు (దెందులూరు) నుండి యొసంగబడినది. రెండవ మాధవవర్మ ఈపూరు శాసనము గుంటూరుజిల్లాలో దొరకినది: అది అమరపురమునుండి యొసంగబడినది. బౌద్ధస్తూపముగల సుప్రసిద్ధమైన గుంటూరుజిల్లా అమరావతియే ఈ యమరపురమై యుండవచ్చును. శ్రీపర్వతమున కనతి దూరమున నున్న వేంగి నాక్రమించుకొనిన మొట్టమొదటి విష్ణుకుండిప్రభువు రెండవ మాధవవర్మ యనియు[55], తన వంశమున శ్రీ పర్వతస్వామి నిలువేల్పుగ మొట్టమొదట నెంచుకొల్పినదయు అతడేయనియు నా అభిప్రాయము. ఈ నాసిద్ధాంతమును ఆతని ఈపూరుశాసనమే బలపరచుచున్నది. ఈ వంశమువారి యితర శాసనము లన్నిటిలో మొట్టమొదట దెలుపబడు రాజు శ్రీపర్వతస్వామిపాదానుధ్యాతు డని పేర్కొనబడి యుండ ఈ విశేషణము ఈపూరుశాసనమున అందలి మొట్టమొదటి రాజగు మొదటిమాధవవర్మకుగాని రెండవరాజగు దేవవర్మకుగాని కాక మూడవరాజును, దాతయునైన రెండవ మాధవవర్మకు మాత్రమే కలదు. ఈ కారణమున ఏతద్వంశసంస్థాపకుడైన మొదటి మాధవవర్మ కాలమునగాని, అతనికుమారుడైన దేవవర్మకాలమున గాని ఈవంశము వారికి శ్రీపర్వతస్వామి యిలువేల్పుకాదని తెలుచున్నది. క్రీ. శ. ౪౦౦ ల ప్రాంతమున వాకాటకరాజకుమారిభర్తయైన రెండవ మాధవవర్మయే యీవంశమున శ్రీపర్వతస్వామ్యారాధనము ప్రవేశపెట్టియుండును.

గాథ

పరంపరగ శతాబ్దములనుండి వచ్చుచున్న శ్రీపర్వతస్వామినిగురించిన యొకగాథను ఈవిష్ణుకుండివంశజులకు ముడిపెట్టవచ్చునేమో చూతము[56]. గుప్తవంశజుడైన చంద్రగుప్తుని కూతురు చంద్రావతియను రాజకుమారి శ్రీపర్వతస్వామిని గామించి ప్రతిదినము నొక్క మల్లికాదామమును సమర్పించుచు తుద కాస్వామినే పెండ్లియాడినట్లు స్థలమాహాత్మ్యమున పరంపరగ వచ్చు గాథ యొకటికలదని శాసనశాఖానివేదికలో దెలుపబడినది[57]. ఈస్థలమాహాత్మ్యముల కాలము మనకు సరిగా తెలియదు: వీనిలో కొన్ని ఒక తరముక్రిందట మాత్రమే పుట్టినవి. ఇట్టి సందర్భములలో పదుమూడవశతాబ్దినాటి యొక

55. శ్రీశైలము గుంటూరుజిల్లా సరిహద్దులకు ౫౦ మైళ్లకంటె ఎక్కుడు దూరమున లేదు: గుంటూరుజిల్లాను విష్ణుకుండు లాక్రమించినట్లు మనకు దెలియును వినుకొండ గుంటూరుజిల్లా, వినుకొండ తాలూకాకు ముఖ్యస్థానము: రైలుస్టేషను. నేటికిని మహాశివరాత్రికి శ్రీశైలమున కరుగు యాత్రికుల కది మజిలీలలో నొకటి.

56. ఈసంబంధమును డాక్టరు డుబ్రాయ్ దొగగారే తమ 'Ancient History of the Daccan' (p. 73) లో మొదట సూచించిరి. చతురముగను, విచిత్రముగను జేసిన యీ సూచనకు వారు ప్రశంసనీయులు.

57. For 1914-15, p. 91.

తెలుగు కావ్యమున[58] ఈగాథకు ఆకరము దొరకుట నాకు సంతోషము కలిగించినది. ఆకావ్యమునందలి కథ యిది:

చంద్రవంశ్యుఁడైన చంద్రగుప్తజనపతి తనయ చంద్రావతియను కన్య తనతోడి సతులును దానును ఒకప్పుడు శ్రీపర్వతస్వామి కడ కరుదెంచి, భక్తితోఁ బ్రతివాసరంబును మల్లికాదామ మర్పించుచు నాస్వామిని గొల్చుచుండెను. ఇట్లుండ నొక్కనాఁడు ఆమె 'హర్షము దొలకాడ కిన్నర గంధర్వగీత ప్రకలిత సన్నుత నాద ప్రసన్నతమిాతి యతి మృదుమధుర సమంచితాలాపగతుల' 'సుమానాథు ప్రమోదానందలీల' పాడ నాస్వామి ప్రత్యక్షమై 'యిచ్చుమెయ్యది వేడుమిచ్చెద' నని పలికెను. అందులకు (తాను) 'ప్రేమమెలర్ప నర్పించిన యట్టి యీమల్లికాదామ మెల్లకాలంబు మీామాళియందున మిళితమైయుండ దయ సేయు' మని యా చంద్రావతి వేడుకొనెను. అంతట నాయుమానాథు డాదామమును దనమాళిని జాహ్నవీచంద్రమధ్యమున నుంచి యామెకోరిక దీర్చెను. ఆమల్లికాదామ మర్జున కాంతిని దెల్వాగుటంజేసి శ్రీ పర్వతస్వామి మల్లికార్జుననామంబున బ్రసిద్ధి గాంచె[59].

పదుమూడవ శతాబ్దినాటికే యీగాథ 'ఆదిమ యుగము'నాటిదని యూహింపఁబడుచుండినందున అథమ మది ఎనిమిదవ తొమ్మిదవ శతాబ్దులనాటిదైన గావచ్చును. ఇక నీపైకథలో చంద్రావతి చంద్రగుప్తునికూతురనుటకుమాఱు ఆతనిమనుమరాలని యించుక మార్పుచేయుట కంగీకరించునెడల దానికిని, విష్ణుకుండి వంశజు: చరిత్రమునకును గొంతసంబంధ మేర్పడును. అదియునుగాక కూతురికి తండ్రిపేరుపెట్టుటకంటె మనుమరాలికి తాతపేరుపెట్టుట సహజముకూడ నగును. ఇక వాకాటక రెండవ రుద్రసేనునిభార్య పద్మావతి సమ్రాట్టులైన గుప్తవంశజులలో రెండవ చంద్రగుప్తుని (క్రీ. శ. ౩౭౫-౪౧౩) కూతురని మన మెఱుగుదుము. క్రీ. శ. ౫౦౭-౫౩౫ ప్రాంతపువాడు కాదగు ననుకొన్న విష్ణుకుండి రెండవమాధవ వర్మ వాకాటక రాజకుమారిని బరిణయ మాడెనను విషయముకూడ జ్ఞాపకముంచుకొనఁదగును. ఈరాజకుమారి యెవరు? పద్మా

---

58. పాలకురికి సోమనాథవిరచితమైన పండితారాధ్యచరిత్రము. ఈకవికి పెక్కుభాషలు తెలిసియుండెను: ఇతఁడు తెలుఁగు కవిగను, కర్ణాటకవిగనుకూడ పరిగణింపబడుచున్నాఁడు. నరసింహాచారిగారి 'కర్ణాటకవిచరితె' లోను, రావుబహద్దరు కే. వీరేశలింగముగారి 'ఆంధ్రకవుల చరిత్రము'లోను ఈతఁడు ౧౩౦౧ ల ప్రాంతపువాఁడని తెలుపఁబడినది. ఈకథ పండితారాధ్యచరిత్రమున పర్వతప్రకరణమునకలదు (పుట ౩..., వరంగలు ప్రతి) ఈ తెలుగుకావ్యమును పదునైదవశతాబ్దిని గురురాజను కవి సంస్కృతమున ననువదించెను. తెలుగు కావ్యమును గ్రహింపలేని అన్యభాషలవారీగాథనుగూర్చి యాసంస్కృత గ్రంథమున చూడఁదగు. (కర్ణాటానువాదముతో గల ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారప్రతి ౧౯-౫౯) (గ్రంథ ప్రకరణము, ... శ్లో. ...౩౧.

59. ఇచట చంద్రావతి మల్లికార్జునుని వివాహమైనట్లు తెలుపబడక పూర్వ గమనింపదగినది

మఱియు నామెకూతురును నిశ్చయముగ నాతనికి సమకాలికులగు రాండ్రగుదురు కావున ఈరెండవ మాధవవర్మ వివాహమాడినది పద్మావతికి గూతురును, రెండవ చంద్రగుప్తునికి మనుమరాలును అయిన రాజకుమారినే యనియు, ఆమెకు దన తాత పేర చంద్రావతి[60] యని పేరుండెననియు నూహింపవచ్చును. ఈవాకాటక రాణి ప్రభావముననే రెండవ మాధవవర్మ శ్రీపర్వతస్వామ్యారాధకుడై యుండవలెను. ఒకవేళ గాథలో నున్నట్లు చంద్రావతి చంద్రగుప్తునికూతురే యనుకొన్నప్పటికి మాధవవర్మతండ్రి గోవిందవర్మయే యామెభర్త యనియు, రెండవ మాధవవర్మకు దన తల్లి మూలముననే శ్రీపర్వతస్వామి యిష్టదైవమయ్యెననియు తలంపవలసియుండును.

### విష్ణుకుండి శబ్దోత్పత్తి

విష్ణుకుండిశబ్దము యొక్క వ్యుత్పత్తి మనకు స్పష్టముగ దెలియదు. ఒక దక్షిణహిందూదేశపుజాతిపేరే యీవిధముగ సంస్కరింపబడినట్లు తోచును. వినుకొండ[61] యను తెలుగుపదమును పరిపాలకవంశమువారిని మెప్పించుటకుగాను పండితులు విష్ణుకుండగా సంస్కరించి యుందురనుట యసంభావితము కాదు. ఒక ప్రత్యేక యజ్ఞాగ్నిహోత్రమునకు 'విష్ణు' అనునది ఒక సాంకేతికనామము[62]. ఒకవేళ నీ విష్ణుకుండివంశజులు తాము విష్ణుకుండము నుండి యుద్భవించినట్లు చెప్పుకొని యుండవచ్చును. అట్లయిన వీరు అగ్నికులక్షత్రియులగుదురు. రెండవ మాధవవర్మ ఈపూరు శాసనమున 'విష్ణుకుండ్యధిరాజ గుణవంతులు' (విష్ణుకుండ్యధిరాజగుణవన్తౌ) 'ఆజ్ఞప్తి'గ దెలుపబడియుండుటవలన ఈరాజుల కోవకు చెందని విష్ణుకుండులుకూడ గొంద ఉండినట్లు స్పష్టమగుచున్నది. పూర్వోదాహృతసమాసములోని అధిరాజ, గుణవత్పదములు నామవాచకములనుట తెల్లమే. ఏతన్నామాంకితులైన యిరువురునుగూడ విష్ణుకుండివంశమునకు జెందినవారలే. విష్ణుకుండులకు బంధువులైన వాకాటకులది విష్ణువృద్ధగోత్రము[63]. ఇది యాంగిరసగోత్రశాఖ. ప్రాయికముగ విష్ణుకుండి ఈరాజుల గోత్రముపేరై యుండును. శాలంకాయనులవలెనే గోత్రముపేరి తమయింటిపేరుగా వీరును గ్రహించియుం

---

60. చంద్రగుప్తలోని 'చంద్ర'పదమే అసలుపేరు. ఇట్లే చంద్రావతిలోని 'చంద్ర'యే అసలుపేరు; 'వతి' యనునది స్త్రీ వాచకప్రత్యయము.

61. వినుకొండ గుంటూరుజిల్లాలలోని యొకపట్టణము. ఇచ్చటినుండి యాత్రికులు శ్రీపర్వతమునకు బయలు దేరుదురు. చిక్కుళ్ల శాసనమును ప్రకటించిన డాక్టరు హుల్ష్ దొరగారీసంబంధమును సూచించిరి.

62. మహాభారతము (కృష్ణమాచారిగారి ప్రతి), వనపర్వము, అధ్యా. ౨౨౩, శ్లో. ౧౨.

63. మహారాజ వాకాటక ప్రవరసేనుని ౧, ౨ 'సియోని' శాసనములను (Fleet's Gupta Insicriptions, p. 245), ఇతని యితర శాసనములను జూడుడు. రఘునాథ భాస్కర గోడ్బోల్ విరచితమైన 'భరతఖండాంచా ప్రాచీన ఐతిహాసికకోశము' (మహారాష్ట్రము)న విష్ణువృద్ధుడు మొదట క్షత్రియుడై పిదప బ్రాహ్మణుడైనట్లు కలదు.

డరు. కాని వ్యేప్రవరకాండలోను నాకీ గోత్రము కనబడలేదు.

ఇరువురు నిర్వాహకులు

సాధారణముగ ప్రతి తామ్రశాసనము నను ఆజ్ఞప్తియని యొకడు పేర్కొనబడును. ఈపదమును (ఇంగ్లీషులోనికి) 'ఎగ్జిక్యూటర్' అని అనువదించుట వాడుక. చేసిన దానమును సరిగా అమలు జరపి, దానిని రక్షింపవలసిన బాధ్యత ప్రాయికముగ నీ'యాజ్ఞప్తి'పై యుండును. ఈశాసనమున హస్తికోశ, వీరకోశులు ఆజ్ఞప్తులు. ఈపదములకు సరియైన యర్థమేదో నిర్ణయించుట కవకాశములేదు. ఈపేరులే పృథ్వీమూలుని గోదావరిశాసనమునను[64], మొదటి జయసింహుని ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనమునను[65] పేర్కొనబడుటవలన ఇవి మనుష్యులపేరులు కావనుట స్పష్టము. పృథ్వీమూలుని గోదావరిశాసనమును సంపాదకీయ విమర్శతో ప్రకటించిన ఫ్లీటుదొరగారి యభిప్రాయమున 'వీరిరువురును గజదళమునకును, గొప్పపరాక్రమకార్యములకు ప్రథితిగన్న వీరని కాయమునకును చెందవలసిన ధనమును జాగ్రత్తపఱచి దానిని వారికి వినియోగించు నధికారులు'. కాని 33-3౪ పంక్తులలో వీరు 'ఉభయగణౌ'— రెండు సైన్యములవారు— అని పేర్కొనబడిరి. ఈకారణమున వీరిని కేవలము సైన్యాధికారు లనుటకు వీలులేదు. సంస్కృతమున గణమునకు సాంకేతికార్థము కలదు. ౨౭ రథములు, ౨౭ గజములు, ౮౧ తురంగములు, ౧౩౫గురు పదాతులు కలసిన సైన్యమునకు గణమని పేరు (వాచస్పత్యము). కావున హస్తికోశమన గజదళమునకు జెందిన వీరనికాయ మనియు, వీరకోశమన పదాతివర్గ మనియు నర్థము చేసికొనవలసియుండును. అనుశ్రుతమైన హిందువుల చతురంగసేనలో మధ్యయుగమున రాజులసేనయందు గజ,పదాతి వర్గములు మాత్రమే యుండినట్లు కనబడును. అంతకు జాలకాలము పూర్వమే రథబలము లుప్తమైపోయెను. తురంగములు అరుదగుటవలన వానిని పశ్చిమదేశీయులు మాత్రమే వాడుక చేయువారు. కళింగము గజసైన్యములకు చాల ప్రసిద్ధి కెక్కినట్లు గన్పట్టును[66]. పృథ్వీమూలుని శాసనములో[67] కుముద (నైరృతిదిక్కు ఏనుగు), సుప్రతీక (ఈశాన్యదిక్కు ఏనుగు) అధిష్ఠితులైన రాజుల పోరాటమునుగూర్చి విందుము. మూడవ మాధవవర్మ ప్రపితామహుడైన ఇంద్రభట్టారకవర్మ శతసహస్రసంగ్రామముల నాలుగుదంతములు కల యనేకగజముల నెదుర్కొనినట్లు రామతీర్థము

64. J. Bo. Br. A. S., Vol. XVI, p. 116 (ll. 27-28): "స సర్వైవ రేవ పరిపాలనీయో విశేషేణ హస్తికోశ, వీరకోశాభ్యాం".

65. ఈవ్యాసమున కనుబంధము చూడుడు, పంక్తి ౨౨.

66. రఘువంశము, 4, ౪౦ లో కళింగాధిపతి 'గజసాధనః' అని పేర్కొనబడియున్నాడు. అంతే కాక తద్దేశాధిపతులు గజపతు లనుటయు ప్రసిద్ధమే.

67. J. Bo. Br. A. S.,Vol. XVI,p. 116.

శాసనము[68] వలన దెలియుచున్నది. కావున కళింగదేశముపై ననేకపర్యాయములు దండయాత్రలునలిపి క్రమక్రమముగా దాని నాక్రమించుచు వచ్చిన విష్ణుకుండుల సైన్యమున కళింగ గజదళ మెక్కువగ నుండెడిదని యూహింపవచ్చును. ఒకవేళ గోదావరిజిల్లాలోని యిప్పటి రామచంద్రపురము తాలూకాయైన గుద్దవాది విషయముననే ఈసైన్యములు స్థిరముగ దండువిడిసియుండిన నుండవచ్చును.

మాధవవర్మనుగూర్చిన గాథలు

ఇక శాసనములను వదలివైచి, పరంపరానుగతములైన గాథల నెత్తికొందుమేని మాధవవర్మనుగురించి తెలుగుదేశమున తరతరములుగ వినవచ్చు కథ లనేకములు కలవు. మెకంజీ సంపాదితములైన కైఫీయతులును[69], క్రీ. శ. పదునేడవ పదునెనిమిదవ శతాబ్దులలో రచియింపబడిన తెలుగుకావ్యములు సిద్ధేశ్వర చరిత్ర, సోమదేవరాజీయములును[70] కాకతీయ విజృంభణమునకు పూర్వము పరిపాలించినట్టియు, నిజాం రాజ్యమునందలి వరంగల్లుకు సమీపమున నున్న హనుమకొండ రాజులకు మూలపురుషు డైనట్టియు నొక మాధవవర్మను బేర్కొనుచున్నవి. ఈరాజు తండ్రి సోమదేవ రాజని చెప్పబడుటవలన ఇతనిని మన మాధవవర్మలలో రెండవవానితో గాని, మూడవ వానితోగాని గుర్తించుటకు వీలు కాదు. ఇతడొకవేళ మనకు తండ్రిపేరు తెలియని విష్ణుకుండి మొదటి మాధవవర్మయై యుండవచ్చును. హనుమకొండ మాధవవర్మ శాలివాహన శకము ౨౩౦ మొదలు ౩౫౧ వఱకు (క్రీ. శ. ౩౦౮-౪౨౯) నూటయిరువది సంవత్సరములు పరిపాలించినట్లు చెప్పబడినది. ఒక్క రాజు నూటయిరువది సంవత్సరములు పాలించెననుట యతిశయోక్తియే కాని మనము నిర్ణయించిన కాలక్రమము ననుసరించి మన మొదటి మాధవవర్మ సరిగా ఈకాలపువాడే యగుట విచిత్రము.

బెజవాడలోని మల్లేశ్వరస్వామి దేవాలయావరణమున కాకతీయుల కాలము నాటి (పదుమూడవ శతాబ్ది) శిలాశాసన[71] మొకటి కలదు. అందు బెజవాడ రాజయిన మాధవవర్మను గురించిన చిత్రమైన వృత్తాంతము కొంత కలదు:

కలియుగమున అత్యంత పురాతన కాలమున ౧౧౭-వ శకవర్షమున మాధవవర్మ యనుపేర బ్రసిద్ధుడైన రాజొకడుండెను. ఈతని కుమారుడు తింత్రిణీ జీవినియైన (చింతచిగురు, చింతకాయలు అమ్ముకొని జీవనము గడపు

68. Ep. Ind., Vol. XII, p. 133.

69. ఏకశిలానగరవృత్తాంతమును జూడుడు.

70. సిద్ధేశ్వరచరిత్రము, కాచ పర్వప్పకృతము. అముద్రితము: అరుదుగ దొరకును. సోమదేవరాజీయకర్త కూచిమంచి జగ్గ.ప.

71. Ep. Coll. No. 536 of 1909 (Ep. Rep. S. C.)

కొను) ఒక స్త్రీ బిడ్డను జంపినందువలన న్యాయమును పరిపాలింపగోరి రాజాతని కురిశిక్ష విధించెను. రాజుయొక్క న్యాయబుద్ధి కెంతయు సంతోషించి మల్లేశ్వరస్వామి కనకవృష్టి గురియించెను. తత్కారణమున నా స్త్రీయొక్క శిశువును, రాజకుమారునుగూడ పునర్జీవితులైరి. ఈరీతిని మల్లేశ్వరస్వామి మాధవవర్మ కీర్తి నీలోకమున సుప్రతిష్ఠిత మొనరించెను[72].

పదునైదవ శతాబ్ది నుండినట్టియు, ఒరిస్సా గజపతుల దండనాయకు డైనట్టియు తమ్మరాజు కొమారుడు బసవరాజను నతడు మాధవవర్మ వంశ్యుడని ఆతనిమంత్రి కంకితము గావింపబడిన సూళాలయునాటి రెండు తెలుగుకావ్యములలో[73] వర్ణితమై యున్నది.

బెజవాడలో ఇంద్రకీలాద్రిమీది కనకదుర్గగుడిముందున్న యొక పగిలిపోయిన స్తంభ

72. Ep.Rep-(S. C). 1910, pp 71-72.

[మాధవవర్మను పేర్కొను ఇంతకు పూర్వపుశాసన మింకొకటి కలదు. అది పండ్రెండవశతాబ్దినాటిది. ఇదియే రెండవకాకతిప్రోలరాజు అనుమకొండశాసన మను పేర బరగుచున్నది. ఇందు రెండవ కాకతి ప్రోలరాజు ప్రెగ్గడయైన బేతరసుభార్య మైలమ క్రీ. శ. ౧౧౧౭లో 'కడలలాయబసది' యను జినాలయమును గట్టించెను. దానికి మహామండలేశ్వరుడైన ఉగ్రవాడి మేళరసుకూడగొంత భూమి దాన మొసంగెను. ఈమేళరసు మాధవవర్మసంశోద్భవుడని యిట్లు తెలుపబడినది.

"అష్టాదంతి సహస్రాణి దశకోటీ చ వాజినా మనంతం పాదసంఘాతి మిత్యేతే మాధవవర్మవంశోద్భవకష్ట శ్రీమన్మహామండలేశ్వర ముగ్రవాడియ మేళరస..." దీని ననుసరించి చూచిన, మాధవవర్మ ఎనిమిదివేలయేనుగులకును, పదికోట్ల గుఱ్ఱములకును, అనంతమగు కాల్బలములకు నధిపతియని తెలియుచున్నది. —మ. సో. శర్మ.]

73. (౧) నాసికేతోపాఖ్యానము : దగ్గుపల్లి దుగ్గయ్య కృతము.

" చతురంగ బలములు జయవాడ దుర్గాంబ వరమునం బడసి దుర్వారలీల
జగతీస్థలంబెల్ల సాధించి జయ శాసనములు దిగ్దంతిపంక్తుల సలిపి
పేదబాలునకుఁగాఁ బ్రియసుత మోహంబు పట్టక బెజవాడఁ బాడి నిలిపి
కలయంగఁ బురమునఁ గాంచనవర్షంబుఁ గురియించి దేవతాకోటి పొగడ
వసుధ నెగడిన మాధవవర్మ..."

(౨) నంది మల్లయ్య, ఘంటసింగయ్య కృతమగు ప్రబోధ చంద్రోదయము. ఇందు బసవరాజు 'మాధవవర్మ భూమండలేశ్వర వంశజలధికి చందమామ' యని వర్ణితుడయ్యెను.

[బసవ భూపాలునికే కృతి యీయబడిన కావ్య మింకొకటి కలదు. అది దూబగుంట నారాయణ కవి విరచితమైన 'పంచతంత్రి'. ఇందు మాధవవర్మ ఇట్లు అభివర్ణితుడై యున్నాడు.

"మును బెజవాడ దుర్గమున ముగ్ధతనంబున మెచ్చఁజేసి పెం
పున రథ దంతివాజి భట భూరిబలంబులచేఁ గళింగ భూ
జన పతిఁద్రుంచి వేదసతి సంతతికై మహిఁ బాడి నిల్పిక్ర
మ్మనఁ జిరకీర్తులం గనిన మాధవ వర్మ..."

రథ దంతి వాజిభట భూరిబలంబులు కలవాడని వర్ణితుడగుటచేత ఈమాధవవర్మయు, అనుమకొండశాసనమున మేళరసు పూర్వుడుగ జెప్పబడిన మాధవవర్మయు ఒక్కడే కానోపును. —మ. సో. శర్మ.]

రాజరాజు కొడుకు అనంతవర్మ అనే చోడగంగదేవుని తామ్రశాసనాలు అయిదు దొరకినవి. వాటి నన్నిటిని ప్రకటించారు. ఈరాజుశాసనాలలో గంగవంశావతారక్రమము రెండు విధాలుగా చెప్పబడినది. అందులో

(౧) శకము ౧౦౦3-వ సంవత్సరమునాటి ఇతని విశాఖపట్టణము తామ్రశాసనములోను

(౨) శకము ౧౦౦3-వ సంవత్సరమునాటి ఇతని కొర్ని తామ్రశాసనములోను

(3)శకము ౧౦౫౭-వ సంవత్సరమునాటి ఇతని మరొక విశాఖపట్టణము తామ్రశాసనములోను

ఇతని తాత వజ్రహస్తుని శాసనాలలో కనబడేవంశానుక్రమణికే కనబడుతుంది. వీటినిబట్టి చూస్తే గుణమహార్ణవరాజే ఈకోవ వారిలో మొట్ట మొదటి వాడని చెప్పవలసి ఉంటుంది.

ఇక

(౧) శకము ౧౦3౮-వ సంవత్సరమునాటి అతని కొర్ని శాసనములోను

(౨) శకము ౧౦౪౦-వసంవత్సరమునాటి అతని మరొక శాసనములోను

మరొక విధమైన గంగవంశానుక్రమణిక కనబడుతుంది. ఈకడపటి రెండుశాసనాలున్నూ అనంతుని (విష్ణువు)నుంచీ వారివంశావతారక్రమమును, సృష్ట్యాదినుంచీ రాజ్యముచేసిన గంగవంశపు రాజుల అనుక్రమమును-పరిపాలనకాలపరిమితి తెలుపుతూ-చాలా పెద్దగా వర్ణిస్తూ ఉన్నవి. ఈశాసనాల ప్రకారము వీరసింహు డనేగంగవంశపు రాజుకి కామార్ణవ, దానార్ణవ, గుణార్ణవ, మారసింహ, వజ్రహస్తు లని అయిదుగురు కుమారులు కలరనీ, వారిలో కామార్ణవుడు తనవలుగురి తమ్ముల్తోను పైతృకరాజ్య మైనగంగవాడి విషయమునుంచి బైలుదేరి రాజులను జయించుకొంటూ తూర్పు దిశకు వెళ్లి మహేంద్రగిరిమీది గోకర్ణస్వామిని ఆరాధించి, అతని అనుగ్రహమువల్ల ధవళచ్ఛత్రి, చామర, సామజధ్వజ, వృషభలాంఛనాది రాజ్యోచితచిహ్నములు

సంపాదించి యుద్ధములో శబరాదుల్ని చంపి, కళింగ రాజ్యము ఆర్జించి దంతాపురము రాజధాని చేసుకొని ౩౭ సంవత్సరాలు పాలించాడనీ, అతను, దానార్ణవుణ్ణి యువరాజు చేసి అతనికి అంబవాడి విషయమున్ను, మార సింహునికి సోదామండలమున్ను, వజ్రహస్తునికి కటకవర్తనీ విషయమున్ను ఇచ్చా డనీ తెలుస్తున్నది. అందువల్ల వీటినిబట్టి చూస్తే కళింగ రాజ్యమును పాలించిన మొట్టమొదటి గంగవంశపురాజు కామార్ణవుడని స్పష్టముగా తెలుస్తున్నది. కామార్ణవుని తరువాత దానార్ణవుని సంతతివారు అవిచ్ఛిన్నముగా నందలకొద్ది యేండ్లు ఏలినట్లు శాసనాలలోని వంశానుక్రమునుబట్టి తెలుస్తున్నది. చోడ గంగదేవుని ఈశాసనాల ప్రకారం గంగవంశావతారక్రమము ఎట్లాగంటే:

(చూ: పుట ౧౧౭)

ఈపైవంశవృక్షమును చోడగంగదేవుని తాత అయిన వజ్రహస్తుని శాసనాలలోని వంశవృక్షముతో పోల్చిచూస్తే రెంటికీ కొన్ని తేడాలు కనబడు తవి. ఈతేడాల కన్నిటికీ సమాధానము చెప్తూ రెంటినీ సమన్వయము చేసి గంగవంశానుక్రమాన్ని సరిపుచ్చవలెను. ఈవిధముగా ఇదొక సమస్య. అనంతవర్మ చోడగంగదేవునికిపూర్వము పుట్టినవజ్రహస్తుని శాసనాలలోని వంశావతారక్రమమా? చోడగంగదేవుని శాసనాలలోని వంశానుక్రమమా? ఏది విశ్వసింప దగ్గది? చోడగంగదేవుని శాసనాలలోనే గంగవంశావతార క్రమము రెండు రీతులుగా చెప్పి ఉండడానికి కారణము ఏమిటి? ఇవి అన్నీ సమాధానాలు ఇవ్వవలసిన విషయాలే.

౩. గంగవంశోత్పత్తికథనసమస్య

గంగవంశముయొక్క ఉత్పత్తిప్రకారము చెప్పడములోకూడా కొన్ని తేడాపాడాలు కనబడుతవి. ఎట్లనః

# వీరసింహుడు

(మొదటి) కామార్ణవుడు (౩౬ సం. లు)

దానార్ణవుడు (౪౦ సం. లు)

(మొదటి) గుణార్ణవుడు

మారసింహుడు

(మొదటి) వజ్రహస్తుడు

(రెండవ) కామార్ణవుడు (౫౦ సం. లు)

రణార్ణవుడు (౫ సం. లు)

(రెండవ) వజ్రహస్తుడు (౧౫ సం. లు)

(మూడవ) కామార్ణవుడు (౧౯ సం. లు)

(రెండవ) గుణార్ణవుడు (౨౭ సం. లు)

పోతాంకుశుడు (౧౫ సం. లు)

(?)

కళింగలాంకుశుడు (౧౨ సం. లు)

(మొదటి) గుండమరాజు (౭ సం. లు)

(నాలుగవ) కామార్ణవుడు (౨౫ సం. లు)

(నాలుగవ) వజ్రహస్తుడు (౩౫ సం. లు)

వినయాదిత్యుడు (౩ సం. లు)

(అయిదవ) కామార్ణవుడు (౬ నెలలు)

(రెండవ) గుండమరాజు (౩ సం. లు)

(ద్వైమాతురుడు) (ఆరవ) మధుకామార్ణవుడు (౧౯ సం. లు)

(అయిదవ) వజ్రహస్తుడు (౩౩ సం. లు)

దేవేంద్రవర్మ అనే రాజరాజు (౮ సం. లు)

అనంతవర్మ అనే చోడగంగదేవుడు

అనంతవర్మ చోడగంగదేవుని తాత అయిన వజ్రహస్తుని శాసనాలలో గంగవంశోత్పత్తిప్రకార మేమీ చెప్పి ఉండలేదు. చోడగంగదేవుని ౧౦౩౪, ౧౦౪౦ శకవర్షపు శాసనాలలో మాత్రము సంపూర్ణమైన గంగవంశోత్పత్తి కథనము ఉన్నది. వీటిప్రకారము చంద్రవంశములోని యయాతి కొడుకైన తుర్వసువుకు సంతానము లేకపోతే అతడు గంగను ఆరాధించాడనీ, అందు మీదట అతనికి గాంగేయుడనే కొడుకు కలిగినాడనీ అతనివల్లనే ఈవంశానికి గాంగేయ (గంగ) వంశ మనేపేరు వచ్చినదనీ తెలుస్తున్నది. గాంగేయుని వంశములో అతనిపిదప పదహేనుగురు రాజులు చన్న తరువాత కోలాహలుడు కలిగినాడు. ఇతడు గంగవాడివిషయములో కోలాహలపుర మనేపట్టణము కట్టించాడు. తరువాత ఆపురాన్ని ౧౦ మంది రాజులు పరిపాలించినపిదప వీరసింహు డనేరాజు సింహాసన మెక్కినాడు. ఇతని కొడుకు కామార్ణవుడే కళింగరాజ్యప్రతిష్ఠాత.

ఈపైవిషయములనుబట్టి చూడగా కళింగగంగవంశజులు అసలు మొదట గంగవాడివిషయములోని కోలాహలపురము రాజధానిగా పరిపాలించే వారనీ, వీరసింహుని కొడుకైన కామార్ణవుని కాలములోనే వీరు గంగవాడి విషయమును విడిచిపెట్టి కళింగానికి వచ్చి అక్కడ కళింగగంగరాజ్యము స్థాపించారనీ తేలుతున్నది.

ఈపైని చెప్పిన గంగవాడివిషయము ఇప్పటి మైసూరు రాజ్యము లోనిది. అది తొంభై ఆరువేల రాజ్యము. క్రీస్తుశకం రెండవ శతాబ్దినుంచి పద కొండవ శతాబ్దివరకు ఈరాజ్యాన్ని గంగవంశమువారు పరిపాలిస్తూ ఉండినట్లు తెలిపేశాసనాలు చాలా ఉన్నవి. ఈగంగవంశస్థులను బట్టే వారు పరిపాలించిన ఈప్రదేశానికి గంగవాడివిషయ మనే పేరు వచ్చినది. గంగవాడిలోని ఈగంగ వంశజులకు మొట్టమొదట కువలాలపురము రాజధానిగ ఉండేదని వారిశాస నాలవల్ల తెలుస్తున్నది. ఈకారణముచేతనే గంగవాడి గంగవంశజులు తాము కువలాలపురవరాధీశ్వరులమనీ, కువలాలపురపరమేశ్వరులమనీ తమశాస నాలలో చెప్పకొన్నారు. గంగవాడి గంగవంశజుల శాసనాలలో ఈకువలా లపురమే కొవలాల, కోలాలపురముగానూ చెప్పబడ్డది. దీనిని మైసూరు రాజ్యములోని. 'కోలారు'గా గుర్తించారు. ఇప్పుడిది కోలారు మండలమునకు

ముఖ్యస్థానము. ఈకొవలాల, కోలాలపుర మని చెప్పబడ్డ కువలాలపురమే చోడగంగదేవుని శాసనములో చెప్పబడ్డ కోలాహాలపురము; మైసూరు మండలములోని గంగవాడి విషయమే చోడగంగదేవుని శాసనములో చెప్పబడ్డ గంగవాడి విషయము. దీనినిబట్టి కళింగగంగవంశజులు దక్షిణమున మైసూరు రాజ్యమునుండి వచ్చినట్లు తేల్చవలసి ఉంటుంది.

అయితే మరొక్క విషయము: క్రీస్తు శకము పదకొండవ శతాబ్దినాటి చోడగంగదేవుని శాసనాలలో కామార్ణవుని తండ్రి అయిన వీరసింహునికి పూర్వము ౫౧మంది రాజులు పరిపాలించినట్లు చెప్పబడ్డదే కాని వారిపేరు లేవో చెప్పి ఉండనందువల్ల గంగవాడి గంగవంశజుల శాసనాలలో వీరసింహుని పూర్వులనుగుర్తించడానికి వీలులేదు. తుదకు వీరసింహుని పేరైనా వాటిలో కానరాదు. పోనీ, వంశోత్పత్తి ప్రకారమైనా సరి పోతుందేమో అంటే అదిన్నీ సరి పోవడములేదు.

గంగవాడివిషయములోని గంగవంశజులవి క్రీస్తు శకము మూడవ శతాబ్దినాటి వనిచెప్పబడేవి కూడా దొరకినా వారివంశోత్పత్తి క్రమము వారి క్రీస్తు శకము పదకొండవ శతాబ్దినాటి శాసనాలలోనే కాని కానబడదు. అందువల్ల సంపూర్ణవంశోత్పత్తి ప్రకారము తెలిపే గంగవాడి గంగవంశజుల శాసనాలూ, కళింగ గంగవంశజుల శాసనాలూ రెండూ ఒకే కాలమునాటివే: ఇవి ముందు అవి ముందు అని చెప్పడానికి వీలులేదు.

గంగవాడి గంగవంశజుల శాసనాలలో చెప్పినగంగవంశోత్పత్తికథనమిది. ఇక్ష్వాకువంశములో అయోధ్యలో హరిశ్చంద్రుడు పాలించాడు. హరిశ్చంద్రునికి భరతుడు పుట్టినాడు. అతని భార్య విజయమహాదేవి. ఆవిడ గర్భదోహాల అయినప్పుడు గంగానదికి స్నానార్థమై వెళ్లి అందు ఓలలాడి, పాడి, జలక్రీడ సలిపినది. పిదప ఈవిధమైన క్రీడవల్ల మాంద్యము తగ్గగా ఆవిడ నిజగృహాముకు వచ్చినది. అటుతరువాత నవమాసములు పూర్తికాగానే ఆవిడకు ఒక కొడుకు పుట్టినాడు. గంగానదిలో స్నానముచేసిన తరువాత కలిగిన కొడుకు ఆవడముచేత అతనికి గంగాదత్తు డనిపేరు పెట్టినారు. అతనినిబట్టే అతని వంశజులవారికి గంగవంశమువారని పేరు వచ్చినది. గంగవంశజులని పేరురావడానికి

గంగవాడి గంగవంశజుల శాసనాల ప్రకారము కారణము ఇదే. గంగవాడి శాసనాల ప్రకారము వీరు ఇక్ష్వాకువంశజులు: అందువల్ల సూర్యవంశస్థులు: అనంతవర్మ చోడగంగ దేవుని శాసనాల ప్రకారము వీరు అత్రివంశజులు: అందువల్ల చంద్రవంశస్థులు. ఒకరు సూర్యవంశజుల మనీ, మరొకరు చంద్రవంశజుల మనీ చెప్పకొన్నా ఇద్దరూకూడా తమది అసలు గంగవాడి విషయమే అనిన్నీ, మొదట తమది కోలాహాల(కువలాల)పురమే రాజధాని అనిన్నీ చెప్పకొన్న వారే అని మనము జ్ఞాపక ముంచుకోవలెను.

గంగవాడి గంగవంశజులవని పైనిచెప్పిన శాసనాలలో కళింగప్రస్తావన కూడా కలదు. హరివంశకేతువైన నేమీశ్వరతీర్థులవారు ప్రవర్తిల్లుచుండగా పైని చెప్పిన గంగాదత్తుని వంశములో విష్ణుగుప్తుడు ఉదయించాడు. నేమితీర్థులవారి నిర్యాణమునాటికి ఈతడు అహిచ్ఛత్రిపురములో ఉన్నాడు. అతనికి పృథివీ మతిమహాదేవి అని ఒకభార్య ఉండేది. వారికి భగదత్త, శ్రీదత్తులని కొడుకులు కలిగినారు. వారిద్దరికి విష్ణుగుప్తుడు తనరాజ్యమును పంచి, భగదత్తునికి కళింగ రాజ్య మిచ్చి, పైతృకరాజ్యము శ్రీదత్తునికి కట్టబెట్టినాడు. భగదత్తుడు అందువల్ల కళింగగంగు అయినాడు. ఈకథ ప్రకారము కళింగ గంగవంశానికి భగదత్తుడే మూలపురుషుడుగా కనబడతాడు; కాని-చోడగంగదేవుని శాసనాలలో ఈభగదత్తుని పేరే కానరాదు.

గంగవాడి గంగరాజ్యప్రతిష్ఠాపన ప్రకార మిది. శ్రీదత్తుని వంశములో ప్రియబంధు వుదయించాడు: అతనికి దేవేంద్రుడు పంచలాంఛనాలిచ్చాడు: అతని వంశములో పద్మనాభుడు పుట్టినాడు: అతనికిద్దరు కొడుకులు. కొంత కాలమైన తరువాత ఉజ్జయినిరాజైన మహీపాలుడు అతనిపై దండెత్తి దేవేంద్రదత్తములైన పంచలాంఛనాలూ ఇవ్వవలసిందని అతన్ని నిర్బంధించాడు. అందుమీదట పద్మనాభుడు అందుకు నిరాకరించి ముందుగా తనకొడుకులకు వాటి నిచ్చివేసి వారి సోదరితోను, కొంతమంది బ్రాహ్మణులతోనుకూడా వారిని దక్షిణాదికి పంపివేశాడు. వెళ్ళిపోయే టప్పుడు పద్మనాభుడు తనకొడుకులకు దడిగమాధవు లని పేర్లు పెట్టినాడు. వారు కడప మండలములోని పేరూరు (పేరూ రనే పేరుగల గ్రామాలుచాలాఉండడముచేతదీనినిగంగపేరూరుఅంటారు)వచ్చేటప్పటికిఅక్కడ జైనమతాచార్యుడు సింహనంది ఉంటే ఆయన్ని సందర్శించి, తమసంగతంతా

ఆయనతో విన్నవించారు. ఆయన వారికథ విని చాలా జాలిపడి తుదకు వారికొరకు రాజ్యము సంపాదించిపెట్టినారు. ఇది పద్మావతీదేవి అనుగ్రహమువల్ల జరిగినది. ఆ దేవి వారికి ఒకఖడ్గముకూడా ప్రసాదించినది. అప్పటికిచిన్నపిల్లవాడైన మాధవవర్మ ఆఖడ్గముతో ఒకశిలాస్తంభాన్ని రెండు ముక్కలుగాకొట్టివేశాడట.1 సింహాసనంపై మహిమాప్రతిలబ్ధమైనది గంగవాడి రాజ్యమే.దీనికి రాజధాని కువలాలపురము గంగవాడిలో రాజ్యముచేసిన వారిలో మాధవవర్మే మొదటి రాజు. కొంగుణివర్మ అని కూడా అతని పేరు. తుదకది అతని వంశమువారికందరికీ బిరుదము అయినది. వీరందరూ కాణ్వాయనగోత్రులనివీరిశాసనాలు చెప్పుకున్నవి.

ఈపైవిషయాలనుబట్టి చూస్తే గంగవాడిలో రాజ్యముచేసిన మొదటి రాజు మాధవభూపతి అనీ, ఈవంశమువారిది కాణ్వాయనగోత్రమనీ తెలుస్తున్నది. కళింగగంగవంశజులది ఆత్రేయగోత్రము. వారివంశమున చెప్పబడ్డ కోలాహలుడు ఈవంశమువారి వంశవృక్షములో ఎక్కడా కానరాడు.

గంగవాడి గంగవంశజులను దక్షిణగాంగులనీ, పశ్చిమగాంగులనీ అంటారు: కళింగగాంగులను తూర్పు గాంగు లంటారు: ఈయిద్దరి వంశోత్పత్తి కథనములోనూ ఉన్న తేడాలు పైనచూపబడ్డవి. కళింగగంగవంశమువారు కూడా తాము గంగవాడినుంచి వచ్చినామని తమపూర్వులకు కోలాహలపురమే మొదట రాజధానిగా ఉండేదనీ తమశాసనాలలో చెప్పుకోవడముచేత ఉభయులశాసనాలనుబట్టీ గంగవంశోత్పత్తి ప్రకారమునుగురించి యింతవరకు చర్చ చేయావలసి వచ్చినది. ఈతేడాపాడా లన్నీ సమన్వయపరచి గంగవంశోత్పత్తి కథనసమస్య పరిష్కరించవలెను

1. పోలిక చూడుడు: అనంతవర్మ చోడగంగదేవుని శాసనములలో అతని తాత అయిన వజ్రహస్తుడు భూమిమీద పడుతూ ఉండే వజ్రమును నివారించినట్లుకలదు

# నాటకములు—ప్రయోగోచిత కాలము

డాక్టర్ బుర్రా శేషగిరిరావుగారు, ఎమ్. ఏ., పి. హెచ్. డి.

దివసములో నేభాగములో నాట్యప్రయోగము చేయవలెను అను సంశయము నాటకములు చూచువారికిని ప్రదర్శించువారికిని గూడ కొంత ముఖ్యమైనదే. మనదేశములో గతముప్పదివత్సరములకుపైగా నాటకములు రాత్రి గం ౯ లు తరువాత ప్రారంభమగుచున్నవి. సాధారణముగా సాయంకాలము గం ౬ లు మొదలు గం ౬ల వరకు రాత్రి యనవచ్చును. అనగా సుమారు ౧౨ గంటలకాలము. అనగా రాత్రి సుమారు గం ౧౨ లకు అర్ధరాత్రి యగుచున్నది. గాని నాట్యప్రయోగములు రాత్రి పూర్వార్ధమువాటి యొకప్పుడు ప్రాతఃకాలమువరకును నడచుచుండుట మన మెరిగిన విషయమే. పూర్వుల నియమముప్రకారమిది ప్రదోషకాలానంతరము రాత్రి ప్రారంభమునకును ప్రాతఃకాలమునకును మధ్యభాగ మగుచున్నది. ఇట్లు నాటకములు రాత్రి భాగమునందే చూడదగినవియు ఆడదగినవియు నని సర్వసామాన్యమగు నభిప్రాయమైయున్నది. రాత్రి దీపముల వెలుగున వేషములు శోభించి, దృశ్యము రక్తికట్టును అని మన యూహ యై యున్నది. ఇదే నియమము కావలెనని చెన్నపురిలోని పెద్దపట్టణములలో మ్యాటినీలని సాయంకాలపు ప్రదర్శనములు చేయబడుచుండుట స్పష్టమే. కాని వీటిలో కూడా స్థలము చీకటిమయము చేసి ఎలెక్ట్రిక్ దీపములతో నాట్యప్రయోగము చేయబడుట చూడగా చీకటియు దీపములును నాట్యప్రయోగమున కవసరమని యందరు నాశించుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఇది వేషములోని లోపములు సర్దుకొనుట కనుసరించుచున్న మార్గమనియు తోడకట్టును.

పూర్వము హిందూ దేశములో నాట్యప్రయోగములు సర్వలక్షణలక్షితములై లోకసంగ్రహమునకై వినియోగపడి వాసిగాంచిననాడు నాట్యప్రయోగవిషయమున నిట్టి విపరీతపు పరిస్థితులు లేనట్లు భరతనాట్యశాస్త్రమున నిదర్శనములు కలవు. విమర్శింప దగియున్నవి. ఈ నియమములు ప్రాచీనములుగదా యని స్వీకరింపక నవ నాట్యాభిలాషు లవలంబించినచో నాట్యము చూచువారికిని ప్రదర్శించువారికి ప్రస్తుతము కలుగుచున్న నిద్రాభంగములును దాని వలన గలుగు నారోగ్యనష్టములును నివారింపబడును. కాని నాట్యప్రయోగ మందిప్పటికన్న కళల మెళకువ కావలసి యుండును. దానికై ప్రయత్నపడుటలో నాట్యకళాభివృద్ధి కాగలదు.

ఈ విషయమున భరతనాట్యశాస్త్ర మందలి విధివిధానము లిట్లున్నవి:—

పూర్వాహ్ణే పూర్వః మధ్యాహ్నే హ్యపరాహ్ణే తథైవ చ
దివాసముత్థా విజ్ఞేయా నాట్యవారాః ప్రయోగతః
ప్రదోషే కార్ధరాత్రం చ తథా ప్రాభాతికోఽపరః
నాట్యవారా భవన్త్యేతే రాత్రిజా హ్యానుపూర్వశః.

నాట్యవిషయమున పగలు మూడు భాగములుగాను రాత్రి మూడు భాగములుగాను విశేషింపబడియును. పూర్వాహ్ణము, మధ్యాహ్నము, అపరాహ్ణము—ఇవి పగటి భాగములు. ప్రదోష

# ప్రథమచాళుక్యభీముని అత్తిలి తామ్రశాసనము.

(శా. శ. ౮౧౮.)

ఈతామ్రశాసన మెచ్చట దొరకెనో తెలియదు. ఇది ౧౯౧౮లో ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయముఁ జేరెను. అచ్చటనుండి యది దొరతనము వారి శాసనాధికారికిఁ బంపఁబడెను. వారు దానిని దమరిపోర్టులోఁ జేర్చుకొని ౧౯౧౭-౧౮సంవత్సరపు ౧౮౫-నంబరు తామ్రశాసన మని దానికి గుర్తుపెట్టిరి. ఇప్పుడు దానిని నేను పరిషత్కార్యాలయమునం దున్నరాగిరేకులంబట్టి ప్రకటించుచున్నాను.

<u>ఆకారాదికములు</u>:—ఈశాసనము మూఁడురాగిరేకులపై వ్రాయఁబడి యున్నది. ఒక్కొక్కరేకు 7¼ అంగుళములు పొడుగుగను 3¼ అంగుళములు వెడల్పుగను నుండును. మధ్యరేకు మిగిలిన రెండు రేకులకంటెఁ గొంచెము దళసరిదైనది. మూఁడవరేకు మిక్కిలి సన్నముగా నుండును. అందువలన నందు నచ్చటచ్చటఁ జిన్నచిన్న చిల్లులు పడినవి. ఈరేకులచుట్టును ఎత్తుగ అంచు నేర్పఱుపఁ బడినది. ఈమూఁడురేకులును ఒకగుండ్రనికడియములో గ్రుచ్చఁ బడినవి. ఈకడియపువ్యాసము 3¼ అంగుళములు. ఈకడియమునకు దీర్ఘవర్తులాకారము గలముద్ర యొకటి యంటుకొని యున్నది. దానిమీఁద సూర్యుఁడు, చంద్రుఁడు, అంకుశము, వరాహము, అనుప్రతిమలు పోఁత పోయఁబడి యున్నవి. ఇం కొకప్రతిమయుఁ గలదు గాని యదీ స్పష్టముగఁ దెలియుట లేదు. అది స్వస్తికము అయినఁ గావచ్చును. ముద్రపై 'శ్రీత్రిభువనాంకుశ' అనునక్షరములు కూడఁ గలవు.

<u>భాషాదికములు</u>:—శాసనపుభాష సంస్కృతము. గద్యములు పద్యములు కూడఁ గలవు. వ్యాకరణదోషములు విశేషము లేవు. ౨౨-౨౩పంక్తులలో నొకము పద్యమే ఇయ్యఁబడినది. మిగిలినసగము పద్యము పొరపాటున శాసనము చెక్కిన చామికుట్టాచార్యునివలన విడువఁబడినది. ఇట్లు విడువఁబడిన శ్లోకార్ధమును నేను నరసాపురతామ్రశాసనము[1]నందుఁ బట్టుకొంటిని. ఈశాసన

---

[1] R. Ep. 1918 - p. 131.

నవురేకులు చెన్నపట్టణమునందలి చిత్రవస్తుప్రదర్శనాలయమున (మ్యూజియం) నందుఁ గలవు. ఇందలి యక్షరములు తొమ్మిదవశతాబ్దమునాఁటి కన్నడ తెలుఁగులిపి. ఇందలిది గుండ్రటికత్తు. గుణగవిజయాదిత్యుని సాతలూరు[1] తామ్రశాసనమునందును, బెజవాడ తామ్రశాసనము[2]నందును, ప్రథమచాళుక్య భీముని మచిలీపట్టణపు తామ్రశాసనము[3]నందును మొదటి అమ్మరాజు ఏడూరు[4] శాసనమునందును, ఈకత్తే కలదు. ఈ లేఖకుఁడు రేఫమునకుఁ బరమునం దుం డుహల్లును తప్పక ద్విత్వముగా వ్రాయును. పాణినీయసూత్రమునం దీని యమము వైకల్పికము.

<u>శాసనమునందలివిషయములు:</u>— చాళుక్యుల యెప్పటిబిరుదముల నన్ని టినిఁ బేర్కొని (పం౧-౬) కవి కుబ్జవిష్ణువర్ధనునిమొదలు గుణగవిజయాదిత్యుని వఱకు రాజ్యమేలిన తూర్పుచాళుక్యరాజుల పేళ్లును, వారిరాజ్యకాలమితియుఁ దెల్పును. (పం౬-౧) రెండవవిజయాదిత్యుఁడు భీమసల్కి యనువానిని అతనికి సాయముగ వచ్చిన దక్షిణగాంగసేనానులను, పరాభవించి ౧౦౮ శివాలయము లను గట్టించెను. (పం-౧౦-౧౨) అతనిమనుమఁ డైనమూఁడవవిజయాదిత్యుఁడు కిరణపురము, అచలపురము, ఉరునెల్లూరుపురము అనుమూఁడుపురములఁ గాల్చి త్రిపురమర్త్యమహేశ్వరుఁ డన్నబిరుదముఁ గాంచెను. (పం-౧౩-౧౪) అతఁడు కళింగగాంగుల యొద్దనుండి రజతాదికము, కోసలరాజుల యొద్దనుండి గజాదికము, పాండ్యపల్లవులయొద్దనుండి సువర్ణాదికము గ్రహించెను. (పం౧౪-౧౬.) అతండు గాంగులు గంగకూట మెక్కునట్లు చేసెను. మంగితల ద్రుంచెను. సాహసుఁ డైన (రాష్ట్రకూట) కృష్ణుని యుద్ధమునం దోడించెను. (పం-౧౬-౧౭) అతనితమ్ముఁ డైన విక్రమాదిత్యుని కుమారుఁడు చాళుక్యభీముఁడు. అతఁడు శా. శ. ౮౧౪సం॥నందు చైత్ర బహుళ ౨ సోమవారమునాఁడు అనూరాధానక్షత్రమున మిథునలగ్న మునందు పట్టాభిషిక్తుఁ డయ్యెను. (పం. ౧౮-౨౨.) ఈ భీమునిఖడ్గ మనుసముద్రమునందు మునింగి (రాష్ట్రకూట) కృష్ణవల్లభుని చతురంగసేన, నీళ్లలో మునిఁగిన చదరంగమందలి సేనవలెఁ గరఁగిపోయెను. (పం౨౨-౨౩.) అప్సరసవంటి ఘుండిక యనునొకస్త్రీ కలదు. దానికి మల్లపుఁ డను తుంబురునిఁబోలిన కుమారుఁ డుం

---

[1] ఇది ప్రకటింపఁబడలేదు, వారొద్ద నున్నది. [2] Ep. Ind. Vol. V p. 127.

[3] దీనినే నరసాపురతామ్రశాసనము అని కూడ నందురు. C. p. no. I of 1913-14 దీనికి శాఖాధికారులొసఁగినపేరు. ఇది యిప్పుడు చెన్నపురమందలి చిత్రవస్తుప్రదర్శనాలయమునం దున్నది. అచ్చటి వారు దీనికిఁ బెట్టినగురుతు Ch. E. 8. [4] S. S. I. Vol. I p. 39.

డను. వానికి చల్లవ యనుకూఁతురు గలదు. అది సమస్తగాంధర్వవిద్యావిశారద (పం. ౨౫-౨౮.) దానికి అత్తిలిగ్రామమునందు వెయ్యిపోఁకచెట్లు గలభూమియు, ౫౦పుట్లు వడ్లవిత్తనము పట్టు పొలమును, నివేశనస్థలమును రా జిచ్చెను. (పం. ౨౮-౩౦) ఈశాసనమున శాజ్ఞప్తి కడేయరాజు. శాసనమును రచించినవాఁడు భట్టవామనుఁడు. చెక్కినవాఁడు చామికుణ్ణాచార్యుఁడు. (పం-౩౩-౩౫)

శాసనపుయోగ్యత:—ఈశాసనమునకుఁ జరిత్రవిషయికమైన పెక్కుశాసనములకంటె నెక్కుడుయోగ్యత గలదు. నేఁటివఱకు దొరకిన తూర్పుచాళుక్యశాసనములలో రాజుయొక్క పట్టాభిషేకకాలమును, స్పష్టముగాఁ దెల్పిన మిక్కిలిపురాతనశాసన మిదియే యని చెప్పవచ్చుచు. ఇది వఱకు దొరకిన శాసనములలో నీప్రకారము స్పష్టముగాఁ బట్టాభిషేకకాలముఁ దెలిపినది రెండవ అమ్మరాజశాసనము.[1] ఇది యంతకంటె పూర్వపుది గనుక ముఖ్యమైనది. ఇందు చాళుక్యభీముఁడు తనపట్టాభిషేకసంవత్సరమును దెల్పుటయే గాక తనకు పూర్వము రాజ్యముచేసిన ౧౩గురు రాజులలో నొక్కొక్కఁ డెన్నెన్ని సంవత్సరములు రాజ్యమేలెనో తెల్పినందున శాలివాహనశకము ౮౧౪ అనఁగా క్రీ.శ. ౮౯౨ ఆధారము చేసికొని వెనుకకు లెక్కవేసినయెడల కుబ్జవిష్ణువర్ధనునినుండియు రాజులయొక్క సరియైనరాజ్యకాలముల నేర్పఱుపవచ్చును. అట్టిపట్టికయొకటి యీక్రింద నిచ్చుచున్నాను. డాక్టరు ఫ్లీట్ ఇట్టి పట్టికనే యొక్కదానిని ఇండియన్ అంటిక్వేరి యొక్క ౨౦వ సంపుటములో నిచ్చియున్నాఁడు. కాని యీశాసనము బట్టి మనము సిద్ధముచేయు పట్టిక ఫ్లీటుపట్టికకంటె నెక్కుడు సూక్ష్మముగ నుండు ననుటకు సందియము లేదు. డాక్టరు ఫ్లీటుచే నియ్యఁబడిన రాజ్యకాలములకును యీశాసనమువలనఁ దేలు రాజ్యకాలములకును గలభేదము తెలియుటకై యీరెండుకాలములును బట్టికలోఁ జూపఁబడినవి.

| | | | | ఈశాసనములోని కాలములు. | డాక్టరు ఫ్లీటిచ్చిన కాలములు. |
|---|---|---|---|---|---|
| 1. కుబ్జ విష్ణువర్ధనుఁడు | - | - | - | 616–634 | 615–633 |
| 2. జయసింహ I | - | - | - | 634–667 | 633–663 |
| 3. ఇంద్రరాజు | - | - | - | - - | 663 |
| 4. విష్ణువర్ధన II | - | - | - | 667–676 | 663–672 |
| 5. మంగియువరాజు | - | - | - | 676–701 | 672–695 |
| 6. జయసింహ II | - | - | - | 701–714 | 696–709 |
| 7. కొక్కిలి | - | - | - | 714 | 709 |

[1] Ind. Ant. Vol. VII p. 15.

| | శాసనములోని కాలములు. | డాక్టరు ఫ్లీటిచ్చిన కాలములు. |
|---|---|---|
| 8. విష్ణువర్ధన III - - - | 714–751 | 709–746 |
| 9. విజయాదిత్య I - - - | 751–770 | 746–764 |
| 10. విష్ణువర్ధన IV - - - | 770–806 | 764–799 |
| 11. విజయాదిత్య II - - - | 806–846 | 799–843 |
| 12. కలి విష్ణువర్ధన V - - - | 846–848 | 843–844 |
| 13. గుణగవిజయాదిత్య III - - - | 848–892 | 844–88 |
| 14. చాళుక్యభీమ - - - | 892 | |

ఫ్లీటుచే నియ్యఁబడిన తేదులకును మన తేదులకును స్వల్పవ్యత్యాస మున్నను కుబ్జవిష్ణువర్ధనుఁడు ౬౧౫ లో స్వతంత్రముగా రాజ్యము చేయుటకుఁ బ్రారంభించె నని వేరుప్రమాణముల సాహాయ్యమున ౩౫ సంవత్సరముల క్రిందనే కనుఁగొనుట ఫ్లీటున కెంతయు భూషణాస్పద మని మన మొప్పుకొని తీరవలెను. మన లెక్కప్రకారము ౬౧౬ కుబ్జవిష్ణువర్ధనుని రాజ్యప్రారంభ కాలము. కావున ఫ్లీటుకాలమునకును దీనికి నొకసంవత్సరకాలము భేద మున్నది. ఫ్లీటు ఉత్తరకాలపు చాళుక్యుల శాసనములలోని రాజ్యసంవత్సరసంఖ్యలను బ్రమాణముగాఁ దీసికొనినందున ఫ్లీటు లెక్కకును మన లెక్కకును భేదము కలిగినది స్పష్టము. రాజుల రాజ్యపరిమితిని గుఱించి పరకాలమందలి శాసనములకంటెఁ బూర్వశాసనములే యెక్కువప్రమాణము లని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. శా. శ. ౯౭౫ లోని నందంపూఁడి[1] శాసనమునందుఁ గలసంవత్సరములకును శా. శ. ౭౧౪ లోని దగు నీశాసనమునందలి సంవత్సరములకును భేద మున్నయెడల ౧౬౧ సంవత్సరములు పూర్వపుది యగు నీశాసనమునందలి సంవత్సరములే ప్రమాణముగ గ్రహింపవలసి యుండును. నందంపూఁడిశాసనమునందు రెండవవిజయాదిత్యుఁడగు నరేంద్రమృగరాజు ౪౮ సంవత్సరములు రాజ్యముచేసినట్లున్నది. కాని యీశాసనమునందును నింతకుఁబూర్వపు వైన గుణగవిజయాదిత్యుని శాసనములందు నీతఁడు ౪౦ సంవత్సరములే రాజ్యముచేసిన ట్లున్నది. అందువలన నారాజు రాజ్యకాలమును గుఱించియీశాసనవచనమే ప్రమాణముగ నెంచవలయును. ప్రథమవిజయాదిత్యుఁడు ౧౮ సంవత్సరములు రాజ్యముచేసినట్లు నందంపూఁడి శాసనమునం దున్నది. కాని యీశాసనమునం దాతఁడు ౧౮ సం॥లు రాజ్య మేలె నని వ్రాయఁబడినది. కాని యీభేద మంతగాఁ బాటింపఁ

[1] Ep. Ind. Vol. IV p. 300.

దగినది కాదు. ఏలయన నారాజు ౪౪ సంవత్సరముల మీఁదఁ గొన్ని నెలలు రాజ్యము చేసియున్న యెడల నొకరు ౪౪ అనియు మఱియొకరు ౪౫ అనియు వ్రాయుట సంభవించును. ఇంద్రభట్టారకుఁడు ౭ దినములు మాత్రము రాజ్యము చేసినందున నాతని పేరీశాసనమునందు లేదు.

పట్టాభిషేక కాలము:—చాళుక్యభీముఁడు పట్టాభిషిక్తుఁడైనదిన మీశాసనమునందు నీక్రిందిశ్లోకమునఁ జెప్పఁబడియున్నది (పం. ౧౯-౨౦.)

శ్లో. శాకే వ్వబ్దేషు యాతే ష్వథ మనువసుసంప్రాప్తసంఖ్యేషు మేషే।
మిత్రే, చైత్రేచ మైత్రే శశిని శశిదినే,
యుగ్మతుఙ్గే౽న్యోద్గమేథా త్సకలజనముదే పట్ట మాచంద్రతారం।
శ్రీమాన్ చాళుక్యభీమ శ్చతురుదధిలస న్మేఖలేలాతలస్య॥

అర్థము:—శా. శ. ౮౧౪ సంవత్సరములు గడచినతరువాత సూర్యుఁడు మేషమం దుండఁగా చైత్రమున చంద్రుఁడు మైత్రా(అనూరాధా)నక్షత్రమం దుండ, కృష్ణపక్షద్వితీయా(విదియ)సోమవారమునాఁడు మిథునలగ్నమందు చాళుక్యభీముఁడు నాలుగుసముద్రము లొడ్డాణముగాఁ గలభూమికిఁ బట్టము గట్టుకొనియెను.

ఇందుఁ జెప్పఁబడిన చైత్ర మనునెల చాంద్రమాసమా సౌరమాసమా యని తేల్పవలసి యున్నది. చాంద్రమాస మని గ్రహించితిమేని వారము తప్పును, నక్షత్రము తప్పును, సూర్యునిస్థితి తప్పును. ఆదినము ఆదివారము, స్వాతీనక్షత్రము, సూర్యుఁడు మీనమం దుండును. ఇట్లు మూఁడును తప్పుటచే నది చాంద్రచైత్రము కా దనుట స్పష్టము. ఇఁక నది సౌరచైత్ర మని యెంచిన యెడల నన్నియు సరిగ సరిపోవు చున్నవి. చాంద్రమానప్రకార మాదినము వైశాఖమాస మగును. ఇంగ్లీషులెక్కప్రకారము క్రీ. శ. ౮౯౨ సం॥ ఏప్రల్ నెల ౧౭ తేది యగును.[1]

పైని జెప్పినదానిఁబట్టి చూడఁగా నాకాలమందుఁ దెనుఁగుదేశమున నిప్పుడు మళయాళ దేశమందును బంగాళదేశమందును వలె సౌరమానమే వ్యవహారమునం దున్నట్లు గానవచ్చుచున్నది. హిందూదేశపు పూర్వసముద్రపు టొడ్డు ప్రాంతమునందు దక్షిణమున మళయాళదేశమునందును, ఉత్తరమున నోఢ్ర బంగాళాదేశములందును, సౌరమాసవ్యవహార మున్నందున వీనికి నడుమ నున్నయాంధ్ర

[1] ఈలెక్క లన్నియు శ్రీయుత స్వామికన్నుపిళ్లగారి జంత్రి ననుసరించి వేయఁబడినవి.

దేశమునందుఁ గూడ నన్నూ దట్టివ్యవహారము లుండు టాలోచింపఁ దగదు. ఇందును గురించి శ్రీరాజరాజనరేంద్రపట్టాభిషేకసంచికయందు నేను సవిస్తరముగఁ జర్చించిన లేఖఁ జూడవలయును.

భీమసల్కి:—నరేంద్రమృగరా జనఁబడు ద్వితీయవిజయాదిత్యుఁడు భీమసల్కి యనువానిని వానిపక్ష మవలంబించిన దక్షిణగంగబలమును నిర్జించె నని చెప్పఁబడియున్నది. (వం. ౧౧.) ఈభీమసల్కి యెవఁ డని విచారింపఁగా గుణగవిజయాదిత్యుని రెండుశాసనముల[1]వలన నీతఁడు నరేంద్రమృగరాజునకుఁ దమ్ముఁడనియు భీమసల్కిని ఆనరేంద్రమృగరాజు ౧౨ ఏండ్లుయుద్ధముచేసి వల్లభేంద్రదండనాయకులతో సహా నిర్జించి వేంగిదేశమును సంపాదించె ననియుఁ దెలియుచున్నది. ఇందువలన భీమసల్కి రాష్ట్రకూటరాజుల నాశ్రయించి వారిసాయమునఁ గొంతకాలము వేంగిదేశము నాక్రమించి నట్లును ౧౨సంవత్సరములు వారితో పోరాపోరిగఁ బోరినరేంద్రమృగరాజు రాజ్యమును మరల సంపాదించుకొనియె ననియు మన మూహింపవలసియున్నది. నరేంద్రమృగరాజు గాంగులతోడను రాష్ట్రకూటులతోడను ౧౨సంవత్సరములు పోరాడి నట్లును ౧౦౮ నరేంద్రేశ్వరాలయములు గట్టించినట్లును పెక్కుశాసనములలోఁ గానవచ్చును. మొదటి అమ్మరాజు శాసన[2] మొకదానిలో ని ట్లున్నది.

శ్లో. గంగరట్టబలైస్సార్థమ్ ద్వాదశాబ్దా నహర్నిశమ్।
భుజార్జితబలం ఖడ్గసహాయో నయవిక్రమైః॥
అష్టోత్తరం యుద్ధశతం యుధ్వా శంభో ర్గృహాలయాన్।
తత్సంఖ్యయాఽకరోద్వీరో విజయాదిత్యభూపతిః॥

పైసంగతులనుబట్టి చూడఁగ నరేంద్రమృగ[3]రాజు రాజ్యమునకు వచ్చిన తరువాత ౧౨సం॥ లవఱకును రాజ్యము సరిగ స్వాధీనపడక చిక్కులు పడె నని

---

[1] సాతలూరు శాసనము. [2] గుంటూరు శాసనము. (C. P. no. 5 of 1911 - 12)
"ద్వాదశవర్షయుద్ధం వల్లభేంద్రదండనాయకై స్సహ భీమసలుకినామానం స్వానుజం నిర్జిత్య గృహీత వేంగిమండలః" అని సాతలూరుశాసనములోని వాక్యము. గుణగవిజయాదిత్యుని గుంటూరు తామ్రశాసనమునందును ఇట్టి వాక్యము లే గలవు. అందునుగురించి శాసనశాఖవా రిట్లు వ్రాసియున్నారు. "Of Narendra - Mrigaraja - Vijayaditya the inscription informs us that he was the founder of 108 temples called Narendresvara after his own name, that he fought for 12 years with the generals of Vallabhendra (*ie*, the Rashtrakuta King) and that having defeated his own younger brother called Bhima Saluki, took possession of Vengi-Mandala from him." (Madras Ep. R. 1912 p. 84.) [3] S. I. I. Vol. I p. 36.

తోఁచుచున్నది. ఫ్లీటు లెక్కప్రకారము చూచినయెడల నరేంద్రమృగరాజు క్రీ. శ. ౭౯౯ లో రాజ్యమునకు వచ్చెను. ఈశాసనము ననుసరించి పైని వేసిన లెక్కప్రకారము చూడఁగ నీతఁడు క్రీ. శ ౮౦౫ లో రాజ్యమునకు వచ్చియుండవలెను. ఎటుచూచినను నీతనితో ముఖ్యముగఁ బోరాడినవాఁడును నీతని తమ్ముఁడైన భీమసళుక్కి లేక చాళుక్యభీముఁ డనువానికి సైన్యసాహాయ్యము చేసిన వాఁడును నగురాష్ట్రకూటరాజు మూఁడవగోవిందుఁ డయియుండవలెను. ఈతఁడు ౭౯౪సం॥ నుండి ౮౧౪వఱకు రాజ్య మేలెను. ఈతఁడు క్రీ. శ. ౮౦౭సం॥న చెక్కించిన యొకతామ్రశాసనమునందు తాను వేంగిరాజునకు కబురంపినతో డనే యాతఁడు తనరాజధాని యైనమాన్యఖేటమునకు వెళ్లి కూలివానివలె పని చేసి పట్టణమునకు బహిఃప్రాకారము నిర్మించి వెళ్లె నని చెప్పియున్నాఁడు. ఈ వేంగిరాజు నరేంద్రమృగరాజైనద్వితీయవిజయాదిత్యుఁడే యనిడాక్టర్ ఫ్లీటు, డాక్టర్ భాండార్కర్ వ్రాసియున్నారు. కాని పైవర్ణనము కేవల మతిశయోక్తి కాక యందుఁ గొంత సత్యము కలదేని యట్లువెట్టికి వెళ్లిన వేంగిరాజు రట్టగాంగుల తో హోరాహోరిగఁ బోరెడు నరేంద్రమృగరాజైయుండఁడు. రట్టగాంగులయ నుగ్రహమువలన సంశయాస్పదమును, క్షణభంగురమును, పూర్ణానుభవము లేని దియు నగువేంగిరాజ్యము సంపాదించుకొనిన మనభీమసళుక్కి యైయుండును.

ఈకాలమునందు దక్షిణగాంగులు స్వతంత్రులుగ లేరు. రాష్ట్రకూటులకు లోపడినవారుగ నుండిరి. రాష్ట్రకూటులపక్షమున గాంగసైన్యమును సేనాధిప తులును భీమసళుక్కికి సాయము చేయుటకై వచ్చియుందురు. ఈకాలమునందు శివమారుఁ డనుగాంగరాజు కొంత కాలము రాష్ట్రకూటులచెఱసాలలోను వా రిదయను సంపాదించి కొంతకాలము సింహాసనముమీఁదను నున్నట్లు గానవచ్చు చున్నది. ఈతఁడు రాజ్యభ్రష్టుఁ డైనకాలమున ౮౦౨లో ధారావర్షుఁ డను వాఁడును ౮౧౩ లో చాకిరాజను వాఁడును రాష్ట్రకూటరాజులప్రతినిధులుగా గం గవాడీ దేశమును పాలించినట్లు కానవచ్చుచున్నది[1]. వీ రంపినసైన్యములే మన శాసనమునందు గాంగవల్లభు లని పేర్కొనఁబడియె నని తోఁచుచున్నది.

సళుక్కిదేశ్యపదము:—సళుక్కిశబ్దము యుద్ధమల్లునిబెజవాడశాసనమునం దున్నది. దాని కర్థముచేయు నపుడు సళుక్కియన చాళుక్యుఁడు కాఁ డని కొం దఱు వాదించిరి. కాని యీశాసనమును పైనిఁ బేర్కొనినగుణగవిజయాదిత్యుని రెండుశాసనములును వెలువడినందున నిప్పుడు సళుక్కియన చాళుక్యుఁడు కాఁ

[1] Rice's Mysore Gazetteer Vol. I p. 314.

నకారాంతముగా నుండ రని తోఁచుచున్నది. ఈ శబ్దమును దీని మాఱురూపము లనగా చలికి, చళుక్కి, సళుకి మొదలైన శబ్దములును మిక్కిలి పురాతనకాలమునుండియు చాళుక్యార్థమునందు వాడఁబడుచున్నవి. అందుఁ గొన్ని కాలక్రమముగ నీక్రిందఁ జూపఁబడుచున్నవి.

1. ౭౦౯ - చలికి - కొక్కిలిమహారాజు తామ్రశాసనము.[1]
2. ౭౩౯ - చలుక్కి - గుజరాతులోని చళుక్యరాజైన అవనిజనాశ్రయుశాసనము.[2]
3. ౮౫౦ - సళుక్కి - గుణగవిజయాదిత్యుని గుంటూరిశాసనము.[3]
4. ౮౫౦ - సళుకి - గుణగవిజయాదిత్యుని సాతలూరుశాసనము.[4]
5. ౮౯౨ - సళ్కి - ప్రథమచాళుక్యభీముని ప్రస్తుతశాసనము.
6. ౯౦౦ ప్రాంతము - చళ్కి - విక్రమచోళమహారాజునాఁటి శాసనము.[5]
7. ౯౦౦ ప్రాంతము - సళ్కి - విక్రమచోళమహారాజునాఁటి శాసనము[6].
8. ౯౩౦ - సళ్కి - యుద్ధమల్లుని శాసనము.[7]
9. ౧౧ శతాబ్దము - శళుక్కి - విష్ణువర్ధనమహారాజు శాసనము.[8]
10. ౧౩ శతాబ్దము - చళుక్కి - నారాయణ మనుమసిద్ధిశాసనము[9]

ఇట్లీశబ్దము మిక్కిలి పురాతనకాలమునుండియు వాడుకలోనుండుటయే గాక చాళుక్యు లేయేదేశముల నేలిరో యాయాభాషలలో నన్నిటిలో నున్నది. గుజరాతీభాష, తెలుఁగుభాష, అఱవభాష, కన్నడభాష, ఇట్టన్నిటిలో నీరూప మన్నికాలములయందు నుండుట చూడ నిది యే ప్రథమదేశ్యరూప మనియుఁ జలుక్యశబ్దము దానికిఁ గల్పింపఁబడిన సాంస్కృతికరూప మనియుఁ దోఁపక మానదు. ఇందును గుఱించి యధికము తెలిసికొనఁ గోరువారు నేను ఆంధ్రపత్త్రిక, దుర్మతిసం॥ మాఘ బ॥ ౫ నాఁటి సారస్వతానుబంధమున వ్రాసిన 'సళ్కి చాళుక్యశబ్దములు సమానార్థకములు' అనువ్యాసమును చాళుక్యులు దాక్షిణాత్యులే యన్న రాఁబోవువ్యాసమును జూడనగును.

<u>చాళుక్యభీముని యితరశాసనములు:</u> — ప్రస్తుతపు శాసనము గాక ప్రథమచాళుక్యభీముని శాసనము లింకను నయిదు కలవు. అం దొకటి బెజ

---

[1] C. P. 11 of 1908 - 9. [2] Proceeding of the Seventh International Congress of Orientalists, Aryan section p, 232 and plate. [3] C. P. no. 5 of 1911 - 12. [4] ఇది ప్రకటింపఁబడలేదు. నాయొద్ద నున్నది. వలయువారికిఁ జూపఁబడును. [5] Ep. R. 400 of 1904. [6] Ep. R. 401 of 1904. [7] ఆం. సా. ప. పత్త్రిక. సంపుటము ౩, పుట ౪౯. [8] Ep. R. 44 of 1896. [9] Nellore Inscriptions Venkatagiri No. 19.

పాడశాసనము,[1] ప్రకటింపఁబడినది. ఇయ్యది యారాజపట్టాభిషేకమహోత్సవ కాలమం దియ్యఁబడినది. రెండవది కాసింకోట తామ్రశాసనము.[2] ఇతఁడు తండ్రికిఁ బెద్దకొమారుఁ డనియు యుద్ధములలో దాయాదుల సైన్యముల నోడించె ననియు నిందుఁ గలదు. ఈదాయాదు లతనితమ్ములును నాతనిపినతండ్రి యగు యుద్ధమల్లుని కుమారుఁ డయిన తాళరాజును నయియుందురు. కృష్ణరాజు సైన్యమును గూడఁ నోడించిన ట్లందున్నది. ఈశాసనమువలన దానముచేయఁబడిన గ్రామము కళింగదేశమందలి ఎలమంచిలిలోనిది. మూఁడవది యైన నరసాపురతామ్రశాసనము[3]వలన చాళుక్యభీముఁడు కృష్ణవల్లభుని సైన్యములను నతనికి సాయము వచ్చినవారిని నోడించినట్లును కర్ణాట లాట దేశపురాజు లీతనిముందు సూర్యునియెదుటఁ జీఁకటి పరుగెత్తునట్లు పాఱిపోయినట్లును ఈతనికుమారుఁ డొకఁడు ౧౬ సం॥ వయస్సు గలవాఁడు శత్రువులతో నిరవద్యపురమునొద్దను, పెరువంగురగ్రామమునొద్దను ఘోరముగఁ బోరి రాష్ట్రకూట సేనాధిపతి యైన దండెనగుండయ యనువానిఁ జంపి తాను రణనిహతుం డయినట్లును జెప్పఁబడియున్నది. బెజవాడలో నొకస్తంభముమీఁద నీతనికాలపు శాసన మొకటి[4] గలదు. అది యాతనికి సామంతుఁ డైనయొకరాజుచే నీతఁడు రాజ్యమునకు వచ్చిన పదునేడవయేఁటఁ జెక్కింపఁబడెను. అప్పుడు బెజవాడలోఁ బార్థీశ్వరుని దేవాలయము గట్టింపఁబడినది. ఈరాజుయొక్క మఱియొక తామ్రశాసనమునకు నకలు మెకంజిసంగ్రహము[5]నందు నాకు దొరకినది. ఇది పద్యమయము. ఇందు రాజులరాజ్యసంవత్సరపరిమితి కాలములుఁ గూడ పద్యములందే యియ్యఁబడినవి. మొట్టమొదట కుబ్జవిష్ణువర్ధనుఁడు వేంగీదేశము నాక్రమించుకొనియె నని యం దున్నది. భీమునితల్లి పేరు వెంగాంబిక యనియు నిందువలన మనకుఁ దెలియుచున్నది. రా జొకవీరునకు వాఁడు తనకుఁ జేసిన ఖడ్గసహాయము నిమిత్తమై యగ్రహారము నిచ్చెను. ఈవ్యాసమునకుఁ జివర పరిశిష్టమునందు నీశాసనమునకు నకలు నిచ్చియున్నాను.

తరువాతివా రీతనిగుఱించి చెప్పినసంగతులు:—మొదటి యమ్మరాజు మచిలీపట్టణతామ్రశాసనమునం[6] దిట్లున్నది. "చళుక్యభీమరాజు నకుఁ బెం

[1] Ep. Ind. Vol. v. p. 127. [2] C. P. no. 14 of 1908-9. [3] C. P. no. 1 of 1913-14 [4] Ep. R no. 833 of 1917. [5] ఈసంపుటమునకు చెన్నపట్టణమందలి మాన్యుస్క్రిప్టు లైబ్రరీవారు "Telugu Inscriptions Vol. I" అని పేరు పెట్టి దానికి 15-6-26 అను నంబరు పెట్టిరి. ఈసంపుటమునందు 185-వ పుటమొదలు 191 పుటవఱకు నీశాసనప్రతులు గలవు. [6] Ep. Ind. Vol. V p. 132.

పుట్టినిల్లు యొక్కతె గలదు. ఆమె పేరు నాగిపోతి. ఆమెకు గాముకాంబ యని యొకకూఁతు రుండెను. భీముని యీపెంపుడక్కకు కుమారస్వామితో సమానుఁ డయిన మహాకాలుఁ డనుకుమారుఁడు పుట్టెను. అతఁడు భీముని సైన్యమునకు వధిపతి యయ్యెను. శత్రుఖడ్గముల రాపిడివలన నగ్నిప్రజ్వలించెడి చోట్ల నెల్ల నీతఁడు తనరాజునకంటెఁ బూర్వమే ప్రత్యక్షమై యెన్నిపర్యాయములో శత్రువుల మూపు మాపెను." (శ్లో. ౫-౮). గుణగవిజయాదిత్యునితరువాత రట్టులు అనఁగా రాష్ట్రకూటరాజులు తెనుఁగుదేశము నాక్రమింపఁ బ్రయత్నించి రనియు వారిని వోడించి భీముఁడు రా జయ్యె ననియు మొదటి యమ్మరాజు యొక్క వేమూరుశాసనము[1]వలనఁ దెలియుచున్నది. భీముఁడు మిక్కిలి ప్రఖ్యాతిఁ జెందిన రాజువలెఁ గానవచ్చుచున్నాఁడు. ఆతనితరువాతిరాజు లాతనిగుఱించి మిక్కిలి గౌరవపూర్వకముగఁ జెప్పెదరు. ఇతనిమనుమఁ డైన మొదటి అమ్మరాజు ఇతని గుఱించి వ్రాసినది చూడుఁడు.[2]

__కృష్ణవల్లభుఁడు:__—భీమునిచే నోడింపంబడిన కృష్ణవల్లభుఁడు రాష్ట్రకూట రా జయిన రెండవకృష్ణుఁడు. భీముని తరువాతి చాళుక్యరాజులశాసనములవలన భీముఁడు ౩౦సం॥ రాజ్యముచేసె నని మన మెఱుఁగుదుము. అనఁగ నీతఁడు ౮౮౨ మొదలు ౯౧౨ వఱకు రాజ్యముఁ జేసి యుండవలెను. రాష్ట్రకూటద్వితీయకృష్ణుఁడు క్రీ. శ. ౮౭౮ మొదలు ౯౧౩వఱకు[3] రాజ్యముచేసెను. అనఁగ, కృష్ణుఁడు భీమునికంటె నెనిమిదేండ్లు పూర్వమె రాజ్యమునకు వచ్చి తొమ్మిదేండ్లు పూర్వము మరణమునొందెను. భీమునివి మనకు దొరకినశాసనము లాఱు. వానిలోఁ బ్రతి దానియందును నతఁడు కృష్ణుని నోడించినట్లు నాతఁడు చెప్పుకొని యున్నాఁడు. కృష్ణుఁడు మాత్రము తనశాసనమునం దెచ్చటను వేంగిరాజు నోడించినట్లు చెప్పుకొని యుండలేదు. కావున చాళుక్యభీమునివలన రాష్ట్రకూటులు గొప్ప పరాభవము నొంది రని చెప్పుట కెంతమాత్రము సంశయము లేదు.

__చాళుక్యభీమనగరము:__—చాళుక్యభీముఁడు ౩౬౦ యుద్ధములలో విజయుం డై తనపేరిట చాళుక్యభీమేశ్వరదేవునిఁ బ్రతిష్ఠించి దేవాలయముల నిర్మించె నని పిఠాపురమునందలి మల్లపదేవుని శిలాశాసనమువలనఁ[4] దెలియుచున్నది. ఆగ్రామమునకును భీమవర మనుపేరు వచ్చెను. అయ్యది చామర్లకోట సమీపమున నున్నది.

[1] S. S. I. Vol. I p. 39. [2] Ibid. [3] Mysore Gazetteer Vol. I. p. 324.
[4] Ep. Ind. Vol. IV. p. 226, 42.

ఈగ్రామమునకుఁ బూర్వము చాళుక్యభీమవరి లేక చాళుక్యభీమ పట్టణ మని పే రుండె నని యచ్చటి శాసనముల[1]వలనఁ దెలియుచున్నది. [illegible] రాజే దాక్షారామమున భీమేశ్వరుని దేవాలయము నిర్మించెను.

ప్రతిగ్రహీత్రి—ఈశాసనమువలన నొకవేశ్యాంగనకు దాన మియ్యఁబడినది. అప్సరసలలోఁ జాల్పఁదగు తుండక యనుభోగముదాని కుమారుఁడు మల్లన. వీఁడు తుంబురువితో సమానుఁ డఁట. అనఁగఁ బాట బాగుగఁ బాడుచుండె నని భావము. వానికూఁతురు చల్లవ. “అమోసమస్తగాంధర్వవిద్యావేదిని”. భోగము దానివంశవృక్షము స్త్రీనామముతో ప్రారంభ మగుటసహజమే. కాని నపుంస పురుషునిపేరు చెప్పఁబడుట యొకవింత. చల్లవతల్లిపేరు చెప్పక తండ్రిపేరు చెప్పుటకుఁ గారణ మేమై యుండును?

ఇదియైయుండు.—భోగముజాతిలో వ్యభిచారవృత్తి కూఁతులకే సంక్రమించును గాని కోడండ్రకు సంక్రమింపదు. భోగముదానికూఁతురు భోగము దైనను గోడలుమాత్రము కులస్త్రీవృత్తినే యవలంబించును. కోడలిని కూఁతురుగదిలోనికిఁ గూడ రానీయరు. ఇట్లు పతివ్రతగ నుండుకోడలి కాగృహమునందు కూఁతున కున్నగౌరవ ముండ దని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కోడలి నొకదాసిగఁ జూతురు. ఆకోడలిపే రెవరికిని దెలియదు. కావున మన శాసనమునందు రాజుగారు కూడ నామెపేరు చెప్పక యుపేక్షించుటయు సహజమె. ఇందువలన చల్లవయొక్క తల్లి వివాహిత యైనకులస్త్రీ యని మన మూహింపవచ్చును.

స్థలము:—చల్లవ కీయఁబడినభూమి అత్తిలివిషయమందలి అత్తిలిగ్రామము లోనిది. అత్తిలిగ్రామ మిప్పుడు కృష్ణాజిల్లాయందలి తణుకుతాలూకాలో నున్నది. కలుచంబఱ్ఱు శాసనము[2]నందును అత్తిలివిషయము పేరు వచ్చినది. అత్తిలిగ్రామ మిప్పుడు చిన్నదిగా నున్నను పూర్వ మొకప్పుడు పెద్దదిగా నుండి యొక విషయమునకు ముఖ్యపట్టణముగా నున్నట్టు తోఁచుచున్నది.

ఆజ్ఞప్తి:—ఈశాసనమున కాజ్ఞప్తి కడేయరాజు (సం. ౩౮.) భీముని యన్ని శాసనములలోను కడేయరాజే ఆజ్ఞప్తి గావచ్చును. అమ్మ[illegible] గవిజయాదిత్యుని యన్ని శాసనములలోను పండరంగుని పేరు ఆజ్ఞప్తిగ వచ్చును. ప్రకటింపఁబడిన [illegible] బెజవాడ శాసనము[3]వలన కడేయరాజు పండరంగునకు

[1] Vide inscriptions nos. 463, 473, 480, 486, 487, 488, of 1893. [2] Ep. Ind. Vol. VII. p. 185. [3] Ep. Ind. Vol. V p. 128.

ష్ణువర్ధనుఁడని తెలియుచున్నది. రెండవ అమ్మరాజుయొక్క మఱియొక శాసనమువలన[1] పాండురంగుని సంతతివాఁడయిన మఱియొకపురుషుఁ డాతనిమంత్రిగానున్నట్లు తెలియుచున్నది. కావున పాండురంగునివంశమువారు తరతరములుగ చాళుక్యులకొలువులో నుండిరని మన మూహింపవచ్చును.

కవివామనుఁడు:—ఈశాసనము రచించినవాఁడు భట్టవామనుఁడు (పం. ౩౮.) నరసాపురశాసన[2] మీతనిని కవివృషభుఁ డన్నది. ఈతఁ డెవ్వఁడో మనము నిశ్చయముగఁ జెప్పలేము గాని కావ్యాలంకారసూత్రములకుఁ గర్తయైన వామనుఁడు గూడ నీకాలపువాఁడుగఁ గానవచ్చుచున్నాఁడు. అతఁడు తొమ్మిదవశతాబ్దపు పూర్వుఁడుగ గాని పదవశతాబ్దమునకుఁ దరువాతివాఁడుగఁ గాని యుండఁజాలఁడని కొందఱు పండితుల యభిప్రాయము[3]. మనశాసనము తొమ్మిదవశతాబ్దపు చివరది; లేదా పదవశతాబ్దపు ప్రారంభమందలిది.

ఈవామనుఁడే యావామనుఁ డనుట కొకయాక్షేపము రావచ్చును. కావ్యాలంకారసూత్రములకుం గర్తయైన వామనుఁడు కాశ్మీరదేశజుఁ డని కొందఱు దొరలు వ్రాసియున్నారు. కాని యది భ్రమ. ఈభ్రమకుఁ గారణము కాశికాకారుఁ డైనవామనుఁడును కావ్యాలంకారకారుఁ డైనవామనుఁడు నొక్కఁడే యని తలంచుట. కాని వారు భిన్నపురుషు లని యిప్పుడు స్పష్టముగఁ దేలినది. కావునఁ గావ్యాలంకారకారుఁడు దక్షిణదేశజుఁ డగుటకు నేమియు నభ్యంతర ముండదు.*

కొ. వెం. లక్ష్మణరావు.

---

[1] Ep. Ind. Vol. IX p. 47-56. [2] Ep. Ind. Vol. V.p. 128. [3] "ఇత్థంచ వామనోయం క్రిస్తీయ దశమశతకోత్తరార్ధా న్నార్వాచీనః నవమదశకా న్న ప్రాచీన ఇతి ప్రమాణమార్గగత మితి ప్రాహుః" శ్రీవాణీశాస్త్రగ్రంథమాల ౫-వ పుష్పము, పీఠిక, పుట ౧౩.

*ఈవ్యాసముతోఁ బాటు ఈయఁబడిన శాసనపటముదిమ్మెలు నాకు పాట్నాపట్టణమందలి బిహార్ అండు ఒరిసా రిసర్చ్ సొసైటివారివలన లభించినవి. వారిసంచికకొఱకు నేను వ్రాసిన యింగ్లీషువ్యాసమింకను ప్రకటింపఁబడకపోయినను వారు తమ కర్చుతోఁ జేయించిన దిమ్మెలునాకుఁ బంపి యుపయోగించుకొనుటకు సెలవొసంగినందుకు నేను వారియెడ నెంతయుఁ గృతజ్ఞుఁడగును.

# మూలము.[1]

## మొదటి రేకు.

1. స్వస్తి శ్రీమాతాం సకలభువన సంస్తూయమాన మానవ్యసగోత్రా ణాం[2] హారితిపు

2. త్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం[3] మాతృగణపరిపాలితా నాం స్వామిమహా

3. సేనపాదానుధ్యాతానాం భగవన్నారాయణప్రసాదసమాసాదిత వర వరాహలా

4. ఞ్ఛనేక్షణక్షణవశీకృతారాతిమణ్డలానా మశ్వమేధావభృతస్నానప విత్రి

5. కృతవపుషాం చాలుక్యానాం కులమల [ం*] కరిష్ణోః సత్యాశ్రయ వల్లభే

6. న్ద్రస్య భ్రాతా కుజ్జవిష్ణువర్ధనో ష్టాదశవషా [ణ*] ణి తత్సుతో జయ సింహత్రయస్త్రి [ం*]

7. శతం। తదనుజేన్ద్రరాజనన్దనో విష్ణువర్ధనో నవ।తదాత్మజో మంగియువ రాజః పఞ్చ

8. వింశతి తత్తనుజో జయసింహ స్త్రయోదశ తదనుజః కొక్కిలి ష్షణ్మా సాన్ తద

9. గ్రజో విష్ణురాజోనుజ ముచ్చాట్య సప్తత్రింశతం తత్తనుజో విజయాది త్యభట్టార

## రెండవ రేకు: మొదటి ప్రక్క.

10. క ఏకోన్నవింశతిం।తత్తనుజో విష్ణురాజః శత్త్రింం[4]శతం!తత్సూను ర్విజయాదిత్యో భీ

11. మసల్కినామానాం[5] తత్పుత్రదక్షిణగంగబలంచ నిర్జిత్యాష్టశత న రేన్ద్రేశ్వరా

---

[1] ఆంధ్రసాహిత్యపరిషత్సంగ్రహాలయమం దున్న అసలు రాగి రేకులను బట్టి. [2] త్రాణాం- అని చదువవలెను. [3] జ్యాణాం-అని. [4] షట్ త్రింశతం-అని. [5] నామానం-అని.

12. ణాం కర్తా చత్వారింశతం। తత్తనయః కలివిష్ణువర్ధనో ధ్యర్ధ- వర్షం తత్పుత్రః కిర

13. ణపురమచలపురిమురువెల్లూరుపురా [న్] విదాహ్య స్వాశత్రిపుర మర్త్య మహేశ్వ

14. రనామ్నా[1] ఖ్యాతయుకో రాశి రాజభౌ యస్యశతం। అథవ [।*] కా లింగ గంగయా

15. ప్యాదికోశ లేశద్వపాదిచ। పాండ్యపల్లవహేమాది వారాత్యాఙ్యష్ట మాహార

16. త్[2]। గంగా నారోసయ గ్గింగకూట ష్నాం శిరోచ్ఛినత్। కృష్ణం నణే జయద్వష్టుం కస్స

17. మృతో [ా] సుజాహనాన్। స విజయాదిత్యశ్చతుచత్వారింశతం। వేం గీదేశమను

18. పర్ణి మస్థ యత్। తెదనుజస్తనో యువరాజస్య విక్రామాత్రా స్త సకలధ

రెండవ రేకు: రెండవ ప్రక్క.

19. రాచక్రస్య విక్రమాదిత్యభూపతేః ప్రియుతసయః। ఆ కేశవ్రేష్ఠు యాతేపృథమ

20. నువసుసంప్రా[4]ప్తేసంఖ్యేషు మేషే। మిత్రే నైత్రేచ మైత్రేశశిని శశి దినే కృష్ణ

21. పక్షద్వితీయే। యుష్మకుల స్యక్రమే ధాన్యకటజనము చే పట్ట మాచ ర్తారః[5] [।].

22. శ్రీమాజ్ఞాళుక్యకుము శ్చతుసవధలస్మేఖలేలాతలస్య [॥*] అథ చ। య

23. స్య ఖఙ్గజలవాద్ధి [౯]* నిమగ్నం। కృష్ణవల్లభబలం సపన్నం సప్త లోకా

[1] నామ్నా-అని. [2] శాసనశాఖవారిచే సంగ్రహింపఁబడిన 1913-14-వ యేటి 1-వ తామ్రశాసనమందు నీశ్లోకభాగమె యిట్లున్నది. 'హేమాదికలాన్యాగార్థి మాహరత్.' [3] సుహా హాసం-అని. [4] సంప్రాప్త-అని. [5] తారం-అని. [6] ఇచ్చట లేఖకుఁడు సగము శ్లోకము పాటపాటున వదిలివేసినాఁడు. వదలినసగము నరసాపురము తామ్రశాసనమునందు (C. P. No. 1 of 1913-14) నిట్లున్నది. "వ్యాప్తాయన్తు చతురంగబలంవా క్షిప్రమేవ విలయా గలినా." [రెండవరేకు పంక్తులు 7-8] ఈశాసనపు రేకు లిప్పుడు చెన్నపట్టణము చిత్రవస్తుప్రదర్శనశాలలో నున్నవి. అచ్చట వానికి Ch. E. 8 అని గుర్తు.

24. శ్రీ విష్ణువర్ధనమహారాజాధిరాజపరమేశ్వరః పరమబ్రహ్మణ్యః
చాలు

25. క్యభిమనా మాత్తిలివిషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుం
బినః

26. ఇత్థ మాజ్ఞాపయతి విదితమస్తువో స్మాభిః యాసా అప్సరోప[1]మా
గసంచ

27. కాఖ్యా తస్యాః యః పుత్రః [తుం]* బురుసమానో మల్లపాఖ్యః
తత్పుత్రా యా చల్ల

మూడవ రేకు.

28. వాఖ్యా తస్త్యై సమస్తగాన్ధర్వవిద్యావేదిన్త్యై అత్తిలినామగ్రామే
ఐశాన్యా

29. న్దిశి సహస్రక్రముకసుస్థానం[తస్మిన్నేవ గ్రామే వాయవ్యాన్దిశి పం

30. చాశత్తన్డికాం వ్రి[2]హిబీజవాపక్షేత్రం గృహస్థానఞ్చ దత్తమ్ [*]అస్యో

31. పరి స కేన చి ద్బాధా కరణీయా కరో [తి*] య స్స పఞ్చమహా
పాతకసంయు

32. క్తో భవతి [।*] వ్యాసేనాప్యుక్తమ్ [।*] [3]ష్టిర్షష్టివర్షసహస్రాణి స్వ
ర్గే మోదతి

33. భూమిదః [।] ఆక్షే [4]ప్తా చానుమన్తా చ తాన్యేవనరకే వసేత్ [॥]
ఆజ్ఞ ప్తి ర

34. స్య ధర్మస్య కడేయరా[5]జః॥ భట్టవామనేన రచి తేయం శాసనప
ట్టికాః [।*].

35. చామికుట్టాచార్యేణ లిఖితా [॥*].

[1] రోపమా-అని. [2] వ్రీహి-అని. [3] షష్టి-అని. [4] ఆక్షేప్తా-అని. [5] రాజః-అని.

# అనుబంధము ౧.

చాళుక్యభీముని పండిపాక తామ్రశాసనము.[1]

['స్వస్తి' మొదలు చాలుక్యానాం కుల మలంకరిష్ణోః వఱకు చాళుక్యుల మామూలు బిరుదములు· తరువాత]

సత్యాశ్రవల్లభేంద్రనామా బభూవ.
తద్భ్రాతా చ కనీయాః కుబ్జశ్రీవిష్ణువర్ధనో మనుజేంద్రః
సమధిష్ఠితాంధ్రవిషయాత్సరాదుచ్చాట్య యే దుర్జయానతులబల. ॥ ౧ ॥
సంప్రాప్యచ తత్ప్రథమం సతు వెంగీదేశమాత్మసాత్కృత్య।
జితమనుచరిత స్తస్మిన్వర్షాణ్యష్టాదశం కరోద్రాజ్యం ॥ ౨ ॥
తత్పుత్రో జయసింహ స్త్రయస్త్రింశతం భువ మరక్షత్।
తద్భ్రాతు రింద్రనృప తేసూనుః శ్రీవిష్ణువర్ధనోరాజ్యం ॥ ౩ ॥
వర్షాణి నవాకార్షీ త్తత్సూను ర్మంగి యువరాజ స్తు విజయః।
సచ పంచాధికవింశతి వర్షాణ్యకరో దనాకులం రాజ్యం ॥ ౪ ॥
తస్య సుతో జయసింహ స్త్రయోదశాబ్దా భురక్షదవనీతలః।
వైమాతు రానుజోస్యచ రాజ్యపదం కురుతే కొక్కిలి ర్మాసాన్ ॥ ౫ ॥
షట్ తస్య తముచ్చాట్య జ్యేష్ఠశ్రీవిష్ణువర్ధనో నృపతి।
అకృతకృతి జితశత్రు స్సప్తత్రింశత్సమా రాజ్యం ॥ ౬ ॥
తస్యచ విజయాదిత్యో భట్టారకశబ్దకీర్తిత స్తనయః।
అష్టాదశవర్షాణి క్షమాతలం పాలయత్ విజయః ॥ ౭ ॥
తనయోస్య విష్ణువర్ధననృపతి షట్ త్రింశత్సమారాజ్యం।
కృతవానథ తత్సూను ర్విజయాదిత్యో నరేంద్రమృగరాజః ॥ ౮ ॥
యః కర్త్రాష్టోత్తరశతశివాలయానాం స్వయుద్ధజయసంఖ్యానాం
[ ] చత్వారింశద్వర్షాణి క్ష్మాపాలయత్ సింహ [illegible] ॥ ౯ ॥

---

[1] చెన్నపురిలోని గవర్నమెంటు లైబ్రరీలో నున్న 15–6–26 సంఖ్యగల సంపుటములోని 185–191 పుటలలోనిది. ఇందుఁ బేళ్లలోఁ గాని వచనభాగములలోఁ గాని యేమియు దిద్దలేదు. పద్యభాగము మూలమందుఁ బద్యభాగముగ వ్రాయఁబడనందున దానిని పద్యములుగ వ్రాసితిని. మూలమునందు మఱి స్పష్టముగ నున్నతప్పులను కొన్నిఁటిని మాత్రము వృత్తము ననుసరించి దిద్దితిని. అయినను నీశాసనము నాలుగవదియో యైదవదియో యగుసకలు. కావున నిట్టివి నూతన సిద్ధాంతస్థాపనలకుఁ బ్రమాణములు కానేర వని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు.

కలివిష్ణువర్ధనోస్యచ తనయోరుధికవ్రరామరక్షుద్వర్షేః ।
తస్యచ విజయాదిత్యస్సూనుః పరచక్రరాజనృపతి గణాగః ॥ ౧౦ ॥
స చతుశ్చత్వారింశ ద్వర్షాణి క్ష్మాపాలయ న్ననుచరితః ।
తద్భ్రాతు ర్యువరాజవిక్రమరవే ర్వేంగాంబికాయాం సుతః ।
యోగి యోగమజనిశ్వరాది నసహా శ్చాళుక్యభీమాధిపః ॥ ౧౧ ॥
సోయం రట్టబలం విజిత్య రిపునిర్మూలం సమున్మూలయన్ ।
బధ్వా పట్టమభూధనస్యసదృశో భూమౌ ప్రశ్రీశాశ్వతః ॥ ౧౨ ॥
యస్మి న్రాజని రక్షతి క్షితితలం స్తేనా వినాశంగతాః
జారా మారణభీవసచ్చరితా జాతా నిత్యం మహా
దేశశ్చిత్రవిధా సురాసరసిగా వృష్టి ర్జనేచ్ఛానుగా
రోగా నాశగతాః ద్విజాశ్చ సుకృతా యాగాయ థో క్తక్రియాః ॥ ౧౩ ॥
మనురివ సకలజనానాం జనక ఇవా శేషభృత్యవర్గాణాం
కామ ఇవ కామినీనా మార్తజనానాంచ కల్పతరుః ॥ ౧౪ ॥

సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజాధిరాజపరమేశ్వర పరమభట్టారక పరమబ్రహ్మణ్యో మాతాపితృపాదానుధ్యాతః అన్వీక్షికాద్యది నీతినిపుణః । గుహాఇవ ప్రతిహతశక్తిః వైనతేయఇవ వినతానందజనకః । యుధిష్ఠిరఇవ భీమసేనావృతః ప్రచండారాతిమండలః - - - - - పాటువిషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినస్సర్వానిత్థ మాజ్ఞాపయతి విదితమస్తు వః। కౌండిన్యగోత్రాయ వాజసనేయ బ్రహ్మచారిణే సబ్బిశర్మణః పౌత్రాయ విదిశర్మణః పుత్రాయ రంగాధికరణాభిధానాయ అస్మదస్మసహాయనిమిత్తే సానకపూర్వం సర్వకరపరిహారాయాగ్రహారీకృత్య పండిపాకగ్రామ సాష్టావశగ్రామాధికః । కొప్పునిగ్రామాధిక పాత్తూరిపూర్వతశ్చ వల్లనిగ్రామాధికచ పొదరుపాక శ్చాస్మాభిః సంప్రదత్తా ఇతివితినామవధయః । పూర్వతః పాత్తూరిపర్యతశ్చ పూర్వాంతః । ఆగ్నేయతః పస్తొవునామపంద్రం । మాద్యానుగరుగుశ్చదక్షిణతః కనమువతనకాశాత్ । కుమ్మంగ మార్గతః। పురాణపంథాఃనైరుత్యాచ వృతపంథాః । పశ్చిమతః పుమ్మంగి కొమ్మినిగ్రామాధికయోమధ్యే న్నిర్ఝరనదీ। వాయవ్యతః కరుకుర్తిసీమైవ । తనూత్తరతః పంపానది। ఈశాన్యతః చిలుకూర్యరి సీమైవసీమా । అస్య ధర్మోపరి న కేన చిద్బాధాకర్తవ్యా॥ యః కరోతి స పంచమహాపాతకసంయుక్తోభవతి [illegible]ం గమిష్యతి । తథాభగవతా వ్యాసేనోక్తం॥ భహుభిర్వసుధా [ఇత్యాదిపురాతనములు శ్లోకములు]